# కవిరాజు
# త్రిపురనేని రామస్వామి చౌదరి
# జీవితం - సాహిత్యం


రచన

విమర్శకరత్న

త్రిపురనేని సుబ్బారావు



కవిరాజ సాహితీ సదనం

హైదరాబాద్—500 880

ముద్రణ
ప్రతులు 1000

హక్కులు :
రచయితవి

ప్రతులకు :
త్రిపురనేని సుబ్బారావు
కవిరాజ సాహితీ సదనం
ఇం. నెం. 8-3-214/15
శ్రీనివాస కాలనీ (west)
హైదరాబాద్-500 890.

వెల : 10/-

ముద్రణ :
సూర్యా ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాద్.

కోవడము, వివాహాది కార్యాలు చేయించడము—ఇలాంటి అధికారము లన్నీ అగ్రజాతికే ఉండేవి. గ్రామ పెద్ద రెడ్డినైనా అగ్రజాతి పిచంగా సంబోధించవలసిందే. ఏక వచన ప్రయోగంతో మాటలాడవలసిందే.

ఈ సమాజస్థితి వలెనే ఆ రోజులలో సారస్వతస్థితి కూడ లోప భూయిష్టంగా ఉండేది. ఇనుప గుగ్గిళ్ళవంటి కఠిన పదాలతో ఎవరికీ తెలియకుండా చెప్పినదే ప్రౌఢ కవిత్వం, తక్కినదంతా పేలపిండి. పూర్వ కవిపండితులు నిర్ణయించిన దానికి భళి భళి అన్నవాడే పండితుడు. స్వతంత్రంగా ఆలోచించి దానికి వ్యతిరేకంగా మాట్లాడిన వాడు అభాజనుడు. ఆంధ్రులు ద్రవిడ తెగవారని, ఆర్య రాముని కంటే ద్రవిడ రావణుడు ఎక్కువ విద్యావంతుడని, న్యాయబుద్ధి గలవాడని సహేతుకంగా చెప్పినందుకు కవిరాజును "బ్రహ్మద్వేషి" గా, నాస్తి కుడు" గా చేశారు. ఎన్ని చేసినా ఆ విప్లవవీరుడు లొంగలేదు. ప్రతి వాద కోటులకు వాగ్బంధనంచేసి వేదాలు పౌరోహిత్య విషయాలు క్షుణ్ణంగా నేర్చుకోడానికి తగిన యువకులను తయారు చేశారు. పెళ్ళి మంత్రాలలోని విషయం అందరికీ, ముఖ్యంగా వధూవరులకు సుబోధ కంగా వుండునట్లుగా తేట తెలుగున వ్రాసి అమలు పరిచారు. స్వయంగా వారు నడుం గట్టి అనేక వివాహాలు చేశారు.

పురాణాలలోని అసంబద్ధపు వ్రాతలను విరూపిస్తూ "పిట్టకథలకు నివి యెల్ల(బుట్టి నిండ్లు" అని సూత పురాణము పేరిట ఆంధ్ర పాఠ కులకు అమూల్యమైన విజ్ఞానాంజనము నిచ్చారు. మృదు మధురమైన శైలిలో తెలుగుతనం తొణికిసలాడే లాగా మహోదారమైన భావాలను తెలుగువారికి ఆమెతగా ఇచ్చారు. అవినీతి అపంటయినా తన జీవితాని

కంటకుండ ఇతరులకు మార్గదర్శియై అపార గౌరవము నార్జించు కొన్నారు. వందల కొలది ఆంధ్ర యువకులకు ఈనాడు మన కవి రాజు ఆదర్శమూర్తిగా నున్నారంటే ఆశ్చర్య మేముంది?

రామస్వామిగారు ఎక్కడ అన్యాయం జరిగినా ఖండించేవారు. గుణమును గౌరవించేవారు. "గౌరవమిచ్చి. గౌరవము పుచ్చుకో" అన్నదే వారి వాంఛ. అర్థంలేని స్వాధిక్య సూత్రములతో ప్రవర్తించ రాదనే వారి సచ్చరిత. పవిత్ర గ్రంథాలుగా భావిస్తున్న పురాణాలలో ప్రజలను మోసపుచ్చే వ్రాతలుండకూడదనే వారి వాదన. ఆరితేరిన విమర్శకునిగా మూర్తీభవించిన ఆత్మగౌరవముగా వారిని ఈనాడు కూడా ఆంధ్రలోకం అంతా చూస్తూవుంది. వారి మానవత్వ ఉపాసన. సాహితీసేవ. సంస్కరణాభిలాష. దేశభక్తి. నైతిక జీవనము ప్రశంసా పాత్రమనడానికి సందేహములేదు.

విషయాలూ. ఇతరుల గాథలూ ఎవ్వరేమని నవ్వుటకి, నిష్కల్మష హృదయులైన యువకులకు వారి యెడల గౌరవ ప్రవృత్తులు కలగడం సహజము. అట్టి యువకులలోని వారే ఈ రచయిత శ్రీ త్రిపురనేని సుబ్బారావు బి. ఎ. గారు. పితృసామ్య భావముగల విగర్యులు. భాషా ప్రియులు. చిరానుచితజ్ఞులు. ఆంధ్రపత్రిక. ఆంధ్రజ్యోతి. గోలకొండ. స్రవంతి మున్నగు వివిధ పత్రికలలో ప్రచురించిన అనేక సాహిత్య, సాంఘిక వ్యాసాలను బట్టిచూచినా, శ్రీ సుబ్బారావుగారు ఉదాత్తమైన అభ్యుదయ భావాలు కలవారని చెప్పక మానదు. సచివాలయ యోద్యోగములో నుండినా సాహిత్యసేవ మరచిపోని భాషా భక్తులు. సుబ్బారావు గారికి కవిరాజుగారి యందుగల గౌరవ మపారము. కవిరాజు గ్రంథము

అన్నింటిని సవిమర్శముగా పఠించినారు వారు చేసిన అమోఘమైన సాహిత్యసేవను, సంఘసేవను గ్రహించి ముగ్ధులైనవారు. నిష్కల్మష మైన, ప్రజాక్షేమంకరముగా నుండిన కవిరాజు హృదయమును అర్థం చేసుకోగలిగినారు గౌరవ మినుమడించినది. ఆ అపార గౌరవమే ఈ రచనగా రూపొందినది. గ్రంథ విషయము: బహుముఖ ప్రజ్ఞతో అనూఘ విజయములు సాధించిన విప్లవవీరుని జీవితము. రచయిత: సవిమర్శముగ వారి కృషిని పరిశీలించి అపార గౌరవాదరములను పొందిన విద్యాధిక భాషావేత్త. నిజముగా ఎంత పెద్ద గ్రంథమో వ్రాయదగిన సన్నివేశము. ఇంతకంటే విపులీకరించి చెప్పవలసిన విషయ ములు కవిరాజు జీవితములో చాలా గలవు ఇంతకంటే ఎక్కువ వ్రాయ గల అవకాశము, సామర్థ్యము సుబ్బారావు గారికి ఉంది. అయినా కవి రాజు జీవిత. సాహిత్యముల సంగ్రహ స్వరూపమే మనకు లభించినది. దీనికి కారణము ఒకటయి ఉంటుందని అనుకొంటున్నాను. సుబ్బారావు గారు వంశాభిమానంతో వ్రాశారని ఇతరులు అనుకుంటారేయో అన్న భావముతో తన రచనోద్రేకమును చాలా వరకు నిరోధించుకొని ఉండవచ్చును.

ఆంధ్రజాతికి, ఆంధ్ర సాహిత్యమునకు కవిరాజు చేసిన గొప్ప సేవకు తగినట్లు ఈ గ్రంథము ఆంధ్ర సరస్వతి కలంకారముగా నుండ గలదని ఆశించుచున్నాను కవిరాజువంటి మహానుభావుని ఆదర్శ జీవి తమును గూర్చి ఈ నాలుగు మాటలనూ నా 74వ జన్మదినమైన ఈనాడు వ్రాయగలగడం నిజంగా ఒక సుకృతమనే భావిస్తున్నాను.

హైదరాబాదు
19—9—1960

ఆంధ్ర విశారద
తాపీ ధర్మారావు

# ఉత్తమ కృషి

శ్రీ సుబ్బారావుగారు చేసింది చాలా మంచిపని, ఇది చాలా అవసరమైనదికూడా.

పరిశోధనతో వ్రాసిన తెలుగుకవుల చరిత్రలు బహుస్వల్పం. వీరేశలింగంపంతులుగారు, ఎంతో శ్రమించి, శోధించి, ఆంధ్రకవుల చరిత్రను తెలుగులోకానికి అందించారు. అయినా కవుల జీవితచరిత్ర వ్రాయడం ఆంధ్రదేశానికి అంతగా అలవాటుకాలేదు. ఉన్న కొన్నికూడా సమగ్రమైనవి, శాస్త్రీయమైనవికావు. అందులకు కారణం చారిత్రకదృక్పథం ఆంధ్రులలో అంతగా అలవడకపోవడమేనేమో అని, అనిపిస్తుంది నాకు.

ప్రఖ్యాతకవుల, ప్రముఖ రచయితల జీవితగాథలను, రచనలను సమగ్రంగా పరిశీలించవలసివుంది. వారి జీవిత వివరాలు, వారిని ప్రభావితుల్నిచేసిన సంఘటనలు, సన్నివేశాలు, వారు పుట్టి పెరిగిన కాలమాన పరిస్థితులు, వారు ప్రసరింపచేసిన భావవీచికలు, వాటి మూలకారణాలతోసహా వివరించే గ్రంథాలు మనకు కావాలి. అవి విమర్శలుగానే కాక, చరిత్రలుగా రూపొందాలి. ఒక దృక్పథాన్నేకాక, సత్యమైన సమగ్ర రూపాన్ని, అవి చిత్రించాలి.

ఇక త్రిపురనేని రామస్వామిగారు రచయితలతో కవిరాజు, మనుషులలో మహామనీషి. రచనలో తెలుగుకు తెలుగుతనానికి, తెలుగు నుడికారానికి ప్రాధాన్యతనిచ్చిన సిసలైన తెలుగుకవి. ఆంధ్ర సాహిత్యంలో హేతువాద దృక్పథాన్ని ఆవిష్కరించిన మార్గదర్శి, భారత

సాంస్కృతిక చరిత్రకు నూతన నిర్వచనాన్ని నెలకొల్పిన భావుకుడు, సంప్రదాయాల పరిశీలనతో ప్రారంభించి, అన్నిటికీ మూలకందమైన ఈశ్వరవాదాన్ని త్రోసిపుచ్చేవరకు పరిణతి నొందిన భావశబలత కవి రాజుది. ఆయన పండితుడు, తార్కికుడు, తాత్వికుడు, గద్యంలోను పద్యంలోను అసమానశక్తి సంపదలతో రచనగావించిన సవ్యసాచి. ఈ శక్తి సంపదలు చాలావరకు కవిరాజు స్వయంకృషి ఫలితాలు. ఇట్టి మహామనీషి, ఇట్టి మహాకవి జీవితచిత్రణ, సాహిత్యకృషి పరీక్ష ఆంధ్రదేశానికేకాదు, భారతదేశానికే ఎంతో అవుసరం. అయితే ఆ పని సామాన్యమైనదికాదు, సులభసాధ్యమైనదీకాదు.

కావి ఇందుకు తగినశక్తి. ఆసక్తి సుబ్బారావుగారికి దండిగా వున్నాయి. తన కథావస్తువుమీద సుబ్బారావుగారు ఎంతగానో కృషి చేశారు, ఆ కృషిఫలితమే ఈ చక్కని రూపకల్పన, ఈ జీవిత చరిత్రచదువుతూంటే, నాకు బాస్వెల్ వ్రాసిన జాన్సన్ జీవితచరిత్ర జ్ఞాపకానికి వచ్చింది. అంతటి పసగల చరిత్ర చిత్రణ ఇదికూడా.

చారిత్రకదృష్టిని తెలుగునాట ప్రతిష్ఠించిన కవిరాజుచరిత్రను, చరిత్రపరిశోధనకై అహరహము శ్రమించే ముళ్ళపూడి తిమ్మరాజు గారికి అంకితం ఇవ్వడం చాలా సముచితంగావుంది. అందులోను తిమ్మరాజుగారు భాషారసికులు.

శ్రీ సుబ్బారావుగారు అన్నివిధాలా మెచ్చుకోదగ్గ ఉత్తమకృషి చేశారు. అందుకు వారిని హృదయపూర్వకంగా నేను అభినందిస్తున్నాను.

హైదరాబాద్. ఆవుల సాంబశివరావు
1-1-1964

## సంఘ సంస్కర్త కవిరాజు

సకల దిశలన్ సత్యకాంతుల
      శాసనంబది లేచియాడెను ;
ఘడియ వచ్చెను ఘనతజాటగ
      గడియ పడె నవమార్గ యాత్రకు.

విప్లవమ్మును లేవదీసిన
      వీరుడవు ! కవిరాజశేఖర !
తోటి తమ్ముల భుజముతట్టి
      బాట జూపిన భవ్యతేజుడ !
అరుపు తెలివియె మిగిలి జ్ఞానము
      కరువయిన చెడు సంఘ మందున
కొదువ లేని సత్యసంపద—
      కొల్ల కొల్లగ పంచి నాడవు !

ఆభిజాత్యపు టహంకారము
      నమాంతముగ నణగద్రొక్కి,
మౌఢ్య జాడ్యము విచ్చిపారెడి
      మందు లిచ్చినరాచ వైద్యుడ !

రంకు గొంకుల బొంకు వాదుల
పాతరల పెకిలించి నాడవు
నీతి ధర్మము, సద్వివేచన
హేతువాదము సలిపి నాడవు !!

నీవె కవివి ! నీవె రవివి !!
నీవె సత్యాత్ముడవు, త్యాగివి !
భావవిప్లవ భాగ్య దాతవు
భవ్య సూత్రాశ్రమపు యోగివి !!

కలుషితపు జ్ఞానంబు ప్రబలి
కాడు గలసిన వంషమందున
వెలసి జీవనజ్యోతి కాంతుల
వెలుగు జిమ్మిన తెలుగు రాజువు !

సమతయే సుమి! మమతయిలలో
సాగిపొమ్మని నేర్పి నాడవు !
మానవత్వపు మహిత కాంతుల
మార్గ మందున నిలచినాడవు !

బుద్ధదేవుని అపరమూర్తిగ
భువిని వెలసిన కర్మయోగివి !
నల్దెసల చైతన్య భేరీ
నాదమును విన్పించినాడవు !

తెలుగువారల ఆత్మలందున
వెలుగుచుందువు ఎల్ల వేళల
నీదు జీవితకథలు పాడెటి
నిందుకాలము రాకమానదు !

అభిరుచుల నవకాశములకున్
అడ్డు తగిలిన అహంభావుల
స్వార్థ వాదుల నెల్ల తరిమిన
స్వామి ! నీదే ధన్య చరిత !

మరువరానిది నీ చరిత్రము
మానవాళికి తరతరాలుగ
దుష్ట సంఘాచార ఘోరము
భ్రష్టమై ఇల తోకముడువగ,
మరువరానిది నీ చరిత్రము !

రాజకవి ! ఓ జ్ఞాన భాస్కర !
రత్నకాంతుల విసాళించిన
నీ మహోజ్వల మప్రబోధము
నిఖిల జగతికి నవోన్మేషము.

సుల్తాన్ షాహి
హైదరాబాద్.

గులాం యాసీన్

# రెండు మాటలు

ఇప్పటికి రమారమిగా యిరవై సంవత్సరాలవుతుందను కొంటాను, గుంటూరు జిల్లాలోని తాడికొండ గ్రామంలో వివిధ మత సమ్మేళనం జరిగింది. అప్పటి యువతరంవారు ఈ సమ్మేళనాన్ని ఏర్పాటు చేశారు. రాజకీయ బీజాలింకా గ్రామాలలో ముమ్మరంగా పడలేదు. హృదయంలో దాచుకోలేని ఉద్వేగాన్ని, ఉత్సాహాన్ని యువకులు ఈ సమ్మేళనంద్వారా ప్రదర్శించారు. చుట్టుప్రక్కల చాలా గ్రామాలనుండి, బండ్లు కట్టుకొని, కాలినడకనా, వేలాది ప్రజలు వచ్చారు. సమ్మేళనం జరిగినన్ని రోజులూ, తాడికొండ యాతాయాత ప్రజానీకంతో పిటపిట లాడిపోయింది. నేను తొలిసారిగా "కవిరాజు" గారి దర్శనం చేసిందప్పుడే !

ఆతరువాత మరో రెండు మూడేళ్ళకు గాని, రామస్వామి చౌదరి గారి పుస్తకాలు చదివే అవకాశం నాకు లభించలేదు. ఆ గ్రంథ పఠనంతో కళ్ళ ముందున్న ఏవో తెరలు తొలగి నట్లని పించింది. జీవితసౌధంలోని ఒక క్రొత్త కిటికీ తెఱచికొన్నట్లనిపించింది.

"పుస్తకాలు మనిషిని మారుస్తాయా?" అన్న ప్రశ్నకు, "అలా మార్చ గలిగినవే ఉత్తమ గ్రంథాలు" అన్నది ప్రత్యుత్తరం. నాజీవితం మీద ప్రబలమైన ప్రభావాన్ని కలిగించినవారు, రామస్వామి చౌదరిగారు.

గుడిపాటి వెంకట చలంగారూ, గోపరాజు రామచంద్ర రావుగారునూ. ఈ త్రిమూర్తులే లేకపోతే, వీరి పుస్తకాలే లేకపోతే, నేనిలా ఉండే వాణ్ణి కాదనుకొంటాను.

1940వ సంవత్సరంలో మరో మిత్రునితో కలిసి తెనాలిలోని "సూతాశ్రమం"లో రామస్వామి చౌదరి గారిని రెండవసారి దర్శించాను అప్పుడు ఆ మిత్రుని గ్రామంలో యజ్ఞం జరుగుతూ ఉంది, యజ్ఞ వేదిక దగ్గిర ఓ చిన్న విషయంలో పేచీ వచ్చింది. ఆ పేచీ రగులుకొని రగులుకొని పొగలు, సెగలూ, విరజిమ్మింది. రెండు తెగలవారూ, ప్రథమ దక్షిణ మాకు రావాలంటే మాకు రావాలని హోరాహోరిగా వాదించుకొన్నారు, ఏమీ తేలలేదు. ఇరు పక్షాలవారు, రామస్వామి చౌదరి గారిని మధ్యవర్తిగా ఎన్నుకొన్నారు. వేదాలనుండి, స్మృతుల నుండీ వందలాది ఉదాహరణలిస్తూ దక్షిణ ఎవరికి రావాలో చౌదరిగారు సోపపత్తికంగా రుజువు చేశారు, ప్రతిపక్షంవారు కూడా. చౌదరిగారి తీర్పును కాదనలేకపోయారు. వారు చెప్పిందే వేద విహితమని మనః పూర్వకంగా అంగీకరించారు రవ రవలు సమసిపోయాయి. యజ్ఞం సజావుగా సాగిపోయింది. న్యాయం గెలిచింది.

1944 వ సంవత్సరంలో "శంబుక వధ" నాటకం వేయాలని, తాడికొండలోని యువకులం అనుకొన్నాం, అనుకోవడమేమిటి, పాత్రల నిర్ణయం జరగడమేమిటి, పోర్షన్లు రాసుకోవడమేమిటి, గంటల మీద జరిగి పోయింది. అందులో నేను శంబుకుని పాత్ర ధరించాను. నాటకం జయప్రదంగా ప్రదర్శించాం.

ఉ. "చాకలి వాని మాటలు నిజమ్మని నమ్ముచు శంకితాత్ముడై
యా కమలాయ తాక్షిని, సమంచిత సాధ్విని బూర్ణ గర్భిణిన్
లోకులు నవ్వ గారడివిలో వసియింపగ నట్టెపంపడే
యా కతు నింతయేని నెదురాడని తల్లియటంచు గా దొకో"

అన్న పద్యం పాడి నప్పుడు, ప్రేక్షకులలో కలిగిన సంచలనం. ఇప్పటికీ నా కళ్ళలో మెదులుతూ ఉంది.

ప్రతి తరమూ, తనకు కావలసిన నాయకత్వాన్ని తనే సృష్టించు కొంటుందంటారు. హింసా ప్రవృత్తితో సమాజం గుబులెత్తి పోతున్నప్పుడు, సిద్ధార్థుడు అవతరించాడు. సమాజంలోని సగ భాగంగా ఉంటున్న స్త్రీలు, పురుగుల్లా జీవిస్తున్నప్పుడు వీరేశలింగం పంతులుగారూ సంస్కృతాభరణాల భారంతో, తెలుగుసాహితీమతల్లి, డస్సిపోయినప్పుడు గిడుగు రామమూర్తి పంతులుగారు, అవ్యవస్థిత స్థితిలో తెలుగు సమాజం ఉన్నప్పుడు రామస్వామి చౌదరిగారూ అవతరించారు.

తెలుగు దేశంలో-ఆమాట కొస్తే ఏ దేశంలోనైనా-విప్లవోద్యమం ప్రతిఘటన లేకుండా సాగారిన ఉదాహరణలు లేవు. ఆనాడు "చాపకూడు" పద్ధతిని బ్రహ్మనాయుడు ప్రవేశ పెట్టినందుకు, పలనాటి యుద్ధం జరిగింది. వ్యావహారిక భాషావాదాన్ని చేపట్టినందుకు గిడుగు రామూర్తి పంతులుగారు, ఎన్నో బాధలు పడవలసి వచ్చింది. రామస్వామి చౌదరి గారు ఇంతకన్నా ఎక్కువ ప్రతిఘటనలను ఎదుర్కొన వలసి వచ్చింది. సామాన్యులు మొన్నటి జీవితాన్ని ఈనాడు జీవిస్తారు. మహాత్ములు రేపటి జీవితాన్ని ఈ రోజే జీవిస్తారు. అందుకని, సమకాలీన

సమాజానికి వీరి మీద ఆగ్రహం అధికంగా ఉంటుంది. చేతనైనన్ని విధాలా వీరిని హింసిస్తుంది. చివరికి వారినే అవతార పురుషులని ఆరాధిస్తుంది. సమాజం తీరే ఇటువంటిది ! ఈ రోజున జగత్పూజ్యుడనిపించు కొంటున్న "బాపూజీ" ఒకప్పుడు తెల్లవారిచేత "నిగ్గర్" అనిపించు కొన్నవాడే !

ప్రకాశం పంతులు, ఆచార్య రంగా గార్ల జీవితచరిత్రలు వ్రాసిన పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారు కవిరాజుగారి జీవితం కూడా అంత ఉదాత్తమైనదేనని, దీనిని తెలుగువారు వ్రాసుకొన లేక పోవడం దురదృష్టకరమన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఆ లోటును మిత్రులు త్రిపురనేని సుబ్బారావు గారు తీర్చారు. ఆంధ్రాంగ్లసాహిత్యాలలో శ్రీ సుబ్బారావు గారి కున్న పరిచయం అమూల్యమయింది. మూడేళ్ళ క్రిందటనే వీరు "కవిరాజు జీవితం—సాహిత్యం" అను శీర్షిక క్రింద కొన్ని వ్యాసాలను ప్రకటించారు. సంగ్రహంగా ఉన్నప్పటికీ, ఆ వ్యాసా లెంతో విషయ పరిపుష్టంగా ఉన్నాయి. ఇలా చెదరు మదురుగా కాకుండా, కవిరాజుగారి జీవితాన్ని.సాహిత్యాన్ని పరిశీలించి, విపులంగా వ్రాయడం బాగుంటుందన్నాను అప్పటికే వారా ప్రయత్నంలోవున్న సంగతి నాకు తెలియదు.

18 మాసాలుగా "స్రవంతి" పత్రికలో వెలువడిన సుబ్బారావు గారి వ్యాసాలన్నీ చదివాను, ప్రభుత్వోద్యోగంలో ఊపిరి సలుపని పనుల్లో మునిగి వుండి కూడా, ఇంతటి విస్తృతమైన పరిశోధనను వీరెలా చెయ్యగలిగారో తెలియదు కవిరాజుగారి మొత్తం సాహిత్యాన్ని కొన్ని భాగాలుగా విభాగించి, ఒక్కొక్కదాన్ని గురించి, సమగ్రంగా వ్రాసిన పద్ధతి బాగుంది.

ఈ వ్యాసాలు చదివిందాకా, కవిరాజుగారి పట్ల సమకాలీను వెలి బుచ్చిన అభిప్రాయాలేమిటో నా మట్టుకు నాకు తెలియదు. వివిధ పత్రికలలోనూ, వివిధ సందర్భాలలోనూ, పెద్దలు వెలిబుచ్చిన అభి ప్రాయాలన్నింటినీ, జాగ్రత్తగా, ఓపికతో సేకరించిడమన్నది మాటలతో అయ్యేపనికాదు. ఆ అభిప్రాయాలను, తగిన స్థలాలలో పొందు పరచడమన్నది సుబ్బారావుగారి రచనా శిల్పానికొక ఉదాహరణ.

ఏదైనా ఒక పుస్తకాన్ని ఆసక్తిగా చదవడం వేరూ, దానిలోని ప్రతి అక్షరాన్ని కూలంకషంగా పట్టి చూడటం వేరూనూ. మొదటి పనికి కేవలం ఉత్సాహముంటేచాలు; కానీ రెండవపనికి, ప్రతిభ, పాండి త్యముకూడా ఉండాలి. మిత్రులు సుబ్బారావుగారు, ఈ రెండవ పనిని జయప్రదంగా నిర్వహించారు, పైకి వచ్చి భౌతికవాదిగా కని పించినప్పటికీ, కవిరాజుగారి అంతరాంతరాల్లోని ఆధ్యాత్మిక వాసనలను, శ్రీ సుబ్బారావు గారు చిత్రించిన ఘట్టం అమృతప్రాయమైనటు వంటిది.

సామాన్య పాఠకుడు కవిరాజుగారి రచనలోని ఆధ్యాత్మిక వాసన లను ఆఘ్రాణించలేడు. వాటిని అందరికీ పంచిపెట్టి శ్రీ సుబ్బారావు గారు ధన్యులయ్యారు.

కవిరాజు గారి జీవిత సాహిత్యాలను గ్రంథ రూపంలో తెస్తుం న్నందుకు శ్రీ సుబ్బారావుగారిని హృదయ పూర్వకంగా అభినందిస్తు న్నాను, వీరికృషి మరింతగా కొనసాగి, మరుగుపడిన మాణిక్యాలెన్నో, తెలుగువారి ముంగిటి లోనికి రావాలనీ, రాగలవనీ ఆశిస్తున్నాను.

ఆకాశవాణి
హైదరాబాదు

డాక్టర్ రావూరి భరద్వాజ

# ప్రశంస

ఇటీవల నేనొక మిత్రునితో మాట్లాడుతున్న సందర్భంలో షేక్స్పియర్ నాటకాల ప్రసక్తి వచ్చింది. "అంతగొప్ప నాటక రచయితకు దయ్యాల మీద, భూతాల మీద నమ్మకం ఉండటంలో అర్థం లేదు అన్నారు నా మిత్రుడు.

"ఏ రచయిత అయినా, కవి అయినా, చిత్రకారుడయినా, సమకాలిక సమాజంయొక్క ప్రభావాన్నుండి పూర్తిగా బయట పడలేదు. ఆ వాతావరణంలో వుంటూనే, విశ్వగీతికను వారు ఆలాపిస్తారు, కలకాలం నిలచిపోగల దివ్యసందేశాన్ని భావితరాల వారికి ప్రసాదిస్తారు" అన్నాను నేను. ఆ మిత్రునికి ఆ సమాధానం నచ్చిందో లేదో నేను అడగనూ లేదు. అతను చెప్పనూ లేదు.

చెప్పవచ్చిం దేమిటంటే, ప్రస్తుత స్థితిగతులను, సామాజిక వాతావరణాన్ని ఆధారం చేసుకొని, గతంలోని సాహిత్యాన్నిగాని, కళా సంపదనుగాని, ఉద్యమానులగాని, విమర్శించటం భావ్యంకాదని మాత్రమే. ఈనాడు వ్యావహారిక భాషావాదం మనకు చాలా తేలికగా కనపడవచ్చు. కాని, గిడుగు రామమూర్తిగారి కాలంలో అలాకాదు. వ్యావహారిక భాషాప్రచారంకోసం వారు పడరానిపాట్లు పడ్డారు. దిగ్గజాలవంటి గ్రాంధిక వాదులైన పండితులతో హోరాహోరిగా సాహిత్య సమరాలను జరిపారు, ఆనాడు రామమూర్తి పంతులుగారే లేకపోతే, ఈనాడు వ్యావహారిక భాషకు ఇంతటి ప్రాచుర్యం వచ్చి ఉండేది కాదనుకొంటాను.

అదే విధంగా వీరేశలింగం పంతులుగారు స్త్రీ పునర్వివాహోద్యమాన్ని ఆనాడు ప్రారంభించి ఉండకపోతే, ఈనాటి తెలుగు దేశంలోని

సాంఘిక జీవితం ఎంత అల్లకల్లోలంగా ఉండేదో మనం ఊహించలేం. వీరేశలింగం పంతులుగారి ఉద్యమాన్ని మొగ్గలోనే త్రుంచి వేయాలని, విశ్వప్రయత్నాలు జరిగిన సంగతి, ఈతరం వారికి తెలియక పోవచ్చు. కాని వారి సంస్కారణోద్యమ ప్రభావం వల్లనే ఆధునిక సమాజంలో స్త్రీ పునర్వివాహ మన్నది ఒక సమస్యగానే పరిగణించ బడటంలేదు.

ఈ మహామహుల కోవలోకి చేరినవారే కవిరాజు శ్రీరామస్వామి చౌదరిగారు. రమారమిగా పాతిక సంవత్సరాల పాటు, కవిరాజుగారు సమకాలీన సమాజంతో తీవ్రమైన ఘర్షణ పడ్డారు. అప్పటి సాంఘిక వాతావరణం ఎంతటి కల్మషాత్మకంగా ఉండేదో, ఇప్పటి తరం వారికి తెలియదనడంలో, సాహసం లేదను కొంటున్నాను.

ఆ రోజుల్లో కులాల మధ్యగల సరిహద్దులు మరింత విస్పష్టంగా ఉండేవి. జన్మతోనే కొందరికి ఆధిక్యత, మరికొందరికి న్యూనత సంక్రమిస్తుందన్న నమ్మకాలు విరివిగా ప్రచారంలో ఉండేవి. బ్రాహ్మణేతరులు సంస్కృతం చదవడానికిగాని, సంస్కృత గ్రంథాలను స్పృశించడానికిగాని హక్కు వుండేదిగాదు. శుభాశుభ కార్యాలలో బ్రాహ్మణ వర్గం వారికి ఆధిపత్యం ఉండేది. అమానుషమైన ఈ విధానాన్ని ఆంధ్రదేశంలో తొలిసారిగా బద్దలు కొట్టిన వారు రామస్వామి గారే ! దీనికి నిదర్శనంగా వారి సూతపురాణ పీఠికలోని కొన్ని పంక్తులను పఠించండి. "విప్రుడా ! లోకపరివర్తనము గమనింపుము. హిందూ సంఘమునందు నీవొక్కడవే ప్రాజ్ఞుడవై యుండి యధికారము సాగించుకొనవలయునని యత్నించినచో గొన్ని నాళ్ళకైనను కుల క్షయము, సంఘ క్షయముకాక మానవు ఇతర సంఘములు నిన్ను దిగ మ్రింగక మానవు జపాను దేశమునందలి "సామోయ్" జాతి చూపిన యాత్మ త్యాగముతో శతాంశము జూపించలేవా? అకలంకుడు, సత్యాధిక పూర్వాచార పరాయణుడును నగు మాలవ్య పండితుని వర్తనమునందు

గలిగిన పరివర్తనమునైన నేల కన్గొనవు? పరుష వాక్యములని మమ్ము గినియకుము. సత్య మెప్పుడును బరుషముగనే యుండునుగదా!" ఈ విధంగా బ్రాహ్మణులలో అనాత్మ పరివర్తన, విశాలదృష్టి, సమతా భావం ఏర్పడా లన్నారు చౌదరీగారు. కవిరాజు గారిని "కవి"గా మాత్రమే గుర్తించడమంటే చాలా అన్యాయం చేసిన వారమవుతాము, కిటికీలోనుండి కనిపించేదే లోకమనీ, అంతకు మించి మరేదీ లేదని అనడం లాంటిదే ఇదీనూ! రామస్వామి గారిలో "కవి" ఒక భాగం మాత్రమే! ఆ రోజుల్లో చౌదరిగారి "సూత పురాణం"— "ఖూనీ" "ధూర్త మానవా", – "భగవద్గీత", – "సూతాశ్రమ గీతాలు "– "వివాహవిధి" మొదలైన గ్రంథాలు బ్రహ్మాండమైన సంచలనాన్ని కలిగించాయి. అసంఖ్యాకులైన పాఠకులకు, ఆ యా గ్రంథాలు శిరోధార్యాలు కాగా, మరికొందరు కోపంకొద్దీ వాటిని నడివీధిలో తగలేశారు. ఈ సంగతి తెలిసిన చౌదరిగారు "ఇలా జరిగినా బావుంది. నా పుస్తకాలు త్వరగా అమ్మడై పోతాయి" అన్నారట చిరునవ్వు నవ్వుతూ.

తెలుగు దేశం రెండుగా-ఒకటి-కవిరాజు ఉద్యమానికి అనుకూల వర్గం-మరోటి-ప్రతికూల వర్గంగా చీలిపోయి వాదోపవాదాలతో దద్దరిల్లి పోయింది.

కవిరాజుగారి ఉద్యమాన్ని అణచి వేయాలన్న ప్రయత్నాలు ముమ్మరంగా కొనసాగాయి. ఇలాంటి ప్రయత్నాలు చరిత్రకు క్రొత్తకావు. బ్రాహ్మణుల యెడ పరుషంగా పలికినందులకే మన దేశంలో బౌద్ధ, జైన మతాల సాహిత్యం నశింపజేశారు. యజ్ఞ యాగాదులు మిక్కిలి హేయము లన్నందుకు చార్వాకుడు, వైశంపాయనునిచే రాక్షసుడుగా చిత్రించ బడ్డాడు. అదే విధంగా "బ్రాహ్మణ ద్వేషి", "నాస్తిక వాది" ఇత్యాది పేర్లు పెట్టి చౌదరిగారిని అణగ ద్రొక్కాలని యత్నించారు. కాని ఏ ప్రయత్నమూ ఫలించలేదు. రామస్వామి గారు భాస్కరుని వంటివారు. తను చండప్రచండంగా ప్రకాశించడమే

కాకుండా, తమ పరిధిలోని వారిని కూడా ప్రతిభావంతులను చేశారు. ఆ రోజుల్లో తలెత్తిన ఏ ఉద్యమమూ, వారి ప్రసక్తి లేకుండా జరగలేదు. వారి ఆశీర్వాదాలను పొందకుండా ప్రారంభం కాలేదు. వివిధ సంస్కరణోద్యమాలకు "సుతాశ్రమం" పుట్టినిల్లు అయింది.

చౌదరిగారి సమగ్ర జీవితం దురదృష్టవశాత్తూ ఇంత కాలంగానూ గ్రంథ రూపం దాల్చలేక పోయింది వారి పేరుమీద వెలిసిన సంస్థలు గాని, వారి ఉద్యమంలో పనిచేసిన వారు గానీ, సహచరులుగానీ, వారి జీవిత చరిత్రను ప్రకటించడానికి పూనుకోలేదు. అందులకు కారణం "చౌదరిగారి జీవితం తిన్నని బాటకాదు. ఆయనవి చిక్కుదారులు-చిత్రరీతులు. గుమ్మంలో నిల్చిచూచి పోదామనే వారికి ఆయన వాక వైరుధ్య వల్మీకం, బాహ్యానుశీలికి ఆయన నడక వీణమెట్లు మీద మ్రోయించ వీల్లేని అపరాగము. అపశ్రుతులు. సూక్ష్మదృష్టికే ఆయన లోని అంతర్లయ - అంతశ్రుతి అనుభూత మవుతాయి." ఈనాటికి మిత్రులు త్రిపురనేని సుబ్బారావుగారు తమ సాహితీ తపస్సుద్వారా ఆ పనిని పూర్తి చేశారు.

సుబ్బారావుగారిని చూసినప్పుడల్లా నాకు భగీరథుడు జ్ఞాపకం వస్తూ ఉంటాడు. తనవారికి ఉత్తమలోక ప్రాప్తి కలిగించడం కోసం భగీరథుడు తపస్సుచేసి, గంగను, దివినుండి భువికి అవతరింప చేశాడు. అదేవిధంగా, సుబ్బారావుగారు కూడా, మౌలికమైన కృషిచేసి కవిరాజు గారి జీవితం, సాహిత్యంలోని ఘనవఘట్టాలను తెలుగు వారికి పరిచయం చేశారు. "స్రవంతి" లో ధారావాహికంగా ప్రచురించబడ్డ వారి వ్యాసాలన్నింటిని కడు ఆసక్తితో చదివాను. ఈ సందర్భంగా వారెంత కృషి చేసింది అప్పటికి గాని, నేను తెలుసుకోలేక పోయాను.

రామస్వామి చౌదరిగారి జీవితంతో మరుగుపడి పోయిన ఎన్నో విషయాలను సుబ్బారావుగారు వెలుగులోనికి తెచ్చారు. చౌదరిగారి రచనలపట్ల. వారి ఉద్యమాలపట్లా, సమకాలికు లేమనుకొన్నదీ మనకీ నాడు తెలియదు. ఈ అభిప్రాయాలను సేకరించడం కోసం వారు, గ్రంథాలయా లెన్నింటినో దర్శించారు. పాతపత్రికల ఫైళ్ళను ముందు పెట్టుకొని, కళ్ళలో వత్తులు వేసికొని, వెదికారు. మా పత్రికా కార్యాలయంలో కొన్ని రోజులు కడిపారు. ప్రముఖులకు జాబులువ్రాసి, సమాధానాలు సంపాదించారు. పదిమంది పెట్టుగా తామొక్కరే వ్యవహరించారు అందుచేత సుబ్బారావుగారు ఒక వ్యక్తి కాదు. ఆయన ఒక సంస్థ -లేదా - ఒక ఉద్యమం అనడం సమంజసం.

నిజంగా వేయిపుటలు వ్రాసిన ఇంకా ఎంతైనా వ్రాయవలసిన మధుర ఘట్టాలుగల గొప్ప జీవితం కవిరాజుగారిది, అలాంటి జీవిత గాథకు శ్రీ సుబ్బారావుగారు నాందీ వాచకం పలికారు. భావితరాల వారికి బాటను నిర్మించారు.

కవి హృదయంలో ప్రవేశించి చూడగలగడానికి ఎంతో సహృదయము, చిత్త సంస్కారం అవసరం. ఆ సంపద శ్రీ సుబ్బారావు గారికి అగ్గలంగా ఉన్నది. కవిరాజు సాహిత్యంలో సామాన్య పాఠకునికి చటుక్కున స్ఫురించవి. ఎన్నో అందచందాలను వారు మన కళ్ళ ముందుంచారు. ఈ ప్రయత్నంలో వారువాడుకొన్న రచనా సంవిధానం క్రోడీకరించిన ఘట్టాలు, విపుల పరచిన అంతరార్థాలు, నన్ను ఎంత గానో ముగ్ధుణ్ణి చేశాయి, వారికి మనఃపూర్వకమైన నా అభినందనలను అంద చేస్తున్నాను,

హైదరాబాద్
12-6-1962

సి. హెచ్. ఆచార్య

# విప్లవ కవి

వాణీ నూపుర కింకిణీ మధుర నిక్వాణంబు సంపన్నమై
బోణీ కొట్టిన నీ పురాణ రచనా పూర్వార్ధ సంపత్తికిన్
బాణా కత్తులె లేచి యాడినవి విశ్వంబెల్ల కంపింప నీ
బాణీ కింకెదురేది లేదు గదరా ప్రాజ్యాంధ్రరాజ్య స్థలిన్

శత్తికి కోరి బాసికము కట్టిన నీ కవితావధూటికి నో
రెత్తిన దుష్టభావములనెల్ల లగాలగిచేసి చెప్పుతో
నెత్తిన మొత్తి పంపె మరి నేటికి జంకులు చన్న గుండెవో
ఎత్తెను విప్లవధ్వజ మభీప్సిత పద్ధతి సిద్ధహస్తుడా.

కోయని యార్చి నీ కెదురు కొన్న పురాణపుగోలకొండ ఆ
బ్బాయని ఆవటిల్లినది బానిస భావము లొక్కుమారె క
ల్లోయని దారిబట్టినవి ఓ కవిరాజ భవత్కలాద్భుతుల్
కాయమ గాక ద్రావిడ జగమ్మున నిచ్చలు పండు వెన్నెలల్

గుండెలు పిండిపోసి తెలుగుం బ్రతికింపగ పాటుపడ్డ వీ
రుండవు దాస్య భావముల ద్రోలగ చేతులు కాల్చుకొన్న ధీ
రుండవు నీ ప్రబోధముల రూపమె నృత్య సరస్వతీ కలా
ఖండము విన్నెరుంగ కిటు కమ్మకరాటము గొడ్డు పోయెరా.

పెంకెత్తు పెంకెపై నిను శపించుచు నున్ననుగాని లోకముల్
క్రుంకి పురాణ సంహతులలో మథియించి తదీయ గర్భమున్
బొంకులు రంకులున్ వెలికి బుచ్చితి ధర్మపథమ్ము లిట్టు లీ
పంకను చూపెగాదె మరి ప్రాణము వోసితి తెల్గు జాతికిన్.

ముద్దులు మూటగట్టు పదముల్ రసముగ్గులు గొన్న పద్యముల్
దిద్దినతీరు తీయములు తేర్చిన తేటతెనుంగు పోడముల్
పద్దులు వ్రాసి పెట్టినవి స్పష్టముగా కృతి సంపుటంబులం
బెద్దడి లేక యీ తెలుగు లెన్నడు నీ ఋణ మీగువారలో.

-డాక్టర్ జి. వి. కృష్ణారావు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖవారి ఆర్థిక
సహాయంతో ఈ పుస్తకం ప్రచురింపబడినది,

# యోగ్యతాపత్రం

ఆంధ్రదేశంలోని అశేషపాఠకులకు ఈ రచయిత సుపరిచితులు. మా నాన్నగారి ప్రియ శిష్యులలో ఒకరు, మన తెలుగుదేశంలో చక్కగా జీవితచరిత్రలు వ్రాసేవారు బహుకొద్ది మంది మాత్రమే. అలాంటి వారిలో ఈ రచయిత అగ్రగణ్యులు. సాహితీ రంగంలో ఈయన భవిష్యత్తు యింకా ఉజ్వలంగా వుటుందనటంలో నాకు సందేహంలేదు. అన్నింటికంటే ఈయనకు గల పట్టుదల నన్ను ముగ్ధుణ్ణి చేసింది, ఈయన ఒక సంస్థలా నిరంతరం పరిశోధన చేశారు, దాని ఫలితమే ఈ గ్రంథం.

ఈ గ్రంథం సమగ్ర మయిందని ఈ రచయిత సంతృప్తి జెందడం లేదు. కాని అలా అనుకోవలసిన పనిలేదు. ఎందు చేతనంటే, ఈ చరాచర జగత్తులో ఏదీ సమ గ్రము, సంపూర్ణము కాదుగదా !

ఒక సాహిత్య విమర్శ చదివితే, ఆ విమర్శకుని స్వభావం ఇట్టే తెలుసుకోవచ్చు. ఈ రచయిత నిజాయితీకి, నిష్కల్మష హృదయానికీ ఈ పుస్తకం దర్పణం లాంటిది.

సూతాశ్రమం

26-10-1962

- గోపీచంద్

# కవిరాజు
# జీవిత విశేషాలు

**యదాయదాహి ధర్మస్య - గ్లానిర్భవతి భారత ।**

**అభ్యుత్థాన మధర్మస్య - తదాత్మానం సృజామ్యహం ॥**

'ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ, ధర్మానికి గ్లాని సంభవిస్తుందో, ఆయా సమయాలలో, ఆయా చోట్ల నేనుజన్మిస్తూ ఉంటాను' అన్నాడు శ్రీకృష్ణుడు. దీన్నే మరో విధంగా చెప్పుకోవాలంటే, ధర్మోద్ధరణకూ, న్యాయపాలనకూ, మానవతకూ, సత్యానికీ, అవరోధం కలిగినప్పుడు, దాన్ని తొలగించడానికి, ఒక నాయకుడు ఆవిర్భస్తూ ఉంటాడు. ఉన్నత స్థానమునుండి చ్యుతమైన సమాజాన్ని పునరుద్ధరించి, తన అవతారాన్ని విరమించుకొంటాడు. అలాంటి వారందరిలోనూ భగవదంశ ఉంటుంది. అటువంటి మహనీయులందరూ తన కోవలోకే వస్తారని శ్రీకృష్ణుడు గీతలో చెప్పిన శ్లోకానికి విపులార్థం!

ప్రతి తరమూ తనకు కావలసిన నాయకుణ్ణి తనే సృష్టించుకొంటుంది. సమకాలీన సామాజిక వాతావరణంతో రాజీపడలేని ఏ విప్లవ హృదయమో విజృంభించి, తిరగబడి, సంఘంలో పరిణామాలు తెచ్చి, కొత్తమార్గాలు చూపుతుంది. తనలోని కుళ్ళును తనే భరించలేని సమాజం- తనలోనుండే ఓ నాయకుణ్ణి ఎన్నిక చేసుకొని, అతనిచేత శాశితం చేయబడుతూ ఉంటుంది. అవతార పురుషులూ, కారణ జన్ములూ అనదగిన బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, మహాత్మాగాంధీ, రాజా రామమోహన రాయలు, వీరేశలింగం పంతులు, త్రిపురనేని రామస్వామిచౌదరి గార్లు ఈ కోవలోనికే వస్తారు.

ఆంధ్రదేశంలో త్రిపురనేనివారు పేరుప్రతిష్ఠల నందినవారు. ఈ వంశంలో, పండిత ప్రకాండులూ, కవులూ, గాయకులూ, గణిత శాస్త్రజ్ఞులూ, పౌరాణికులూ, న్యాయవాదులూ, వైద్యశాస్త్ర నిపుణులూ, ధర్మతత్పరులూ, జన్మించారు. కొందరు శివాలయాలను ప్రతిష్ఠించారు. అగ్రహారాలను దానం చేశారు. తటాకాలనూ, ఉద్యానాలనూ ఏర్పాటు చేశారు. ఈ వంశీకులు కృష్ణాజిల్లాలోని అంగలూరు, గుంటూరు జిల్లా లోని కూచిపూడి, తాడికొండ గ్రామాలలో ఉన్నారు.

మా వంశముయొక్క పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుసు కోవాలనే కూతూహలంతో ఒకసారి సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని నేను హైదరాబాదులో కలుసు కొన్నాను. కుశల ప్రశ్నల అనంతరం శర్మగారితో "ఏమండీ! మా వంశంయొక్క పుట్టు పూర్వోత్తరాలను గురించి తెలుసుకోవాలనే కోరిక కలిగింది" అన్నాను.

అడిగినదే తడవుగా వారు "మీ వంశానికి మూలపురుషుడు కాకతీయ త్రిపురనాయకుడు. అతనిపేరు శంభుడు. ఆయన ప్రతాప రుద్రుని కొలువులోని ముఖ్యసేనాపతులలో ఒకడు. అతడు ఆంధ్ర దేశ పరిరక్షణకొఱకు ఢిల్లీసుల్తానుల నెదరించి పోరిన మహావీరుడు. మీది కదనరంగంలో కత్తులుదూసిన సైనికవంశం'' అన్నారు.

'త్రిపురనేని' గృహనామం ఆ నోటా ఈ నోటా పడి అను శ్రుతంగా వచ్చిందికాదు. చరిత్ర ప్రసిద్ధిగాంచిన కాకతీయ ప్రతాపరుద్ర ధరణీపతి సైన్యాధ్యక్షుడైన శంభుడు తన పదునైన కత్తిని మలకల రుధిరధారలతో కడిగాడు'. అతని పౌరుషానికీ, ప్రతాపానికీ, ప్రతాప రుద్ర మహీపతి దిగ్భ్రమజెంది, కృష్ణామండల ప్రాంతీయ సేనానిగా శంభుని నియమించాడు. శంభుడు అంగలూరు నివాసంచేసుకొని, నంది

వాడ, గుడివాడ, కౌతవరములను ప్రజానురంజకంగా పరిపాలించ సాగాడు. అందుచేత ప్రతాపరుద్ర మహారాజు శంభునికి 'త్రిపుర రేడు' అనే బిరుదంతో సత్కరించాడు. త్రిపుర + రేడు = మూడు పురములకు రాజు. 'రేడు. కాల క్రమేణా 'నేడు'గా మారి, దాని ద్వితీయావిభక్త్యంతరూపమే 'నేని' అయింది. ఈ విధంగా త్రిపురనేని గృహనామం ఆనాటి పౌరుష ప్రధాన చిహ్నంగా ఆ వంశీకులను వరించింది.

ఆనాటి సంకులసమరంలో సైన్యాధ్యక్షుడైన శంభుడు వీర విహారం చేస్తూ వుంటే, ఆ వీరశిఖామణి తలపాగనందలి 'తురాయి'ని బట్టి, 'అదుగో! పువ్వాడు వచ్చుచున్నాడు' అని శత్రువులు ఆయన రాకపోకలు తెల్సుకొని ప్రాణాలు దక్కించుకొన్నారట! అందుచేత ఆ శంభుని సంతతివారైన త్రిపురనేనివారు 'పువ్వాడ' గోత్రీకులుగా వర్ధిల్లుతూ ఉన్నారు.

అప్పటినుండే ప్రసిద్ధులైన పూర్వీకుల పేరునుబట్టి ఏర్పడ్డ మా ఇంటిపేరులోని విశిష్టత నాకు బోధపడింది.

ఇట్టి మహత్తర ప్రాచీన వైభవం, ఆధునిక ప్రశస్తిగల కమ్మ కులంలోని ఒకవంశం మా త్రిపురనేని వంశం.

ఈ వంశానికి వన్నెతెచ్చిన ఘనులు త్రిపురనేని గోపాలయ్య గారు. వీరిది అంగలూరు. ఈ గోపాలయ్యగారికి నలుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూ జన్మించారు. మూడవకొడుకు చలమయ్యగారు. రామమాంబ వీరి భార్య.

చలమయ్యగారు కోరమీసాలు గలిగిన అజానుబాహువు. తల పాగ, పొన్నుకఱ్ఱ, కిఱ్ఱుచెప్పులూ ధరించి, ధర్మమూర్తిలా కనిపిస్తుండే

వారు. సజ్జనులకు వారెంత ఆప్తులో, దుర్జనులకు అంత దుర్నిరీక్షం గానూ వుండేవారు. ఒకసారి అభయ మివ్వడం జరిగితే-మరిదానికి తిరుగంటూ వుండేదికాదు. రౌద్ర కరుణారసాలు సమపాళ్ళలో వారిలో చిప్పిలుతుండేవి. అన్యాయ మెదురైనప్పుడు రౌద్రమూర్తులైతే, ఆర్తులు కన్పించినప్పుడు కరుణాసముద్రు లయ్యేవారు.

ఇక, రామమాంబగారు శాంతస్వభావానికి ప్రతీక. శత్రువుల నైనా కన్నబిడ్డలవలె ఆదరించడం ఆమెకు వెన్నతో బెట్టిన విద్య. విసుగూ విరామం లేకుండా అతిథిసత్కారాలు చేస్తూవుండేవారు. ఈ దంపతులకు ఐదుగురు కుమారులు, ఒక కుమార్తె కలిగారు. వీరి మొదటి కుమారుడు గోపాలకృష్ణయ్యగారు. వీరు కమనీయంగా కవిత్వమల్లేవారు. రెండవ వారు నరసయ్యగారు గురుకుల వాసంచేసి, సంస్కృతాంధ్ర భాషలలో అద్వితీయమైన పాండిత్యం గడించారు. మూడవవారు శ్రీరాములుగారు. సాధుసజ్జన సంఘసాంగత్య శీలురు; మంచివ్యవహర్త. నాల్గవ కుమారుడు సుబ్రహ్మణ్యం, "శాలివాహన విజయము" అనేనాటకం వ్రాశారు. కడగొట్టు బిడ్డ రామస్వామిగారు. కుమార్తె సీతారత్నం విదుషీమణి, అర్తుల పాలిటి కల్పతరువు.

ఈవిధంగా రామస్వామి చౌదరిగారి వంశం సంగీత, సాహిత్యాలలోనూ, శాస్త్ర, వ్యవహారాదులలోనూ గణుతికెక్కింది. రామస్వామి గారిలో, తమపూర్వీకుల ప్రతిభలన్నీ పుంజీభవించాయి.

రామస్వామిగారు 1887వ. సం. జనవరి 15వ తేదిన జన్మించారు. అప్పుడు మనదేశం ఒకవంక పరదేశీయుల పాలనలోనూ, మరోవంక - మౌఢ్యాంధ కారంలో మునిగివున్న ఇతర జాతులమీద అగ్రజాతుల నిరంకుశత్వంతోనూ క్రుమ్మగిపోతూవుంది. రామస్వామిగారికి అంగలూరులోని వీధిబడిలో 1895 జూలై 15వ తేదిన విద్యాభ్యాసం

జరిగింది. ఆ వీథిబడిని మంగయ్య పంతులు నిర్వహిస్తూ వుండేవాడు. చిన్నతనంనుండి రామస్వామిగారు కొంటెతనానికి, కోణంగితనానికి ప్రసిద్ధి. వారిబాల్యం అంగలూరు, గుడివాడలలో గడిచిపోయింది. హేతుబద్ధం కానివాటిని ఆయన బాల్యంనుండీ విశ్వసించే వారుకాదు. మూఢనమ్మకాలంటే రామస్వామిగారికి మొదటినుండీ గిట్టేవికావు. ఈ విషయాలను విపులంగా మనం ముందు తెలుసుకొందాం.

ఒకసారి ఏంజరిగిందంటే - రామస్వామిగారు మొఖం పుల్లల కోసం ఊరుబయటనున్న వేపచెట్టు దగ్గరకు వెళ్ళారు. ఆ చెట్టును ఎక్కబోతూ వుండగా, దానికి ఇనుపమేకులూ, ఆ మేకులకు చుట్టిన కొన్ని వెంట్రుకలూ కన్పించాయి. క్షుద్రదేవతల తృప్తికోసం ఆ రోజుల్లో ఇలాంటి పద్ధతులు అవలంబించబడుతూ వుండేవి. రామస్వామిగారు కొంచెంసేపు తటపటాయించి ఓ నిముషంపాటు ఆలోచించారు. చెట్టుక్రింద రాగిడబ్బులూ, నిమ్మకాయలూ, వేప బెత్తమూ ఉన్నాయి. రామస్వామిగారు మొఖంపుల్లలు విరుచుకొని, డబ్బులు, బెత్తము తీసుకొని ఇంటికొచ్చారు. ఇంటా - బయటా పెద్ద అలజడి చెలరేగింది. వారివేమీ లక్ష్యపెట్టలేదు. చాలాకాలంపాటు ఆ బెత్తం వారి దగ్గరనే ఉంది.

రామస్వామిగారు 1905 సం.లో బందరు హిందూ హైస్కూల్లో నాల్గవఫారంలో చేరారు. చదువుమీద ఎంతశ్రద్ధ చూపెట్టేవారో, ఆటల మీదకూడా అంత ఆసక్తినీ కనపఱచేవారు. ఫుట్‌బాల్ అత్యద్భుతంగా ఆడేవారు. కవిత్వ విషయంలోనూ, సంస్కృతాధ్యయనంలోనూ అధ్యాపకులు లభించక అష్టకష్టాలు పడ్డారు. ఎవరివద్దకు వెళ్ళినా 'నీవు శూద్రుడవు - సంస్కృతం అభ్యసించకూడదు' అని తిరస్కరించారు.

రామస్వామిగారిలో విద్యాతృష్ణ ఆరోజు కారోజుకూ పెచ్చుమీరి పోతూఉంది. భూతదయకు పేరుమోసిన భరతఖండంలో వారికి అధ్యాపకులే కరువయ్యారు. క్షుద్రాతిక్షుద్రమైన కుల పిశాచికి, ఆ మహనీయుని విద్యాసక్తి బలి గావలసివచ్చింది. మరొకరైతే విద్యాభ్యాస ప్రయత్నాలను విధిగా విరమించుకోవలసి వచ్చేది. కాని చౌదరిగారు ఆ విధంగా చేయలేదు. వారి జిజ్ఞాసను పరిశీలించిన ఆసూరి కాంతయ్యగారు, రామస్వామిగారిని పిలిపించుకొన్నారు. కాంతయ్యగారు మహా పండితుడు. జిల్లా రిజిష్ట్రారుగా పనిచేస్తూ వుండేవారు. వీరివద్ద రామస్వామిగారు కావ్యాధ్యయనం చేశారు. ఆ తరువాత చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి శిష్యత్వం లభించి కవితా రచన ప్రారంభించారు.

క్రీ. శ. 1898వ సంవత్సరంలో రామస్వామిగారికి వివాహమయింది. అత్తవారిది చౌటపల్లి. మామగారు అట్లూరి అమరయ్యగారు. అత్తగారు నాగమ్మగారు. భార్యపేరు పున్నమాంబగారు. వీరి దాంపత్య జీవితం ఆనాటి వారికి ఆదర్శవంతమయింది.

వీరికి క్రీ. శ. 1910 సంవత్సరం సెప్టెంబరు 8వ తేదిన ఒక కుమారుడు జన్మించాడు. వీరే ప్రఖ్యాత కథకులు, నవలా రచయిత శ్రీ గోపీచంద్. తరువాత ఐదు సంవత్సరాలకు ఒక కూతురు కలిగింది. ఈమెపేరు సరోజిని. ఈమెను కానుమిల్లి సుబ్బారావుగారికిచ్చి వివాహం చేశారు. సుబ్బారావుగారు ఐ.ఏ.యస్. ఆఫీసరు హోదాలో మన రాష్ట్ర ఎన్నికల ప్రధానాధికారిగా పనిచేశారు. కొంతకాలం జిల్లా కలెక్టరుగానూ, మరికొంతకాలం ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సచివాలయంలో కార్యదర్శిగానూ, పబ్లిక్‌సర్వీస్ కమిషన్ చైర్మన్‌గాను ఉన్నారు ఇప్పుడు పదవీవిరమణ చేశారు.

ప్రథమ ప్రపంచ మహా సంగ్రామం జరుగుతున్న రోజుల్లో ఉన్నత విద్యాభ్యాసంకోసం ఇంగ్లండు ప్రయాణం కట్టారు రామస్వామి గారు. లండను వెళ్ళారు. అచ్చట గాంధీజీని దర్శించారు. ఆ మహనీయుని సందర్శనంవల్ల కలిగిన అనుభూతిని చౌదరిగారు ఓ లేఖద్వారా యిలా తెలియచేశారు:* "గాంధీగారినిచూచి యాశ్చర్యపడితిని. రెండు దినములనుండి జాడ్యపీడితుడై యుండెను. చేకు పాత్రలయందు భుజించుచుండుటఁగాంచి యక్కజపడితిని. తత్సతీ తిలకము రొట్టెలు కాల్చుచుండెను. కెల్లన్ బాక్‌గారు సేవకునివలె బరిచర్యచేయుచుండెను. ఔరా! భక్తి చేయింపని కార్యమొండుండునా? అనంతర మా మహాశయుడు నా క్షేమ సమాచారములడుగ వినయవిధేయతతోఁ దెలియఁజేసి మరికొంతసేపు ప్రసంగించి సెలవుం బడసితిని. ఏమి యా మూర్తిసౌమ్యత! శాంతత!! కన్నులఁ గట్టినట్టుండును. దక్షిణాఫ్రికావాస్తవ్యులగు మన యిండియనులకుఁ జేసిన మహోపకారము మఱువఁ దగినదా! ఆ పవిత్రదర్శనంబున బవిత్రుఁడనైతి".

విదేశాలలోవున్నా రచనా వ్యాసంగం నిరాఘాటంగా సాగిస్తూ వుండేవారు. శరపరంపరగా వ్రాసిన వారి లేఖలు కృష్ణాపత్రికలో వెలువడుతూ వుండేవి. అప్పటి సంపాదకులు ముట్నూరి కృష్ణారావు గారు, చౌదరిగారి నూతన భావతరంగిణికి ఎంతగానో ముగ్ధులయ్యారు. బ్రిటిషు దీవుల్లో మూడు సంవత్సరాలున్నా టొమేటోలూ, దోసకాయ ముక్కలూ మొదలగు సాత్వికాహారాన్నే భుజించేవారు. మద్యమాంసాలజోలికిపోని మహామనీషి రామస్వామిగారు. విదేశాలలోవున్నా వేషంలో మార్పు వుండేదిగాదు. ఎక్కడున్నా తలపాగా ధరించేవారు. డబ్లిన్‌లోని జాతీయ కళాశాలలో చేరి డిగ్రీని పొందడానికి ప్రయత్నించారు. కాని తలగుడ్డ పెట్టుకొని. తరగతిలో కూర్చోగూడదని పట్టు

* కృష్ణాపత్రిక 21-11-1914.

పట్టదంతో చదువుకే స్వస్తిచెప్పారుగాని, తలపాగా తీయడానికే మాత్రం అంగీకరించలేదు. ఐర్లెండు నుండి అంగలూరుకు అసంఖ్యాకంగా ఉత్తరాలు వ్రాస్తూవుండేవారు ఆ ఉత్తరాలను పరిశీలించి చూడగా పురాణాలకు వ్యతిరేకంగానూ, దేవుడు - దయ్యాలూ లేవనీ, అగ్రజాతికి ప్రత్యేకమైన హక్కులు వుండరాదనీ ప్రచారం చేసినట్లుగా విదితమౌతుంది. ఐర్లెండ్ వదలి, ఇంగ్లండువెళ్ళి, అచ్చట బారిష్టరు పట్టా పొందారు. ప్రాచ్య, పాశ్చాత్య సారస్వతాలను సమ ప్రతిలో మేళవించుకొన్నారు. సింగపూర్, సిలోన్, ప్యారిస్, డబ్లిన్, ఉత్తర, దక్షిణ ఆఫ్రికాలు మొదలైన దేశాల్లో పర్యటించారు.

తాము ధర్మమని విశ్వసించిన దానికోసం హిమాలయంలా నిలిచేవారు. తామే పొరపడటం జరిగితే పేచీలేకుండా దాన్ని అంగీకరించేవారు.

దక్షిణాఫ్రికాలో ఒక సంఘటన జరిగింది. చౌదరిగారి పట్టుదలకా సంఘటన మచ్చుతునకవంటిది.

రామస్వామిగారు ప్రయాణం చేస్తున్న జపాను ఓడ డర్బన్ రేవులో ఆగింది.

"ఆసియావాసులెవ్వరూ ఇక్కడ దిగకూడదు" అని ప్రభుత్వం ప్రకటించింది.

రామస్వామిగారు ఆ ప్రకటన తెలుసుకొని ఆశ్చర్య చకితులయ్యారు.

"దొంగలకు ప్రతివారూ దొంగల్లాగానే కనిపిస్తారు. ఈ ప్రభుత్వం తస్కరుల ప్రభుత్వం. కాబట్టే భయపడుతూ వుంది. ఆసియావాసులంటే ఎందుకింత భయం? నేను దొంగనుకాను. ఆసియా వాసులెవ్వరూ దొంగలుకారు!" అన్నారు ఆయన.

## 9

ప్రభుత్వోద్యోగి వచ్చి 'అనుమతి పత్రం'చూపించమని అడిగాడు.

"నేను చూపించను. మీరు నోటీసును ఉపసంహరించుకొనే వఱకూ పాస్‌పోర్టును మీకు చూపించను" అన్నారు చౌదరిగారు.

"చూపించాలి" అన్నాడు గంభీరస్వరంతో ఉద్యోగి.

"నేను చూపను" అన్నారు రామస్వామిగారు.

"ఐతే, నిన్ను అరెస్టు చేయిస్తా" అన్నాడు ప్రభుత్వోద్యోగి.

"అదెలాగో నేనూచూస్తాను!" అన్నారు చౌదరిగారు.

ఈ వాద ప్రతి వాదాలతో కాలం గడిచిపోయింది. కెప్టెన్ వచ్చి, పాస్‌పోర్టు చూపించవలసిందిగా చౌదరిగారిని కోరాడు. వారు వినలేదు. ప్రభుత్వోద్యోగితో మాట్లాడివచ్చాడు. "రామస్వామిగారూ ! మీరు డర్బన్ చూడటానికి వెళ్ళవచ్చునండీ!" అన్నాడు కెప్టెన్.

"షరతు లేమిటి?" అన్నాడు చౌదరిగారు.

"నేను మీకు హామీగా ఉన్నాను. మీరువెళ్ళి డర్బన్ చూచి రండి!" అన్నాడు కెప్టెన్.

"నేను చూడను. నా పాస్‌పోర్టుకూడా చూపించను" అన్నారు చౌదరిగారు.

కెప్టెన్‌కేమీ తోచలేదు.

అప్పటికే గంట ఆలస్యమయింది. అంటే ఎంతో డబ్బునష్టం.

కెప్టెన్ మరోసారి ఉద్యోగితో మాట్లాడి చిరునవ్వు నవ్వుతూ వచ్చాడు.

"రామస్వామిగారూ! ఎలాంటి షరతులు లేకుండానే మీరు దిగ వచ్చునండీ" అన్నాడు.

# 10

అప్పుడు రామస్వామిగారు ధీమాగా పాస్‌పోర్టు చూపించారు.

చౌదరిగారు మంచి మాటకారి. రిపార్టీ - ఎదుటివారి నషాళాని కంటే సమాధానాలు తడుముకోకుండా ఇవ్వడమనే శక్తి-వారిలో అపారంగా ఉంది. అందుచేతనే సంభాషణలో ఎంతవాణ్ణయినా కొద్ది క్షణాల్లోనే బోల్తాకొట్టించేవారు. ఎదుటివారికి కలకాలం జ్ఞాపకంవుండేలా జవాబు లివ్వడం చౌదరిగారికి వెన్నుతోబుట్టిన విద్య. వారు విదేశాలలో వున్నప్పుడు. ఒక పాశ్చాత్య వనిత వారి వేషాన్ని చూసి పకపకా నవ్విందట!

"ఏమిటి ?" అన్నారు రామస్వామిగారు.

"మీరు రోమ్‌లో వున్నపుడు, రోమన్‌లా వుండాలిగాని, ఈ తలపాగా, ఈ పంచెకట్టూ ఏమిటి?" అన్నదావిడ.

"అయితే మీవాళ్ళు మాదేశం వచ్చినపుడు, భారతీయుల్లా ధోవతులు కట్టరేం?" అన్నారు రామస్వామిగారు.

ఆమె ఇలాంటి జవాబు వస్తుందని అనుకొని ఉండదు. అసలే తెల్లగావున్న ఆవిడముఖం మరింత తెల్లబడి వెలవెలా పోయింది.

మరోసారి—

మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న సమయంలో, ఇంకో యువతి, రామస్వామిగారి దగ్గరకువచ్చి "చందా ఇవ్వండి" అన్నది.

"ఎందుకు" అన్నారు చౌదరిగారు.

"యుద్ధంలో తీవ్రంగా గాయపడిన సైనికులకు సదుపాయాలు కలుగచేస్తాం" అన్నదామె.

"నేనివ్వను" అన్నారు రామస్వామిగారు. "గాయాలు నయమయ్యాక, మమ్మల్ని హింసించడానికి ఈ సైనికులే సిద్ధపడతారు. నా శత్రువుకు నేనెన్నడూ సహాయపడను."

# 11

ఆవిడ మళ్ళీ నోరెత్తకుండా వెళ్ళిపోయింది...

సంభాషణలోనే కాకుండా, రచనలోకూడా ఇలాంటి చెణుకులు రవ్వల్లా మిరుమిట్లు గొలిపించారు రామస్వామిగారు.

1917 సం. నవంబరు 11వ తేదీన విదేశాలనుండి స్వదేశానికి తిరిగివచ్చారు. న్యాయవాదవృత్తి స్వీకరించారు. 1918 సం. లో బందరులో ప్రాక్టీసు ప్రారంభించారు. న్యాయశాస్త్ర వాదంలోనూ, న్యాయాధికారులను ఒప్పించడంలోనూ వారు స్థితప్రజ్ఞులు. కాని న్యాయవాద వృత్తిపై వ్యామోహంకంటే, వారికి ప్రజాసేవాభిలాషే ప్రబలంగా వుండేది. అందుచేత న్యాయవాదిగా సంఘంలోని అవకతవకలను గమనించారు. న్యాయంవైపు నిలబడడం తమధర్మంగా భావించారు. ఫలితంగా సంఘసేవ, సారస్వతసేవ. బ్రాహ్మణేతర ఉద్యమం మొదలుపెట్టారు. కమ్మకుల చరిత్రను వ్రాయసంకల్పించారు. టంగుటూరులో 1922 సం. లో జరిగిన కమ్మ మహాజన సభలకు అధ్యక్షత వహించారు. వీరి అధ్యక్షోపన్యాసం-నిద్రాణమై, నిస్తేజమై, నిర్వీర్యమైవున్న కమ్మకులంలో జాగృతిని కలిగించింది. 'పీఠాధిపతులను', 'ఉపన్యాస చక్రవర్తులను' ముఖాముఖిగా ఎదుర్కొని అనర్గళంగా ఉపన్యాసాలిచ్చారు. చౌదరిగారితో వాగ్యుద్ధంలో తట్టుకోలేక 'శంకర పీఠాధిపతులు' సైతం పలాయన మంత్రం పఠించారు.

పురాణాలను నమ్మగూడదనీ, దేవుడు లేడనీ, బ్రాహ్మణులు మిగతా కులాలవారిని పశువులకంటె నీచంగా చూస్తూవున్నారనీ, ఈ బానిసత్వం పోగొట్టుకోవాలనీ రామస్వామిగారి ఉపన్యాసాలసారాంశం. తమసిద్ధాంతాలను ఊరూరా, వాడవాడా తిరిగి ప్రచారంచేశారు. కొన్ని సభలలో రాళ్ళురువ్వటం, రాక్షసుణ్ణి చూచినట్టు చూడటం, భోజనం కూడా పెట్టకపోవటం జరిగింది. అయితే ఆరోజుల్లో కూడా అమృత ఘడియలు కొన్ని లేకపోలేదు.

ఒక మీటింగులో ఉపన్యాసంచేసి రామస్వామిగారు బయటికి వచ్చారు. ఒక శతవృద్ధు కఱ్ఱపోటుతో వచ్చి అమాంతంగా రామస్వామి గారిని కౌగిలించు కొని ఆవురు మన్నాడు. "ఏమిటి?" అని తబ్బిబ్బు పడుతూ అడిగారు రామస్వామిగారు. "ఏంలేదు బాబూ! ఇక నేనెక్కువ రోజులు బ్రతకను. నిన్నుచూచి చచ్చిపోదామని వచ్చాను" అన్నాడు ఆ శతవృద్ధు.

రామస్వామిగారు 1922 సం. లో తెనాలి పట్టణం చేరు కున్నారు. అందులకు కారకులయిన ప్రముఖులు పాములపాటి వెంకట కృష్ణయ్యగారు, జాగర్లమూడి కుప్పుస్వామిగారు. వెంకటకృష్ణయ్యగారికి రైతుపత్రికను తెనాలినుండి ప్రచురించాలనే ఉద్దేశం కలిగింది. రామ స్వామిగారిని సంపాదకులుగా నిర్ణయించారు. కాని అనుకొన్నట్లుగా ఆ పత్రిక వెలువడలేదు. ఐతే రామస్వామిగారుమాత్రం తెనాలిలో స్థిరపడి పోయారు. 5-11-1925 న పిల్లలమర్రి ఆంజనేయులుగారిని ఓడించి, తెనాలి పురపాలక సంఘానికి చైర్మనుగా ఎన్నుకోబడ్డారు. 1938 సం. వఱకు ఆపదవిలోవుండి వ్యవహార దక్షతతో ఆపదవిని నిర్వహించారు. స్థానికుల దైనందిన జీవితంతో సన్నిహిత సంబంధాలు ఏర్పఱచు కొన్నారు. వారిబాధలు, గాధలు కని, విని, వాటి తరుణోపాయాలను సూచించారు. తనకున్నంత మేరలో అధికారాన్ని సంపూర్ణంగా సద్విని యోగంచేసుకొని ప్రజలకు సేవచేశారు.

రామస్వామిచౌదరిగారి ఇల్లెల్లప్పుడూ సాహిత్య వాదోప వాదాల తోనూ, సంస్కర్తల పదధ్వనులతోనూ ప్రతిధ్వనిస్తూ వుండేది. వారి ఇల్లొక "సూతాశ్రమం", ఆస్తికులూ, నాస్తికులూ, రాజకీయవేత్తలూ, లౌకిక వ్యవహర్తలూ, అలౌకిక వాదులూ, పండితులూ, పామరులూ, కవులూ, గాయకులూ, జ్యోతిష్కులూ, మరెందరో ప్రముఖ వ్యక్తులు ఎప్పుడో ఒకప్పుడు సూతాశ్రమంలో అడుగుపెట్టకుండా వుండేవారు

కారు. ఆతిథ్యనివ్వక ఒక్కపుడినెట్టైనా తొగకుండా వుండేవారుకాదు చౌదరిగారి సలహాలనూ సూచనలనూ అడగకుండా వుండేవారుకాదు. విప్లవాత్మకమైన ప్రతి ఉద్యమంతోనూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారికి సంబంధం వుండేది. ఎక్కడ ఏ నూతనాంశం కనుపించినా చౌదరిగారు ఆసక్తితో గమనించేవారు. ఎక్కడ ఎలాంటి నూతనోత్సాహం మోసులెత్తినా దానికి వారి దోహదం వుండేది.

ఎన్నో హృదయాలలో వారు జ్ఞానజ్యోతులను వెలిగించారు. సాంఘికంగా అధమాధమస్థితిలోవుండి, దిక్కుతోచక బెంబేలు పడుతున్నవారి కెందరికో చేయూతనిచ్చి, వీపుతట్టి, 'నాయనా! నేనున్నాను భయపడకు, ధైర్యంతో ముందడుగువెయ్యి' అంటూ కావలసిన ధైర్యాన్ని, స్థైర్యాన్ని కలిగించేవారు చౌదరిగారు. ఆకాశమంతమనిషి, సముద్రమంతధైర్యం తమకిచ్చాడన్న సంతోషం, వారిని పునరుజ్జీవితులను చేసేది.

చౌదరిగారు అనునిత్యం సాహిత్యగోష్ఠులలో మునిగి తేలుతూ వుంటే, పున్నమాంబగారు అతిథులకు సంతర్పణలుచేస్తూ వుండేవారు. అలాంటి పున్నమాంబగారు 1920 సం. జనవరి 15న కాలధర్మం చెందారు. ఆ సందర్భంలో కవిరాజుగారు ఇలా వ్రాశారు-

మ॥ 'మహిళాధర్మవిశిష్ట వృత్తయయి కామ్యవ్రాత సంధాత్రియై
విహితాలాప కలాకలాపయయి సద్విద్యావతీ భూషయై
రహినొప్పారిన పున్నమాంబ సుదతీ ప్రాలంబ ముక్తామణిన్
గృహిణింగాఁగొని సంతతింగని, ముదం బిట్టింకఁగోల్పోయితిన్!'

చం॥ 'చెదరని ముంగురుల్ రసము చిప్పిలు తీయని తేటమాటలున్
వదలని ప్రేమబంధమును పల్లని చల్లని బుల్లి నవ్వులున్
గుదరని ఉంకుచూపు గమి గూపులు గల్గియు నా మనస్సులో
మెదలుచునుండెఁగా ప్రతినిమేషము మత్కులకాంత నేఁటికిన్!

ఆ సంవత్సరమే రామస్వామిగారు ద్వితీయ వివాహం చేసుకొన్నారు. ఈమెపేరు చంద్రావతి. వీరికి ఒక కుమారుడు. ఈయన పేరు గోకుల్‌చంద్.

1932లో రెండవ భార్యకూడా చనిపోయారు. 1933లో చౌదరిగారు మూడవపెళ్ళి చేసుకొన్నారు. ఈమెపేరు అన్నపూర్ణమ్మ. వీరికొక కూతురుపుట్టింది. ఈ అమ్మాయిపేరు చౌదరాణి. ప్రఖ్యాత కథకుడు అట్లూరి పిచ్చేశ్వరరావుగారు ఈమెను వివాహం చేసుకొన్నారు. మూడవ భార్యకూడా 1964వ సం. ఏప్రిల్ 30వ తేదీన స్వర్గస్థురాలయ్యారు.

చౌదరిగారు బారిష్టరుమాత్రమేకాదు, శతవధానులు, బహుగ్రంథకర్తలు-'సూతపురాణం', 'కురుక్షేత్ర సంగ్రామం', 'శంబుక వధ', 'ఖూనీ', 'వివాహవిధి', కుప్పుస్వామి శతకం', ధూర్తమానవ', 'సూతాశ్రమ గీతాలు', 'భగవద్గీత', - వీరి ముద్రితగ్రంథాలు. 'అంపకం', 'మాలదాసరి', 'నరకం', 'గోపాలరాయ శతకం', 'చెన్నకేశవ శతకం', 'పల్నాటి పౌరుషం', రాణాప్రతాప్' మొదలయినవి అముద్రితాలు. వీరి భాషాసేవకు అలరిన ఆంధ్రమహాసభ బెజవాడలో 1929 సం.లో 'కవిరాజు' బిరుదునిచ్చి తనను తానే గౌరవించుకొంది. గుడివాడపౌరులు చౌదరిగారికి 1942 ఏప్రిల్ 25,26 తేదీలలో గజారోహణోత్సవంతో ఘనంగా సన్మానంజరిపి, వారి సంస్కరణోద్యమంపట్ల తమ గాఢానురాగాన్ని తెలియజేసుకొన్నారు. వివిధ ప్రాంతాలనుండి అనేకమంది ప్రముఖులూ, వేలాది స్థానిక ప్రజలూ ఆ సన్మానంలో పాల్గొని కవిరాజుకు బ్రహ్మరథం పట్టారు. బెజవాడ రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతను, చల్లపల్లి సంస్థానాధీశ్వరులు మున్నగు మహామహుల సమక్షంలో, పండితాశీర్వాదాలతో, అనేకమంది కవుల అభినందనలతో, అఖండ వైభవోపేతంగా ఆ

సన్మానం జరిగింది. ఆనాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో పెద్దనాది మహాకవులకు జరిగిన సన్మానాలను అతిశయించిన ఈ కవిరాజు సన్మానాన్ని జూచిన ఆంధ్ర లోకం హర్షోత్పులకితమయింది. సన్మాన సంచికలో మొత్తం 82 మంది పండితులూ, కవులూ ప్రసిద్ధ రచయితలూ, కవిరాజు, ప్రతిభను, వారి సాహిత్య సాంఘిక సేవలను ప్రశంసించారు. ఆ సందర్భంలో వ్రాసిన ఏటుకూరి వెంకటనర్సయ్యగారి పద్యాలు చూడండి :

* "ఓ కవిరాజ! నీ కృతులకున్న విశిష్టత యాంధ్ర లోకమం
దే కృతి కుండఁబోదు భవదిద్ధ కవిత్వ మహత్వ నైపుణం
బే కవి కందఁబోదు కవులెందఱు వ్రాసిరి వ్రాయుచుండి రా
పోకడ లార్య వాఙ్మయ ప్రభుత్వ పతాకములన్ గదల్చెనా ?

నీ కవితా మహాంభో నిధి నిర్భర భావ తరంగమాలికా
వ్యాకుల మాంధ్రలోక మొకప్పు డెదుర్కొనలేక నిన్ను నీ
పోకడలన్ శపించి వలపోసినదైనను సవ్యసాచివై
వాకొక బాకుఁగా విసరివైచి తపస్సృతులంతరింపగన్.

నీ రచనాభిఘాతముల నేఁటి కపార పురాణ గోపుర
ద్వారకవాట పంక్తులు బదాబదలైనవి, యింతకీ వసా
ధారణ భావ విప్లవ విధాతవు గైకొన వన్న! దివ్య క
ర్పూర సుగంధ వస్తు పరిపూర్ణ సువర్ణజలాభిషేకమున్.

గంగోత్తుంగ తరంగ రింగణ సదృక్షంబైన నీశైలితో
లుంగీ గట్టిన కావ్యకన్యకలు వేలున్ లక్షలున్నారు నీ
బంగారంపుఁ గవిత్వ వస్తువులతోఁ బైపోటికిన్ నిల్చి మా
పింగాణీ సరుకమ్ముకొన్న యెడఁ గాఫీ నీళ్ళకుం గిట్టునా ?"

---

* కవిరాజు సన్మానసంచిక

రామస్వామిచౌదరిగారి కవితా ప్రాభవాన్ని అనేకమంది కవులు, పండితులు ఎంతగానో ప్రశంసించారు.

మ. 'పదసంధానములో, సుధామధుర కావ్యస్థార్థ నవ్యత్వమో,
మృదుశయ్యా పరిపాకమో, నవరసోన్మేషత్వలాలిత్యసం
పదలో, సంఘహితైక భాషితములో, వ్యంగ్యార్థ భావమ్ములో,
కదలింపన్ బ్రతి భానశాలికడచుం గాంధర్వలోకమ్ములన్.'

—డాక్టర్ జి. వి. కృష్ణారావు

శా. 'సామాన్యార్థములుగ్గడింపఁడు జగత్సార స్వతంబర్థి వి
ద్యామర్యాద నతిక్రమింపఁడు కళా వ్యాసంగ రంగాలఁ దా
నై మాట్లాడు స్వతంత్ర భావకలనా ఖ్యాతిన్ ద్రిపుర్నేని శ్రీ
రామస్వామి కవీంద్ర సన్నుతుని మార్గంబెన్న సామాన్యమే?'

—శ్రీ ఉమర్ ఆలీషా

ఉ. 'సన్నని సంస్కృతాంధ్రముల సొరులు గుప్పెడు నీ కలమ్ములో
నన్నయ తిక్కనల్ కదలి నాట్యము సేయుదు రాంధ్ర వాణి బల్
ప్రన్నని హైమనూపుర ఝుళం ఝుళలన్ లయ చక్కదిద్దు నీ
కెన్ని భవంబుల దొదవె నింతటి పుణ్య మగణ్య మగ్రజా!'

—శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

ఉ. 'కమ్మని తేట తెల్గు నుడికారము చక్కదనంబులీను; కా
వ్యములు సంతరించితి వయారె! యనేకము; లీవు నీ కవి
త్వమ్ము విశిష్ట మార్గమును బట్టి మెలంగుట రూఢి: నీ ప్రపం
చమ్మది వేఱు; నీ యశము సర్వ దిశావిదిశల్ పెనంగొనెన్.'

—శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

* కవిరాజు సన్మాన సంచిక

సన్మానం జరిగిన కొన్ని మాసాలకే చౌదరిగారికి అస్వస్థత గలిగింది. అది విషజ్వరానికి దారితీసింది. ఆరోజుకారోజు చౌదరిగారి ఆరోగ్యపరిస్థితి ప్రజానీకంలో అమితాందోళనను కలిగించింది. కొన్ని రోజులపాటు మృత్యుదేవతతో పోరాడారు. ఎట్టకేలకు, ఆంధ్రుల దుర దృష్టంకొద్దీ, మహాకవి, భావ విప్లవ విధాత, యుగపురుషుడు అయిన రామస్వామిచౌదరిగారు తెనాలిలోని వారి స్వగృహం 'సూతాశ్రమం'లో 1943 జనవరి 16వ తేదిరాత్రి గం. 1-30 ని. లకు కీర్తి శేషులయ్యారు, ఈ ఆకస్మికవార్త యావదాంధ్ర ప్రజానీకాన్ని దుఃఖ సాగరంలో ముంచివేసింది. అప్పటికి చౌదరిగారి వయస్సు 56 సంవత్సరాలు మాత్రమే.

తెనాలిపట్టణ వాసులకూ పరిసర గ్రామీణ ప్రజానీకానికి విషాద చ్ఛాయల ముసుగు విడివడలేదు. కవిరాజు భౌతికదేహం పుష్పమాలలచే అలంకరించబడి తెనాలిపురవీధుల గుండా బ్రహ్మాండమైన ఊరేగింపుతో బయలుదేరింది. దారిపొడవునా పూలువర్షంలా కురిశాయి. ఇసుకవేసినా రాలని జనసమూహం విచారవదనాలతో కవిరాజు భౌతిక కాయం వెంటనడిచారు. కవిరాజును కడసారిగా చూడాలనే కాంక్షతో, వేలాది ప్రజలు తండోపతండాలుగా గుమిగూడారు. అదొక మహా ప్రస్థానం.

'రామస్వామిచౌదరిగారు పదిసంవత్సరాలు బ్రతికుంటే ఎంత బావుండేది!' ఆ త్రోవనే పోతున్నరైతు తన కన్నీళ్ళు తుడుచుకొంటూ అన్నాడు.

'రామస్వామిబాబు పోయాడా!' అంటూ నోరు తెఱచి అలాగే వుండిపోయాడు ప్రక్కనున్న ఓ ముసలాయన.

'చౌదరిగారు తన జీవితమంతా నిస్వార్థసేవలో ఆంధ్రప్రజలకు ధారపోశాడు' అంటున్నాడు ప్రక్కనున్న యువకుడు తన ఎడమ చేతితో కళ్ళజోడు తీస్తూ.

'తెలుగు సాహిత్య క్షేత్రంలో కొన్ని శతాబ్దాలుగా పూడ్చలేని అగాధం ఏర్పడింది' అన్నాడు మరో తెలుగు పండితుడు సశ్యం పిలుస్తూ.

ఇంతలోపల శ్మశాన వాటిక వచ్చింది. జ్యేష్ఠపుత్రుడైన గోపీ చంద్ గారిచేత పండిత మదనమోహన విద్యాసాగర్‌గారు వేదోక్తంగా, దైవ ప్రార్థనలతో అంత్యక్రియలు జరిపించారు. సాహిత్య చక్రవర్తి సాక్షాత్కారం ఆనాటితో సమాప్తమయింది. సూతాశ్రమం వెలవెలా పోయి కళావిహీనమయింది.

కవిరాజు నిర్యాణంపట్ల అనేకమంది ప్రముఖులూ, వివిధ పత్రికల సంపాదకులూ, అసంఖ్యాకమైన పండితకవులూ, వారి కుటుంబానికి సంతాప సందేశాలందించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు తమ ప్రగాఢ సంతాపాన్ని ఇలా ప్రకటించారు :- "రామస్వామిచౌదరిగారు పరమపదించారన్న వార్తవిని నిర్ఘాంతపోయితిని. నా మిత్రులలో ఇంతటి శుద్ధవర్తనుడు మరియొకడులేడు. సంస్కృతములో మంచిభాషా పరిజ్ఞానము కల వాడు. ఆంధ్రభాష ఇతని కలమునకు స్వాధీనపడినట్లు మరియొక ఆధు నిక కవికి స్వాధీనపడలేదని నా నమ్మకము. జాతీయమైన శుద్ధాంధ్ర మును వ్రాయిగలవాడు తిక్కన తరువాత ఇతడే. 'బ్రహ్మద్వేషి' యని ఈయనకు పేరు గలదు. పలువురు బ్రాహ్మణులకుగల శూద్ర ద్వేషమున కంటే ఈయనకు బ్రాహ్మణద్వేషమెక్కువ లేదు. వేద ఋషుల మతములో అందరికీ సమాన హక్కు గలదనియూ, ఇది కూడ దనుట బ్రాహ్మణుల స్వార్థపర్వతమనియూ ఆయన విశ్వసించువాడు. ఇదియే బ్రహ్మద్వేషమైనచో, ఇట్టి బ్రహ్మద్వేషము గలవారు పలువురు బ్రాహ్మణులుగూడా కలరు". —ఆంధ్రపత్రిక, 20 జనవరి 1942.

"సారస్వతోద్యానములో పరిమళమును గుబాళించుచున్న ఒక పువ్వు రాలిపోయినందుకు దురపిల్లు చున్నాము".

——భారతి, ఫిబ్రవరి 1943.

''రామస్వామిచౌదరిగారి ఆకస్మిక మరణంతో ఆంధ్రసారస్వత ప్రపంచ నభోమండలమున ఉజ్జ్వలదీప్తితో వెలిగిన తేజః పుంజమగు నక్షత్రమొండు జారిపోయినది, అది మన దురదృష్టము''.

--ఆంధ్రప్రభ, జనవరి 1943.

''తనకు వశవర్తిఅయిన లేఖినిని తెలుగునేలలో ప్రబలివున్న కులాధిక్యాలను కూల్చివేయడానికి మతమౌఢ్యాలను మాపివేయడానికీ, సంఘాన్ని సంస్కరించడానికీ, ప్రత్యేక రాష్ట్రవాంఛను రెచ్చగొట్ట డానికీ తగు రీతిని వినియోగించి తెలుగునేలను కొలిచినారు. రామ స్వామిగారు స్వర్గస్థులయినారని ఆకస్మాత్తుగా వినరావడంతో విషణ్ణ హృదయులమైనాము. చౌదరిగారు స్వర్గస్థులవడంతో, తెలుగుదేశం తన సౌఖ్య, సౌభాగ్యాలకోసం సతతం తపించే ఒక అనుంగుతనయుని కోల్పోయింది. తెలుగుజాతి మౌఢ్యాంధకారాన్ని అవకులచెట్టి, ఉజ్వల మైన వెలుగును మనకు సమకూర్చ యత్నించే ఒక క్రాంతికారుని కోల్పోయింది".

—ఆంధ్రజ్యోతి, 1943.

"కవిరాజు, విప్లవకవి రామస్వామిచౌదరిగారు మహాప్రస్థానం చేయడంతో, నాడు పారిజాతాన్ని కోల్పోయిన దేవతలకు కలిగిన గుండె దిగులు, నేడు తెలుగు పారిజాతాన్ని కోల్పోయిన లోకానికి కలుగుతుంది. వీరి భౌతిక శరీరం ఫ్రెంచి విప్లవంలా అంతరించ వచ్చును కాని ఫ్రెంచి విప్లవజ్యోతివలెనే వీరి ఆశయాన్ని, ఆదర్శాన్ని అభ్యుదయం కోరే ఆంధ్రజగత్తు విస్మరింపలేదు."

— దేశాభిమాని, 24-1-1943

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు స్వర్గస్థులైనప్పుడు కవిబ్రహ్మ వెంకటనరసయ్యగారు తమ గురుదేవుని యీ క్రింది విధంగా సంస్మరించారు.

*"యోగి పుంగవుండు మా గురుదేవుండు
యముని గిమునిఁ గాలఁ జమరివైచి
తాఱు మాఱు లేక నూతేండ్లు పాటైన
బ్రతికి తీరునన్న భ్రాంతి కద్దు.

ఉక్కు పంజరమ్ము లూపిరి తిత్తులు
పొగల సెగల నుడికి పోవుచుండు
వజ్రదేహ మాంధ్ర వాఙ్మయ సేవకై
ధారవోసి మనకు దారిసూపె.

ధర్మవృద్ధు లన్న దరిఁజేర్చు కొనువేళ
జాతి మత వివక్ష చాయఁబోఁడు
ఆర్యకవి కుతంత్ర మడుగంట వలెనను
పట్టుదలకె నడుముఁ గట్టినాఁడు.

ఎన్ని జన్మలెత్తి యీ సిద్ధహస్తుని
కవితలోనఁజేయి గలుపఁగలము
తెలుఁగు కవుల మంచుఁ దెగరుంజు కొను వార
లితని పదము లాశ్రయింప కగునె?

ఒకట నన్నపార్యుఁ డొకచోటఁ దిక్కన్న
ఒకెడఁ బెద్దనార్యుఁ డొకట భట్టు
కనిపింతు రితని కావ్యదర్పణమున
నయిన వస్తు భేద మగ్గలంబు.

---

* త్రివేణి – ఏటుకూరి వెంకటనర్సయ్య

ముప్ప దేండ్ల సేవ కిప్పుడు గుర్తించి
ప్రజలు బ్రహ్మరథము పట్టినారు
కాని విశ్వగురుఁడు కన్నుమూయక మున్నె
మేలు కొనిరి కొంత మేలదైన.

అతని గ్రంధ జాల మడుగు పెట్టినచోట
మిత్రులెంతవారు శత్రులైరి
కన్ను దెఱచు కొలఁదిఁ గాలక్రమంబున
భేదముడిగి కాళ్ళ బేరమయ్యె.

పరుల మెప్పుఁగోరి పాటు బడ్డదిలేదు
స్వార్థమునకుఁ గేలు సాపలేదు
గొప్పతనము సూచి కోడయి కూసిన
జగము మాత్ర మింత సాక్ష్య మిచ్చు.

పరులు పైట పైటఁ బాషండు డనుకొన్న
ముగ్గు మీఁది కేరు మ్రొగ్గలేదు
పైకి రామస్వామి పాషండుఁ డగుఁగాక
అంతరాత్మ మాత్ర మాస్తికంబు.

పాంచ భౌతికమ్ము భస్మమైనదిగాని
తరిగిపోని కీర్తి తనువుగలదు

* * *

"రామస్వామిచౌదరి లాంటి మహాకవి, సత్‌విమర్శకుడు, నభూతో న భవిష్యతి''

—రాడికల్ ఫిబ్రవరి 1943

మరోపత్రిక "రామస్వామిచౌదరిగారు మానవధర్మ రక్షకుడు" అని ప్రశంసించింది.

గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారు యిలా తమ సంతాపాన్ని తెలియజేశారు :

"కవిరాజు కమ్మకులోద్భవుడు, హిందూమత సంస్కర్త యగు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు దివంగతులైనారు. అహా! ఏమి దుర్గతము? సూతపురాణకర్తనిక భౌతిక శరీరమున చూడజాలమా! ఓ ఆంధ్రదేశమా! ఎంత దౌర్భాగ్యస్థితికి వచ్చితివి! మిత్రుని ఆత్మ—తద్వారా తెనుగు సాహిత్య మత విజ్ఞానములు తరించుగాక!".

అనేకమంది పండితకవులు, సుప్రసిద్ధరచయితలు కవిరాజు నిర్యాణంపట్ల అశ్రుధారలు గార్చారు. యద్లపల్లి దేవయ్యగారి *'కన్నీటి ధార' చూడండి.

సీ॥ 'ప్రాతగాథకు వడపోత పోయగనేర్చు
 సూతాశ్రమములోని సుగుణుడేడి?
బుధపరేణ్యులు మెచ్చి పొంగిపోయెడి నూత్న
 భావోన్నతినిజూపు ప్రముఖుడేడి?
తెలుగుభాషకు క్రొత్త తెన్నులన్ జూపించి
 విప్లవంబును తెచ్చు వీరుడేడి?
జాతీయకవనంబు చలపట్టి మున్ముందు
 చాటి చెప్పెదనన్న చతురుడేడి?

గీ. కటకటా! యిదియేనాటి కర్మమమ్మ
ఆంధకార మాంధ్రకవిత నావరింప
దెలుగువారల గుండియల్ దిగ్గురనగ
జేసితివి మృత్యువా! యిట్టి చేత తగునె?'

*ములుకోల 1-2-1948

"కవిరాజు కర్షక కుటుంబానికి చెందినా, కర్షకుల అభివృద్ధినే కాకుండా, మార్క్సు మహాశయునివలె, వివిధకులాలలోని పీడిత ప్రజ అను అగ్రగజాతి బానిసత్వమునుండీ రక్షించిన మహామేటి, గొప్ప సంఘసంస్కర్త, కార్యశూరుడు, నిశిత విమర్శకుడు. రామస్వామి చౌదరిగారివంటి విశిష్టత గల వ్యక్తులను వ్రేళ్ళపై లెక్కించవచ్చు.

—గోలకొండ 1945

''రామస్వామిగారి అస్తమయంతో, 'ఆంధ్రదేశంలో సాంఘిక-మత-విద్యా ప్రపంచకములలో ఒక విప్లవ నాయకుడు అంతరించి పోయాడు"

— జమీన్‌రైతు 29-1-1943

"సనాతనత్వంతోనూ, అర్థంలేని అంధవిశ్వాసాలతోనూ, కరుడు కట్టుకుపోయిన సంఘంలో ఒంటరిగా నిలిచి, ధైర్యసాహసాలతో శంఖాన్ని పూరించిన విప్లవకవి మనకికలేడు. ఏటికి ఏదురీది, తన ఆదర్శమే ప్రధానంగా గైకొని కలంచేతపట్టి, ఎదురొచ్చిన మహా మహులను పల్టీలు గొట్టించిన కార్యశూరుడు. సాహసి, స్వతంత్రప్రేమి ఇక కనుపించడు. పూర్వగ్రంథాల్ని, పూర్వవేదాంత మత బోధల్ని, పూర్వ మూఢాచారాల్ని దూయబట్టి, కుళ్ళుతూవున్న సమాజానికి కాలానుగుణ పరిణామవాదాన్ని ఋజువుచేసి చూపి, తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చిన అగణిత ప్రతిభాశాలిని మనమెప్పటికినీ చూడ జాలము".

—ఆంధ్రాలేబర్ 24-1-1948

దుఃఖ నిమగ్నమై జాతి కన్నీరుకార్చినంతమాత్రాన కవిరాజు యెడల భక్తిశ్రద్ధలు చూపించినట్లుకాదు. వారు తలపెట్టిన ఉద్యమాన్ని కొనసాగించడానికి, వారు నడియాడిన ఉత్తమ మార్గాన్ననుసరించ డానికి ఆంధ్రలోకం ఆయత్తం కావాలి.

# స్మృతపురాణం

సాంఘిక వ్యవస్థలో మార్పువచ్చేముందు భావంలో మార్పు రావాలి. మూఢనమ్మకాలు మటుమాయంకావాలి. అంధ విశ్వాసాలు అంతరించాలి. అన్నింటి భారమూ భగవంతునిమీద వేసే అలసత్వం పటాపంచలు కావాలి. తన పనికి తనే బాధ్యుడ నన్న జ్ఞానం కలగాలి. తన జీవితం యిలా ఉండటానికి, తన చుట్టూవున్న పరిస్థితులే కారణం గాని మరేదో అదృశ్యశక్తి-లేదా-శక్తులు కారణమన్న అపోహ తొలగాలి. అలా జరిగినప్పుడే మనిషి తనశక్తిని తాను తెలిసికొంటాడు. తను ఇలావుండటానికి కారణం తనలాంటి వాడేనన్న సత్యం తెలియగానే తన స్థితిని బాగుచేసుకోడానికి నడుం బిగిస్తాడు. పట్టుదల వహిస్తాడు. కార్యరంగంలోకి దూకుతాడు. ప్రచండంగా విజృంభించి విజయం సాధిస్తాడు.

వైదిక మతం యిందుకనేక అడ్డంకులు కల్పించింది. వర్ణాశ్రమ ధర్మాలను నెలకొల్పింది. దేవుణ్ణి, దేవతలనూ సృష్టించింది. ద్విజత్వం – బ్రతుకే రెండు జన్మలు చేసి పవిత్రమైన అగ్రజాతిగా కొందరిని ప్రచారం చేసింది. మరికొందరిని బానిసత్వంలో శాశ్వతంగా ఉంచే సూత్రాలను 'మనుధర్మ శాస్త్రం' పేర సృష్టించింది. జాతివిభేదాలు రెచ్చగొట్టింది. శూద్రజాతికి వేదాలు చదివేహక్కు లేదంది. ఒకవేళ చదివితే సీసం కరిగించి చెవులలో పోయమంది. గుడులలోనికి పోవడం పాపమంది. బడులలోనికి పోవడం కూడదంది. రాజు దైవాంశసంభూతుడు గనుక తప్పు చేయడంది. ప్రజలకు ప్రశ్నించే హక్కు లేదంది. అంతా మన పూర్వజన్మ సుకృతంపైనే ఆధారపడి ఉంటుందంది. ఈ జన్మలో పాపంచేస్తే నరకంలో యమ బాధలకు

గురికావలసి ఉంటుందని భయపెట్టింది. ఈ జన్మలో పుణ్యంచేస్తే స్వర్గానికి సోపానాలు వేయడమే ఔతుందంది. కర్మ ఫలితం అనుభ వింపక తప్పదంది. అంతా 'మీకర్మ' అన్న ఒక్క ముక్కతో విశ్వమంత మనిషిని మట్టిముద్దగా మార్చేసింది. మానవునిలోని శక్తిని నీళ్ళుగార్చేసింది. అతన్నిండా దుమ్మూ ధూళీ కప్పింది.

ఇలాంటి సంఘస్థితి అగ్రజాతివారికే అసహ్యత కలిగించింది. రోత పుట్టించింది. ఈ దుస్థితిని తొలగించి సంఘాన్ని సంస్కరించవల సిన ఆవశ్యకతను కందుకూరి వీరేశలింగం పంతులుగారు గుర్తించారు. 1894 సం. లో రాజమహేంద్రవరంలో నెలకొల్పబడిన 'ప్రార్థన సమాజం'లో పంతులుగారు గావించిన *ఉపన్యాసములోని కొంత భాగ మును ఇచ్చట ఉటంకిస్తున్నాను. "స్వప్రయోజన పరులైన కొందరు సర్వజనులను మూఢత్వమున ముంచి, దేవతారాధనమునుమాని తమ్మా రాధించుటయే పరమార్థమని బోధించుటచేత పరులను చెఱచి తాము పొదగుచున్నారు. ఒరులను జెఱుపదలచుకొన్నవాడెప్పుడును తాను బాగుపడడు. తమ పాదధూళి శిరమున దాల్చుటయే పరమార్థమని ఇత రులకు సదా బోధించుచుండుటచేత వారికదియే విద్యయయి సత్య విద్యలన్నియు మూలబడినవి. అందుచేత పర్వతములకు, నదులకును బిడ్డలు పుట్టుట వారికి గొప్ప సత్యము. కల్లు సముద్రములును, నేతి సముద్రములును వారి భూగోళశాస్త్రము. సూర్యచంద్రులను పెద్దపాము మ్రింగుట వారి ఖగోళశాస్త్రము. స్వకాయకష్టము విడిచి యిట్టి సత్య ములు బోధించి జీవించుట వారి కులవృత్తి. ఇట్టి జ్ఞానవంతులు తామే సర్వజ్ఞులమను కొని యున్న నాలుగు శాస్త్రములను తామే యభ్యసించి ఇతరులకు చదువ నీయక పూరోహిత్యముల సత్యములను ప్రకటించియే

---

* 'వర్ణము' శ్రీ కందుకూరి వీరేశలింగంగారు

యాత్మభక్షణము చేసికొనుటచేత వారికి నిజమైన జ్ఞానము సంపాదించుటకుగాని, వృద్ధిపొందించుటకుగాని జనులలో వ్యాపింప జేయుటకుగాని యావశ్యకము లేకపోయినది. అందుచేత క్రొత్తవిద్యలు రాకపోగా క్రమక్రమముగా నున్న విద్యలు సహితము నశించి వానికితరులను వంచించుటలే కులవిద్యలయినవి. ఈ కారణమును బట్టి మనదేశమునందు శూద్రజనులకు మాత్రమేకాక భూదేవతలకుకూడా జ్ఞానవృద్ధిలేక మూఢత్వం సంప్రాప్తమయినది. మనదేశముయొక్క దీనపతనమునకు గూడ కొంత వఱకీ వర్ణభూతమే కారణము. కల్లలకొడిగొట్టి కూటసాక్ష్యములు పలికి దుర్దానములు పట్టి పొట్టపోసికొను కుక్షింభరాధములు తమ దుశ్చ చరిత్రమునకు సిగ్గుపడుటకు మారుగా, సత్యసంధులయి యణుమాత్రమును ధర్మమార్గము నతిక్రమింపక కష్టార్జిత ధనముతో జీవనము చేయు బ్రాహ్మణేతరుల కంటెను జాతిమాత్రము చేతనే తామధికులమయితిమని గర్వపడుచు వారి గాలిసోకినను తాము మైలపడుదుమని భావించుచున్నారు. ఇట్టి దుర్గర్వముచేత మనుష్యలక్షణములైన దయాదాక్షిణ్యాదులును, నీతియు మనవారి హృదయ వాసములనుండి పాఱిపోగా వానిస్థానమున రాక్షసగుణములైన నిర్దయత్వాదులును దుర్నీతియు హృదయ కుహరములయందు ప్రవేశించి యదేచ్ఛగా రాజ్యము చేయుచున్నవి. అగ్రజాతివారమని గర్వపడు ఛాందసులు తమకన్నుల యెదుట చెట్టు విఱిగి శూద్రునిమీద పడినను పయికిదీయక దయాశూన్యులయి తాకినచో దమకు మైలసోకునని దూరముగా తొలగుచున్నారు". ఈ విధంగా వీరేశలింగం పంతులుగారు కొంతవఱకు కృషిసల్పినా, ఈ వర్ణవ్యవస్థా వృక్షాన్ని కూకటివ్రేళ్ళతో కూల్చలేకపోయారు. ఈ పనికి రామస్వామి చౌదరిగారు పూనుకోక తప్పలేదు. ఆనాటి సంఘస్థితి చౌదరిగారి హృదయాన్ని ఎంతగానో కలవరపఱిచింది.

అసలు అలాంటి పరిస్థితులు సమాజంలో ఏర్పడటానికి కారణాలను పరిశోధింపసాగారు చౌదరి గారు. స్వార్థపరులైన అగ్రజాతి తమ నిరంకుశత్వాన్ని నిలబెట్టుకోడానికి అనువుగా సృష్టించిన పౌరాణికాది గ్రంథాలు, స్వర్గనరకాలు ఒకవంక – మతం, భగవంతుడు మరో వంక – సంఘాభివృద్ధికి తీవ్రమైన ఆటంకాలని భావించారు. వారు పెను తుఫానులా విజృంభించి ఆధ్యాత్మిక వాదం పేరు మీదగానూ, వర్ణ వ్యవస్థ పేరు మీదుగానూ జరుగుతున్న కల్మలాన్ని క్షాళనం జేయాలని సంకల్పించారు.

చిరకాలజీవి, పరమకరుణా స్వభావుడు, గంగానదీతీరమున తపోనిష్ఠాగరిష్ఠుడు అయిన సూతమహర్షిని రామస్వామిగారు సందర్శించి. పుణ్యభూమిగా గణుతికెక్కిన ఈ భారతదేశంలో భగవంతుని పేరు మీదుగానూ, స్వర్గ – నరకాల పేరుమీదుగానూ. పూర్వగ్రంథాల పేరుమీదుగానూ జరుగుచున్న అపచారాలనూ, అన్యాయాలనూ, అసత్యాలనూ సూతునిముందు ఏకరవు పెట్టారు. రామస్వామి గారికీ, సూతమహర్షికీ సుదీర్ఘమైన వాదోపవాదాలు జరిగాయి. ఎట్టకేలకు భారతదేశంలో జరుగుచున్న వంచనను. మోసమును అవగాహన చేసికొన్న సూతముని, చౌదరిగారిని లోకకళ్యాణార్థం ఓ కావ్యం వ్రాయమనగా వారి ఆజ్ఞనుసారంగా పాతపురాణం గాని ఈ సూతపురాణాన్ని రచించారు. సూతపురాణ రచనావశ్యకతను పీఠికలో రామస్వామి గారు ఇలా వివరించారు. "ప్రాకృతజనంబునకు వేదార్థము సులభైక వేద్యము కాదని యెఱింగి వైదికులును, నిష్కాములును, లోకసంసర్గ రహితులును, నిసర్గభూతదయాశీలురను నయిన ఋషిచంద్రులు నిర్వ్యాజకరుణా విశేషంబున 'స్త్రీ శూద్రద్విజబంధువులకు' ముక్తి మార్గముఁజూపి తరింపజేయుటకునై వేదార్థమునుటంకించి పురాణములు

వ్రాసిరని ఆర్యోక్తి. ఈ యార్యోక్తియందు విశ్వాసముంచి మూఢ లోకంబు పురాణము లార్షేయములనియుఁ, దత్కారణమునఁ బూజ్యము లనియు, దదంతర్గత ధర్మములు నీతులు, కథలు శిరోధార్యములనియు విశ్వసించుచున్నది. ఈ విశ్వాసము వలనఁ గలిగిన ప్రతిఫలమాత్మ ద్రోహముగాఁ బరిణమించుటఁజేసి పురాణము లెంతవరకుఁ బ్రతికూల ములో, ఎంతవఱకు నీతిబాహ్యములో, యెంతవరకుఁ బక్షపాత భూ యిష్టములో మోద్పుగన్నుతోనున్న విద్వల్లోకమునకుఁ జూపించు తలం పుతో సూతపురాణము రచింపబడినది. తత్కారణమున సూతపురాణము కారణజన్మ". దేశకాల పరిస్థితులను గమనించి గతానుగతికంగా అంధప్రాయంగా పోతున్న ప్రజాజీవితంలో భావవిప్లవాన్ని, వర్గచైత న్యాన్ని కలిగించడానికిగాను కలాన్ని పట్టిన యుగకర్త కవిరాజు. సత్యాన్వేషణ దృష్టితో తాను యధార్థమని విశ్వసించిన సిద్ధాంతాన్ని నిర్భయంగా లోకానికి "సూతపురాణం" ద్వారా వెల్లడించారు.

మతవ్యవస్థలో మహాకుట్రవున్నదని ఆయనకు నమ్మకం. తాను నమ్మిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికే తనకవితను సాధనంగా వినియోగించారు.

జన్మాధిక్య సూత్రకారణంగా అగ్రజాతి సంఘంతో తామే పెత్తనం జేయాలనడం. ఇతర జాతులు తమ 'కర్మ' ఫలితం అనుభ వించక తప్పదనడం చౌదరిగారిని విస్మయచకితులను చేసింది. ఈ చిత్రపరిస్థితిని చౌదరిగారు ప్రథమాశ్వాసంలో ఎంతచక్కగా వర్ణించారో చూడండి.

గీ॥. 'విభుఁడొకఁడు చేయునంట పై పెత్తనంబు!
కర్మయొకఁడు సంసారచక్రంబుఁద్రిప్పు
నంట ! ! ద్వంద్వ ప్రభుత్వమిం దమరలేదె ?
ఎంతకాలంబు సాఁగునో యిట్టిచిట్ట !

గీ. దక్షిణాఫ్రికా యందు నిర్దయులు తెల్ల
వారు భారతీయులఁబెట్టుపాట్లుఁగాంచి
గొల్లుమని యేడ్చు నెంతో గగ్గోలు పడుచుఁ
బనవుచుండును నీనాఁటి బ్రాహ్మణుండు,

గీ 'కాని తానుమాత్రమె యంటరానివాండ్రు
ముట్టరాదుఁళ్ళను బ్రవేశ పెట్టరాదు.
బొమ్మనుచునుండు మాలల బోధపడదు
తండ్రి! నేఁటి బ్రాహ్మణుని చిత్తప్రవృత్తి'

దేశభాషయైన సంస్కృతమును ద్విజేతరులు చదవకూడదని, చదివితే నరకప్రాప్తి కలుగుతుందని విప్రులంటున్నారని, వివేకవంతులైన మీ అభిప్రాయమేమని చౌదరిగారడుగగా సూతుడు ఇలా అన్నాడు:

శా॥ కార్యాకార్య వివక్షనుం దెలిసియుం గాలుష్యముండూఁటఁగా
ధైర్య స్థైర్యములేక ధర్మముల నుద్ఘాటింతురే? భూసురుల్
మర్యాదన్ దిగద్రావి యీసరణి రామస్వామి! చిత్రంబహో!
ఆర్యావర్తము పుణ్యభూమియగుటె కట్టా! యేమికానున్నదో! !'

దేవభాష నభ్యసించడానికి శూద్రులకు అర్హతలేదనీ, తెనుగు చదవడానికి భూసురులు యోగ్యులుకారనీ భావించే వారికోసం "కబీరుదాసు పూర్వజన్మవృత్తాంతము"ను మిక్కిలి మనోహరంగా వర్ణించారు.

గోదావరీ మండలంలోని ద్రాక్షారామంలో దేవశర్మ అనే భూసురునికి ఒక బాలుడు జన్మించాడు. తల్లిదండ్రులు కుమారునికి "శాస్త్రి" అని నామకరణం జేశారు. శాస్త్రి పిన్నవయస్సులోనే గురుముఖంగా

చతుష్షష్టి కళలను నేర్చుకొని, కూలంకష సుస్థిర పాండిత్యప్రతిభా పరిణితుడయ్యాడు. శాస్త్రి చక్కని గానకోవిదుడు. కంఠమెత్తి సామ గానంజేస్తే తుంబురుడు ప్రత్యక్షపడి తంబుర తటుపారవేసి, చెవులు నిక్కించి వినవలసిందే. సంస్కృతములో చదవని చదువేలేదు. కాని తెలుగు భాషను చదవడం వారి ఇంట సంప్రదాయంకాదు, అందుచేత శాస్త్రికి తెలుగు భాషను నేర్పించడానికి దేవశర్మకు ఇష్టంలేదు. కాని అన్ని భాషలలోనూ పండితుడనిపించుకోవాలనే తాపత్రయంకొద్దీ, శాస్త్రి తండ్రి మాటలను పెడచెవినిబెట్టి తెనుగుభాష నభ్యసించడం ప్రారంభించాడు ఒక సంవత్సరంలోనే ఆ భాషను ఆమూలాగ్రంగా నేర్చుకోగలిగాడు. కాని ఏం ప్రయోజనం? తెనుగు చదవడంతో అతనికి ''మనోజ్ఞాచ్ఛాం మోసులెత్తి'' బుద్ధికి విడాకులిచ్చాడు. అతనికి స్వాస్థ్యం లేకుండా పోయింది. దేవశర్మ ఆరోజుకారోజు నీరసించుతో కృశించి పోసాగాడు. ఎట్టకేలకు శాస్త్రి మరణించి కొంతకాలం నరకం అనుభవించి శ్రీరంగంలో ఒక ఆవుదూడగా జన్మించాడు. పాపం! తెనుగుభాషను నేర్చుకొన్నందుకు శాస్త్రికి ఎంత దుర్గతి పట్టింది !

ఈ విధంగా 'శూద్రులు సంస్కృతభాషను, భూసురులు తెనుగు భాషను చదవకూడదు' అని అగ్రజాతి సంకుచిత మనస్తత్వంతో ఏర్పరచిన నిబంధనలను మహా చక్కగా, సునిశితంగా విమర్శించారు చౌదరిగారు. వారి పరిహాసం పరాకాష్ఠను చేరుకొంది.

ద్వితీయాశ్వాసం రామస్వామిచౌదరిగారి కమనీయమైన కవితా శైలికొక మచ్చుతునక. అందులోని ప్రతిపద్యం ఒక రసగుళిక. "నందనోద్యానము"ను వారు ఆ పాత మధురంగా వర్ణించినది ఈ అశ్వాసంలోనే. ఇందులోనే కవిరాజు ప్రతిభావ్యుత్పత్తులు ద్యోతక మౌతాయి. "గంగావతరణము''ను విమర్శించినది గూడా ఇందులోనే.

సగర చక్రవర్తి పుత్రులు యజ్ఞాశ్వమును అన్వేషిస్తూ పాతాళ లోకంలో సమాధి స్థావస్థలో వున్న కపిలమహర్షి పై నేరమారోపించి అతని కోపాగ్నికి బూడిదరాసులై పోయారనీ, ఉత్తమలోక ప్రాప్తికై వారి అస్థికలపై, మనుమడగు భగీరథుడు కాలి బొటనవ్రేలిపై నిలబడి, గాలితింటూ బ్రహ్మాండమైన తపస్సు చేసి, భూలోకంలోనికి గంగను తెచ్చాడని పాతపురాణాలు ఘోషిస్తూన్నాయి. అది యధార్థ మని విశ్వసించని చౌదరిగారు గంగావతరణ ఘట్టాన్ని పేలపిండిగా ఊదివేశారు. ఆ సందర్భంలోని ఈ రెండు పద్యాలను మచ్చుకి ఇక్కడ పొందుపరుస్తున్నాను.

సీ॥ 'గగనంబులో నుండి గంగమ్మ శివు మస్త
మున దూకె ననుమాట పులుచమాట
అతి తపోనియతిచే నలభగీరథుడు గం
గను దెచ్చె ననుమాట కల్లమాట
గంగాజలంబుచే గుంది నిండింపగా
బడియె సుమ్మనుమాట బడుగుమాట
శైవ జటాజూట సక్తయై తిరుగాడె
వేల యేండ్లనుమాట వెఱ్ఱిమాట

గీ. సగరసుత భస్మరాసుల సరవి దడవి
స్వర్గమునకంపె ననుమాట వట్టిమాట
టక్కు నేర్పెడి కవుల గంటాల వ్రాత
కాదనగరాదు ప్రాచీన కవులుగాన.

సీ॥ 'కైలాసగిరి మించుగల గండశైలంబు
పుడుకులిచ్చెడి లింగమూర్తి గాగ

అల్లిబిల్లిఁజుట్టు నల్లు పుష్పలతా చ
　　యంబు చంద్రార్ధ జూటంబుగాఁగ
ప్రస్థంబుపైనుండి వచ్చుచున్న జలధార
　　తరళగంగా ప్రపాతంబుగాఁగ
పడి జాలుగాఁబాఱు వట్టిభగీరథు
　　నడుగంటిచను గంగ నడకగాఁగ

గీ.　నమ్మకం బుట్టిపడునట్టు నక్కిబుద్ధి
పూర్వకంబుగా లోకముఃబుండలించి
చిత్రకథ వ్రాసినారు ప్రాచీనకవులు
స్వార్థమొ ! పరార్థమో ! భగవంతుఁడెఱుఁగు'

తృతీయాశ్వాసంలో ద్రావిడుల పట్లా, ద్రవిడదేశం పట్లా చౌదరి గారికిగల గాఢాభిమానం ప్రగాఢంగా ద్యోతమాన మౌతుంది. ద్రవిడ రాజయిన హిరణ్యకశిపుని రాజ్యపాలన ఎలా ఉందన్నారో చూడండి.

సీ॥　'మాంసపంకిలములౌ మఖశాలలును లేవు
　　భగవంతునకు జంతుబలులు లేవు
ఇంకిపోయెడునట్టి యేరువాఁకలు లేవు
　　సివమెత్తి కాయని చెట్లు లేవు
విసరికొట్టెడునట్టి వేడిగాల్పులు లేవు
　　పండకుండెడి చౌటిపడెలు లేవు
మూఁడువానలులేక పాడైన నెల లేదు
　　ఋతుధర్మ మెఱుఁగనియేడు లేదు

గీ. లేశమైనను బ్రజలకు లేమి లేదు.
దొంగతోడుబోతుల పొజుదొద్ద లేదు
బ్రథితవీరాగ్రగణ్య హిరణ్యకశిపు
ధారుణీ పాలకుండేలు ద్రవిడసీమ.'

యథార్థ రామాయణములోని 'లంకాపురవర్ణన' పై విషయాన్నే ధృవ పరుస్తున్నది.

సీ. 'మూఁడు కాలములందుఁబూచి నెత్తావులం
బొలమెల్ల విరజిమ్ము పూలచెట్లు
అకాల మికాల మేకాల మనకుండఁ
బగటిల్లి తెగకాయు పండ్లచెట్లు
మిద్దిమేడలకొద్దె విద్దంపు మెఱుఁగారు
ముద్దుకల్పనొసంగు మద్దిచెట్లు
పశుపక్షిమృగకీట వర్గంబునకునెందు
నిలువనీడనొసంగు విడుదచెట్లు

గీ. తీగగుంపు గాటంబుగాఁ గౌగఁలింప
మిగులరమణీయమై చూపుమేరవఱకు
వ్రేఁగువ్రేఁగుగా గన్పట్టు విపినభూమి
యిమ్ముకొనియుండు ద్రవిడదేశమ్మునందు."

చతుర్థాశ్వాసంలో శ్రీకృష్ణుడవతార పురుషుడుకాడనీ, అతడొక రాజకీయవేత్తనీ, ఆర్యుల అనుగ్రహంతో, వారి బంధుత్వంవల్ల, తమ జాత్యంతర్భాగాలైన భోజవృష్ట్యాది జాతులతో బాంధవ్యం ఏర్పాటుచేసు

కాని రాజ్యాభిషిక్తుడై ఆర్యమతోద్ధరణకు కృషిచేశాడని భావించారు చౌదరి గారు. అతడు ద్రావిడుడైనప్పటికీ, జాత్యాభిమానాన్ని త్యజించి, అనేక మంది ద్రావిడులను వధించాడు. కట్టకడకు అతడు కృతార్థుడు కాలేక పోయాడు. శ్రీకృష్ణుని అనంతరం యాదవ కులానికి చెప్పరాని దుర్గతి పట్టిందని చౌదరిగారితో సూతుడిలా అన్నాడు :

సీ. 'కామోపభోగముల్ కాంక్షించి వాంఛించి
చెలరేఁగి యాదవ స్త్రీజనంబు
మితిమీరిగతిఁ దప్పి మ్లేచ్ఛకిరాత ని
షాద పురుషాళి పజ్జఁజేరి
కాంతారవీధులఁ గదలిపోయిరి వారు
మరులెత్తి సరిక్రొత్త మగలతోడ
శ్రీకృష్ణునంతటి చిరయశోవంతుని
చెలిమి చుట్టరికంబుఁ జేసియుండి

గీ. యపుఁడు చవినంత కుల గౌరవాదులైన
సరకు సేయక దుశ్చింత జారపాళి
గూడ యేగిరి కామార్తకుటిలు లగుచు
నేమికలదు రామస్వామి ! యింకఁజెప్ప.'

రామాయణ, భారత, భాగవతాలను సూతపురాణంలో నిశితంగానూ, విప్లావికంగానూ, కళాత్మకమైన విమర్శనా దృష్టితోనూ పరిశీలించారు చౌదరిగారు. తెలుగుదనం ఉట్టిపడేటట్టుగానూ, భాషా విషయికంగానూ, కవిత్వదృష్ట్యా పాతపురాణాలపై గొడ్డలిపెట్టుగా వెలువడిన గొప్ప విమర్శనాత్మకగ్రంథం సూతపురాణం. తెనుగుసాహిత్య క్షేత్రంలో విమర్శనాత్మకమైన రచనలపంట మిక్కిలి తక్కువ. చౌదరిగారివలే

చక్కగా, చిక్కగా విమర్శనలు వ్రాయగలిగిన కవులనుగానీ, పండితులను గానీ వ్రేళ్ళమీద లెక్క బెట్టవచ్చును. సూతపురాణంలో చౌదరిగారు పాత పురాణాలలోని అభూతకల్పనలను ఎలుగెత్తి చాటారు. మచ్చుకి ఈ క్రిందిపద్యాలను పఠించండి.

సీ. 'అంబుధిసప్తకం బాపోశనము జేసె
నొక్కరుండనిచెప్పు నొక్క కథను
సర్వభూచక్రంబు చాపచుట్టగజుట్టె
నొక్కరుండని చెప్పునొక్క కథను
సప్తాశ్వజాయకై సానబట్టెను బట్టి
యొక్కరుండనిచెప్పు నొక్క కథను
కొండకై ఎగిరెడి కొండరెక్కలగూల్చె
నొక్కరుండని చెప్పు నొక్క కథను.

గీ. క్రోతికొండముచ్చులకును గొండలకును
మానవులు పుట్టిరనునట్టి మాయమాట
లన్ని కథ లీ పురాణము లందె కలవు
పిట్టకథలకు నిదియెల్లఁ బుట్టినిండ్లు.

సీ. 'పాథోజనాభుండు భగవంతుడొకచోట
నొకచోట స్త్రైణశాపోపహతుడు
అఖిలాక్షుఁ డద్వితీయ బ్రహ్మయొకచోట
నొకచోట ఋషిపత్నులపవిటుండు
అబ్జగర్భుండు స్వయంభువౌ నొకచోట
నొకచోట శత్రుపాదోపహతుడు
దేవకీపుత్రుడింద్రియజేత యొకచోట
నొకచోట జారపాళికి గురుండు

గీ. శుకపరబ్రహ్మ యొకచోట శుద్ధజనుఁడు
వేఱె యొకచోట సంసారివిద్ధ తండ్రి
యన్ని కథ లీ పురాణములందె కలవు
పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు.

సీ. 'ధరణీంద్రుఁడైనట్టి దశరథున కరదం
బులు పదిగలపంక్తిఁ బలుకునటుల
దైత్యేశుఁడైనట్టి దశకంఠునకుఁ గంఠ
ములు పదికలవంచుఁ బలుకునటుల
దితిజ సేనానియౌ త్రిశిరునకును మూఁడు
తలలుగల వటంచుఁ బలుకునటుల
ఋషిపుత్రుఁడైనట్టి ఋష్యశృంగునకొక్క
మనుబోతుకొమ్ముండె ననెడునటుల

గీ. వినుము ప్రాచీనబర్హికి వేయిగనులు
కలవని పురాణములు పల్కఁగంతమెత్తి
వేయికన్నులు నాకు గన్పింపలేదు
పొదలు మాత్రము కన్పించె నొడలినిండ.'

సీ 'మండూకముని లోకమాన్యుండు మండూక
మునకు జన్మించినాఁడనెడి రీతి
సుశ్లోకచరితుండు శుకయోగి శుకిగర్భ
మున సంభవించినాఁడనెడి రీతి
మౌనితల్లజుఁడైన శౌనక బ్రహ్మర్షి
శునిగర్భమునఁ గల్గె ననెడు రీతి
అఖిలాస్త్ర సంవేదియైన యశ్వత్థామ
యశ్వమునకుఁ బుట్టె ననెడు రీతి

గీ. వినుము ప్రాచీనబర్హికి వేయిగనులు
కలవని పురాణములు పల్కఁగంఠమెత్తి
వేయికన్నులు నాకు గన్పించలేదు
పొడలుమాత్రము కన్పించె నొడలినిండ.'

వాల్మీకో, వ్యాసుడో నిజంగా ఈ పురాణాలను వ్రాసివుంటే వాటిలో యున్ని అసంబద్ధాలు (Improbabilities) ఉంటాయా? కాబట్టి 'వ్యాసుడు వ్రాయలేదు, ప్రతిభాష్యుడు సూతుడు చెప్పలేదు' అన్నారు చౌదరిగారు. ఐతే, ఈ పురాణాలను ఎవరు వ్రాసినట్టు? ఆంధ్ర దేశంలో ప్రచారంలో వున్న అనేక చిత్రవిచిత్రమగు కథలు తెనాలిరామలింగని మెడకంట కట్టినట్టుగా, అగ్రజాతి స్వార్థబుద్ధితో రచించిన గ్రంథాలను, వ్యాసునిమెడ కంటగట్టిందని సూతుడు రామస్వామిగారితో ఇలా అన్నాడు :

శా. 'నాపేరన్ వెలయించి నామెడకు నంటన్‌గట్టి తద్గ్రంథముల్
నాపై నేరము మోపగాఁ దలఁచి యన్యాయంబు న్యాయంబుగాఁ
బాపంబున్ సుకృతంబుగాఁగ రచియింపం జాలినా రెవ్వరో!
నాపైఁబెట్టిన యట్టి యీ యగము మాన్పంగాఁ బ్రయత్నించెదన్.'

పాతపురాణాలలోని అంశాలను నిజాలని భ్రమపడరాదనీ, కల్పనా పటిమకంటే మించి వాటి కధిక ప్రాధాన్యతలేదని కవిరాజు విశ్వాసం. ఈ ప్రగాఢ విశ్వాసంతోనే ఒక్క పట్టున 'లోకులు దిట్టిన నిజమే, వాకొనఁగా గట్టి పట్టుఁబట్టిన వాఁడన్, లోకుల,యిష్టానిష్టములా! కవిలోకంబు కలము నాకట్టంగన్' అంటూ 1925 సం॥లో మొదలు పెట్టి సూతపురాణం నాలుగశ్వాసాలు రచించారు. అగ్రజాతి అధికారసాధనాలను నిశితంగా విమర్శించి, హేతువాదము (Rationalism) నకు ప్రత్యేక స్థాన మిచ్చి,

బానిసత్వంలోవున్న ప్రజాబాహుళ్యానికి చైతన్యం కలిగించి, మూఢ విశ్వాసాలను పటాపంచలుజేసి, అగ్రజాతి నిరంకుశత్వం యొక్క పునాదులను ఊడగొట్టిన 'భావవిప్లవ విధాత' చౌదరిగారు.

సూతపురాణం ప్రచురణతో అగ్రజాతిలో ఆగ్రహం అధికమై, ఆగ్రంథప్రతి నొకదానిని అగ్నిహోత్రుడి కర్పించింది. ఐతే, వారిలోనే 'జాతిద్వేషము లల్పబుద్ధుల మెదన్ సాక్షాత్కృతిన్ జూపు' నని భావించిన సాహితీవేత్తలు సూతపురాణమును ప్రశంసించక పోలేదు. రామస్వామి చౌదరిగారి భావనా పటిమకూ, కల్పనా వైచిత్రికే అచ్చెరు వందిన వారి గురువర్యులు కింకవీంద్రఘటా పంచాననులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు "సూతపురాణ కల్పనకు సూరు లసూయకు, గొంతలోఁగియున్, జేతము నందు మెత్తురని చెప్పుదు నందియమంద లేశమున్" అన్నారు. రామస్వామి గారిరచనా సంవిధానాన్ని కూడా వేంకటశాస్త్రిగారు ఎంతగానో ప్రశంసించారు. ఈ క్రింది పద్యం చూడండి.

ఉ. 'సూతుఁడెచెప్పినాడని ద్విజుల్ వివదించుట చూచిమొంతయో
చేతమునన్ విచారణముచేసి, తదుక్తులనాఁగనీతఁడా
సూతునిచేత, 'నేనెఱుఁగఁజు' మ్మనిపించుట నాకునచ్చి, యీ
రీతిని మెచ్చితిన్ గవివరేణ్యులు కావనరంచు నెంచెదన్.'

అంతేకాదు ___

కం. *"బూతుపురాణముకాదిది
పాతపురాణమును గాదు పాతకహరమౌ
సూతపురాణం బియ్యది
పూత పురాణంబు పుణ్య పురుషావళికిన్."

అంటూ 'యోగ్యతా పత్రం, కూడా ఇచ్చారు వేంకటశాస్త్రిగారు.

---

* ఆంధ్రప్రభ వారపత్రిక 30-12-1959

దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ''సూత పురాణమును బోలు మరియొక సృష్టి ఇంతవరకును ఉత్పన్నము కాలేదు, కాబోదు. సంస్కృతపురాణములలోని అభూతాంశములు, స్వకపోల కల్పిత గాథలు సూతపురాణములో గోచరింపవు. ఇందులోని కవిత సుధా మధురము. మొత్తము గ్రంథమొక అమృత ఝురి. తెలుగు సాహితి కొక నూతన సృష్టి ; క్రొత్త వెలుగు, ఇలాంటి ఉత్తమ పౌరాణిక విమర్శనా గ్రంథమును ఆంధ్రులకు ప్రసాదించిన రామస్వామి చౌదరిగారికి పౌరాణిక ప్రపంచమున వాల్మీకికిని, వ్యాసునికిగల స్థానము గలదు'' అని చౌదరిగారిని అభినందిస్తూ వారే ఆ గ్రంథాన్ని సమీక్షించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు తమ అభిప్రాయాన్ని ఈ విధంగా వెల్లడించారు : త్రిపురనేనివారిది పండిత వంశము. కవిరాజున కపారమైన పాండిత్యము గలదు. సంస్కృతాంగ్ల భాషలలో గాఢమైన ప్రవేశ మున్నది. అందు చౌదరిని పండిత కవి యని చెప్పనొప్పును. సూత పురాణము రచించు నాటికి వారి కవిత్వము పండినది. శివకవులను మించి జానుతెనుగులో వ్రాయగలిగిరి. మధురమైన శైలి. సంభాషణలో అంత పెటుకుగా మాట్లాడే మనిషి అంత మృదువుగా ఎలా వ్రాస్తాడా అని పిస్తుంది. వారి గ్రంథములన్నిటిలో సూతపురాణ ముత్తమకావ్యము. అందులో అమృతపు సోనలు గలవు".

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు యిలా అన్నారు : వ్యక్తిగతమైన భావాలను స్వతంత్రంగా వ్యక్తంచెయ్యటం అందరికీ చేతగాదు. లోకానికి ఇష్టమైనా కష్టమైనా లక్ష్యం చేయకుండా స్వభావ సిద్ధంగా స్వధర్మాన్ని వ్యక్తంచేసిన వ్యక్తి కవిరాజు. కవిత్వం అంటే

కేవలం శబ్దాడంబరంతో కూడిన సమాన భూయిష్ఠమైనది కాదు. ఇప్పటి పొట్టి పొట్టి పొడిముక్కల భావకవిత్వమూ కాదు. రామస్వామిగారి సూతపురాణం ఒక ఆశ్చర్యకరమైన గ్రంథం. నాకూ వారికీ బాల్యంనుండీ పరిచయం ఉంది. తెలుగుతనం తొణికిసలాడే లాగానూ, కవిత్వ దృష్ట్యానూ చక్కగా రచించబడిన గ్రంథమిది. ఇందులో అపురూపమైన రవ్వల్లాంటి తెలుగు పదాలు ఎన్నోవున్నాయి. కవికిగల ద్రావిడాభిమానం ఇందులో వ్యక్తమౌతుంది.

ఇంకా మరికొందరు కవులు సూతపురాణమును రచించినందుకు చౌదరిగారిని ఎంతగానో కొనియాడారు. ఈ క్రింది పద్యములను చూడండి:

చం. శ్రుతుల్ పురాణముల్ స్మృతులు చూచియు నందలి సత్యమున్ జగ
ద్ధితముగఁదెల్ప నెంచి మది నిచ్చక ముంచక సర్వమానవ
నుతులకు పాత్ర మౌనటుల 'సూతపురాణము' నున్ రచించి స
న్నుతిఁగవిసట్టి నీ మహిమనుంగొనియాడ వశంబె? చౌదరీ!

ఉ. ప్రాఁత పురాణముల్ కలుషభావయుతమ్ములు కలబొల్లికెన్
బాఁతఅలన్న మీ యమృతవాక్కుల సారము దివ్యవాణియై
సూతపురాణ రూపమున శోభన మోహన మంజుల పేశలో
పేతసుధార్ద్ర శీతల కవిత్వరుచుల్ వెలయించెఁబక్వమై.'

అందుచేత ఈ గ్రంథాన్ని ప్రతివారూ పఠించి కవిరాజు చెప్పిన ఫలితాన్ని పొందండి.

శా. 'సూతప్రోక్త పురాణసంహితను సంశుద్ధాంత రంగంబుతో
ప్రాతస్స్నాయములందు బఠించు నెడలన్ బ్రహ్మాయురారోగ్యముల్
భూతప్రీతియుఁ జిత్తశుద్ధియుఁ దమోలుంటాక వైరాగ్యమున్
నీతిప్రోత వివేచనంబు గలుగున్ నిత్యంబు సత్యంబుగన్.'

* * *

# భగవద్గీత

ప్రతి మతానికీ ఒక పవిత్ర గ్రంథమంటూ ఉన్నది. క్రైస్తవ మతానికి 'బైబిలు', మహమ్మదీయ మతానికి 'ఖొరాను', హిందూ మతానికి 'భగవద్గీత', పవిత్ర గ్రంథాలు. ఈ మూడు గ్రంథాలు ఆయా మతానుయాయులచేత పూజ్యగ్రంథాలుగా పరిగణింప బడుచున్నాయి. ఈ గ్రంథాలు భగవత్ప్రేరణతో రచింపబడినవనీ, ఇందలి విషయాలు సార్వకాలీనమైన సత్యాలనీ, ఈ మతాలకు చెందినవారు ప్రచారంజేస్తూ ఉంటారు. వివేచనా శక్తి కొఱవడిన మానవులు ఈ విషయాన్ని గ్రుడ్డిగా విశ్వసించారు. ఇప్పటికీ కొందరు విశ్వసిస్తున్నారు కూడా. దీనితో సర్వమానవ సమతాధర్మం అడుగంటిపోయింది. అసమానత్వం అగ్రస్థానం వహించింది. ధర్మం లుప్తమైపోయింది. అధర్మం ననలు వేసి ఏపుగా చిగురించసాగింది. సర్వస్వతంత్రుడైన మానవుడు, తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి మతానికి బానిసఅయ్యాడు. అప్పుడే వర్ణ వ్యవస్థ తలెత్తింది. ఒకనాటి మానవునికి మతమొక మత్తు మందులా పనిచేసింది. మత విశ్వాసాలతో మ్రగ్గినంత కాలం మానవునిలో 'హేతువాదం' నశించిపోయింది. వివేచనాత్మకమైన భావనకు స్థానం లేకుండాపోయింది. ఈ మతాలవల్ల మేలుకంటే కీడే అధికంగా జరిగింది. మతం పేరిట అనేక యుద్ధాలు గూడా జరిగినట్లు ప్రపంచ చరిత్ర చాటుతున్నది. ఈ మత యుద్ధాలవల్ల కొన్ని దేశాలు రక్తప్లావితాలయ్యాయి. మన దేశంలో జైనులు, బౌద్ధులు మతావేశానికి బలిచేయబడ్డారు. హిందూ మహమ్మదీయులు తమ తమ మతాలకై

పోరాడి ఎన్నో లక్షలమంది దుర్మరణం జెందారు. గజనీ మహమ్మదు గావించిన సోమనాథ దేవాలయ ముట్టడిలో, అనేకమంది వీరాధి వీరులైన రాజపుత్రులు ప్రాణాలు కోల్పోయారు. మతం పేరుతో మనదేశంలోనే కాకుండా పాశ్చాత్య దేశాలలో కూడా పరస్పర మారణాలు అతి దారుణంగా జరిగాయి. క్రైస్తవ మతానికి మూలస్థానమైన జెరూసలేము అరబ్బుల స్వాధీనంలో వుండటంచేత ఆ పట్టణాన్ని కైవసం జేసుకోడానికి చాలామంది హతులయ్యారు. 1572 సం. లో ఫ్రాన్సుదేశంలో పదివేలమంది ప్రొటస్టెంటు క్రైస్తవుల కుత్తుకలు నిర్దాక్షిణ్యంగా ఊచకోత కోయబడ్డాయి. స్పెయిను దేశంలో క్రైస్తవమతంలో జేరడానికి నిరాకరించిన మూడువందల మంది కరుణారహితంగా కాల్చివేయబడ్డారు. మానవ జీవిత కావ్యంలో ఈ అంధా ధ్యాయం సమాప్తమయింది. తర తరాలుగా అజ్ఞాన తమోవలయాలలో చిక్కుపడిన మానవునికి జ్ఞాన భాస్కర సందర్శనం లభించింది. ఆధునిక శాస్త్రయుగం, అతని మత్తును పోద్రోలి, చైతన్యాన్ని ప్రసాదించింది. చింతనాసక్తుడైన ఈనాటి మానవుడు ప్రతిదాన్నీ పృచ్ఛిస్తున్నాడు. కారణరహితమైన దేన్నీ అతడీనాడు నమ్మడం లేదు. ఈనాటి మానవుడు అతని పూర్వీకుల చేత ఎలా దేవుడు సృష్టించబడ్డాడో, అలాగే మతమూ కల్పించ బడిందనే నగ్నసత్యాన్ని తెలుసుకొన్నాడు. ఈనాటి మానవునికి మత మనేది కేవలం ఒక మూఢ నమ్మకం; ఒక అంధవిశ్వాసం. మత ప్రాబల్యాని కివి రోజులు కానే కావన్నది జగత్సత్యం.

హిందూమతం ప్రధానంగా అధ్యాత్మికమైనది. వేదాలు ఈ మతానికి వెన్నెముకవంటివి. వేదాలు నాలుగు – ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం. ప్రతివేదంలోనూ – మంత్ర, బ్రాహ్మణ, ఉపనిషద్భాగా లున్నాయి. మంత్రభాగంలో ప్రకృతిని గురించిన

వర్ణనలు, బ్రాహ్మణ భాగంలో యజ్ఞయాగాదు లొనరించే విధానం, ఉపనిషద్భాగంలో తత్త్వవిచారణకు సంబంధించిన విషయాలున్నాయి. ఇన్ని ఉన్నప్పటికీ సామాన్యమానవుడు జ్ఞానం సంపాదించడానికి ఈ వేదాలవల్ల ఏ మాత్రం ప్రయోజనంలేదు. అందుచేతనే వ్యాస మహర్షి పురాణాలను సృష్టించాడనీ, అందులో ఉత్కృష్ట గ్రంథం మహా భారతమనీ పండితలోకం భావిస్తున్నది. కాని వ్యాసుడు రచించిన కృతికి మహాభారతమనే పేరు లేనే లేదు. ఆ గ్రంథం 'జయ' మనే పేరుతో పిలిసింది. అందులో గీతోపదేశం కనిపించదు. తరువాత స్వార్థపరులైన అగ్రజాతి తమ కనుకూలమైన విషయాలన్నింటితోపాటు గీతోపదేశం కూడా అందులో విక్షేపించారు. అలా చిలువలు పలువలుగా పెరిగిన గ్రంథం అతిభారమైనదవడంచేత 'మహాభారతము' అని పేరు పొందినది. దానినే 'పంచమవేదం' అన్నారు.

మహాభారతంలోని భీష్మపర్వంలో భగవద్గీత కూర్చబడింది. మానసిక వైకల్యానికి గురియై, మనస్థిమితం చెడిన అర్జునుని సందేహ నివృత్తికోసం శ్రీకృష్ణుడు చెప్పిన వేదాంతమే గీత. ప్రత్యేక గ్రంథంగా 700 శ్లోకాల్లో మన కందించబడింది. ఇందులో హిందూమత సిద్ధాంతాల లోని ఉన్నత భావాలు నొక్కి వక్కాణించబడ్డాయనీ, అనంతమైన వేద శాస్త్రజ్ఞానసారమంతా సంగ్రహించబడిందనీ, ఆధ్యాత్మిక వాదంలో నున్న విశేషమంతా దర్పణంలో వలే స్పష్టంగా ప్రతిబింబిస్తున్నదనీ తత్త్వ వేత్తల అభిప్రాయం. మనిషి పుట్టినట్లుగాని, గిట్టినట్లుగాని గీత గుర్తించదు. ఆత్మకు పుట్టుకా-చావూలేదనీ, మానవుని భౌతికదేహం మాత్రమే నశిస్తుందనీ, మానవుని బుద్ధినీ, మనస్సునూ చక్కగా వికసింప జేస్తుందనీ, అహంభావాన్ని పోగొట్టి, ప్రతిఫలాపేక్షలేని కర్మచేయమంటుందనీ, ఇదే భగవద్గీత లక్ష్యమని హిందూమతోద్ధారకులు ఉపన్యాసాలిస్తూ ఉంటారు.

భగవద్గీతకు అనేకమంది భాష్యాలు వ్రాశారు. శంకర, రామానుజ భాష్యాలేకాంటివేగాక, లోకమాన్య బాలగంగాధర తిలక్, వివేకానందుడు, అరవింద మహర్షి, అనిబిసెంట్, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు మహాత్మాగాంధీ, సర్వేపల్లి రాధాకృష్ణగార్ల గీతా వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. ఇవన్నీ ప్రాచీన సంప్రదాయాను సారంగా రచింపబడినవే. ఈ వ్యాఖ్యాతలలో ఎవరికివారు, వారి వారి సిద్ధాంతానికో, మతానికో అన్వయించి భాష్యం వ్రాశారు. దీనిని బట్టి చూస్తే గీతలో వాడిన భాష ఇంకెన్ని వ్యాఖ్యానాలకైనా దోహదం కలుగ జేస్తుందనవచ్చును. రామానుజుడు విశిష్టాద్వైతపరంగానూ, శంకరుడు అద్వైతపరంగానూ, బాలగంగాధర తిలక్ కర్మయోగపరంగానూ, గాంధీమహాత్ముడు అనాసక్తి యోగపరంగానూ గీతా వ్యాఖ్యానాలు చేశారు. ఇదే విధంగా ఎంతో అనేక మంది వ్యాఖ్యాతలకు గూఢార్థాలు, బహిరర్థాలు, అంతరార్థాలు, అతీంద్రియార్థాలు గోచరించాయి. ఇప్పటికీ గోచరిస్తున్నాయి కూడా. అందుచేతనే ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతాల కన్నింటికీ గీత మూలాధారమయింది.

నిజం ఎప్పుడూ నిష్ఠూరంగానే ఉంటుంది. ఎందరెందరెన్ని భిన్న భిన్న వ్యాఖ్యానాలు చేసినా అవన్నీ వ్యాస భగవద్గీతకు చర్విత చర్వణాలు. కారణం ఈ వ్యాఖ్యానాలలోని 'భావం' అతి ప్రాచీనమైనది కావడమే. అందులో ఎంత మాత్రం మార్పులేదు. వీరంతా 'పాత మందునే కొత్త సీసాలలో, పోసి చూపారు. అందరి భగవద్గీతల్లోని ఇతివృత్తం కురుక్షేత్ర యుద్ధభూమిలో కురుపాండవ సైన్యాలు నిల్చగా, ఉభయ సేనల మధ్యలో నిల్చి, మహాసైన్యాలనూ, అందులోని ఆచార్య బంధుమిత్ర పుత్రాదులనూ వీక్షించి, శోకమోహాలచేత విక్లబుడై,

రణ పరాఙ్ముఖుడైన పార్థుని రణోన్ముఖుని చేయడానికి శ్రీకృష్ణభగవానుడు గీతోపదేశం చేశాడని చెప్పడమే !

అయితే భగవద్గీతకు నూతన వ్యాఖ్యానం సృష్టించిన గౌరవం మన తెలుగువారికే దక్కింది. ఆ నూతన వ్యాఖ్యానమే కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి 'భగవద్గీత'. ఆంధ్రవ్యాసుని అపూర్వ సృష్టి, తెనుగు వారి భావనైశిత్యానికి నిదర్శనం. భావవిప్లవానికి ప్రత్యక్షసాక్ష్యం.

1941 సం. పలనాటి వీర చరిత్రను ఇతివృత్తంగా గైకొని రామ స్వామి గారు 'భగవద్గీత'ను రచించారు. కురుక్షేత్ర యుద్ధభూమిలో శ్రీ కృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేశాడనే ప్రతీతి ఉన్నది గదా ! అదే విధంగా కారెంపూడి కదనరంగంలో బ్రహ్మనాయుడు బాల చంద్రునికి గీతోపదేశం చేశాడని భావించిన రామస్వామిగారు చక్కని వ్యంగ్యవైభవంతో ఈ భగవద్గీతను రచించారు. అయితే కురుక్షేత్ర యుద్ధాన్ని కారెంపూడి కదనంతో పోల్చవలసిన అవసరం ఏమిటి? అనే శంక కలగవచ్చు. అందుచేత పల్నాటివీరచరిత్రను సంక్షిప్తంగా తెలుసుకొందాం.

గుంటూరుసీమ మన రాష్ట్రానికి గుండెకాయలాంటిది. అలాంటి గుంటూరు జిల్లాలో పలనాడు ఉంది. పలనాటి రాజుల మూలపురుషుడు అనుగురాజు. ఇతడు ఉత్తరదేశం నుండి కొన్ని రాజకీయ కారణాల వల్ల దక్షిణాపథానికి వచ్చాడు. ఇతడు కార్తవీర్యార్జునుని వంశానికి చెందిన వాడని ప్రతీతి. వెలనాటి రాజవంశానికి చెందిన మైలమదేవిని వివాహం చేసికొని ఆమెతండ్రి నుండి పల్నాడును అరణంగా పొందాడు. గురజాలను రాజధానిగా చేసికొని అనుగురాజు ప్రజానురంజకంగా

పాలించాడు. ఇతనికి మైలమాదేవి, వీరవిద్యాదేవి, భూరమాదేవి అను ముగ్గురు భార్యలు. మైలమాదేవికి నలగామరాజు, వీరవిద్యాదేవికి పెదమల్లదేవుడు, పినమల్లదేవుడు, బాలమల్లదేవుడు, భూరమాదేవికి కామరాజు, నరసింహ భూపతి, ఘుట్టిరాజు, పెరుమాళ్ళరాజు అను నలుగురు పుత్రులు జన్మించారు. అనుగురాజు మంత్రి దొడ్డనాయడు. అనుగురాజు స్వర్గస్తుడవడంతో అతని కుమారుడు నలగామరాజు పట్టాభిషిక్తుడయ్యాడు. మంత్రి దొడ్డనాయడు మృతిజెంది నందువల్ల అతని కుమారుడు బ్రహ్మనాయడు నలగామరాజువద్ద మంత్రి అయ్యాడు. ఇతని భార్య ఐతాంబ. కుమారుడు బాలచంద్రుడు. నలగామ రాజుకూ అతని సవతి తమ్ముళ్ళైన మలిదేవరాజు సోదరులకూ మధ్య రాజ్యాధికారం కోసం కలహం ప్రారంభమయింది. మలిదేవాదులు, నలగామరాజు అల్లుడైన అలరాజుతో కూడా మాచెర్ల ప్రాంతానికి తరలిపోయారు. మాచెర్లకు రాజు మలిదేవుడైనా పరిపాలనంతా బ్రహ్మనాయడిదే.

బ్రహ్మనాయడు వెళ్ళిపోయిన పిదప నలగామరాజు నాగమ్మ అనే స్త్రీని మంత్రిగా నియమించుకొన్నాడు. ఆమె పల్నాటి యుద్ధానికి బీజాలు నాటింది. నాయకురాలు ఏదో విధంగా బ్రహ్మనాయణ్ణి అష్టకష్టాలపాలు చేయాలని తలపెట్టింది. ఆ ఉద్దేశ్యంతో నాయకురాలు కోడి పందెములు ఏర్పాటుచేయించి, అందులో బ్రహ్మనాయణ్ణ ఓడించింది. బ్రహ్మనాయడు మలిదేవాదులను వెంటబెట్టుకొని, ఒప్పందం ప్రకారం, మాచెర్లను విడిచిపెట్టి అరణ్యాలలో 7 సం.లు కాలం గడిపాడు. గడువు అనంతరం నలగామరాజు అల్లుడైన అలరాజుచేత తమ రాజ్యం తమ కివ్వవలసిందిగా నాయకురాలి వద్దకు రాయబారం పంపాడు. నలగామరాజు, నాయకురాలు రాజ్యాన్ని మరల మలిదేవాదుల కివ్వడానికి నిరాకరించారు. ఈ కారణంచేత ఉభయులకూ వ్యవహారం బెడిసింది. యుద్ధంతప్ప మరో

గత్యంతరం కనుపించలేదు. అనేకమంది వీరాధివీరులు బాలచంద్రునితో కలిసి నలగామరాజు పక్షాన్ని నాశనం చేయాలనే శపథం పూనారు. బాల చంద్రుడు తనమగువ మాంచాలనుండీ, తల్లి ఐతాంబనుండీ విజయాశీస్సులు పొంది యుద్ధభూమి కెళ్ళాడు. సేనాని కన్నమనీడు బాలచంద్రుణ్ణి అనుసరించాడు. తరువాత మాంచాల కూడా రణరంగంలో ప్రవేశించింది. ఇరుపక్షాల వారికి క్రీ. శ. 1176-1182 సం. మధ్యకాలంలో కారంచేడు వద్ద ఘోరమైన యుద్ధం జరిగింది. అనేక మందిని చంపి, కట్టకడకు బాలచంద్రుడు కూడా వీర స్వర్గ మలంకరించాడు. మలిదేవాదులు అతని అనుచరులు, బంధువులు నశించారు. నలగామరాజు తరపున నాగసాని మలిదేవుల పక్షాన బాలచంద్రుడు లేకపోతే పల్నాటి యుద్ధమే జరిగి వుండేది కాదు. ఈ యుద్ధంలో జరిగిన అపార జన నష్టానికి మనస్సు చలించి, విరక్తి జెందిన బ్రహ్మనాయడు, రాజ్యమంతా నలగామరాజుకే వదలివేసి తపస్సు చేసుకోడాని కెళ్ళాడు. పల్నాటి కృష్ణుడైన బ్రహ్మ నాయడు భగవంతుడనీ, గుత్తికొండబిలం నుండీ ఎప్పుడు తిరిగి వస్తాడా అని ఇప్పటికీ పల్నాటి ప్రజలు ఎదురుచూస్తూనే ఉన్నారు.

మహాభారత యుద్ధానికి వలే పల్నాటి యుద్ధానికి కూడా సోదరుల రాజ్యకాంక్షే మూలకారణం. ఇప్పుడు మహాభారత, పల్నాటి యుద్ధాలకు గల పోలికలు స్పష్టంగా తెలుస్తాయి. ఉత్తర దేశంలో దాయభాగానికై అన్నదమ్ముల బిడ్డలు కొట్టుకొని చచ్చినది కురుక్షేత్ర రణరంగం. ఇటు వంటి దాయభాగ మిషచే అన్నదమ్ములు పోరాడి మరణించినది కారెంపూడి కదనరంగం. కురుక్షేత్ర సమర భూమిలో శ్రీకృష్ణ భగవద్గీతోపదేశంజరిగిందని ప్రతీతి. అదే విధంగా కారెంపూడి యుద్ధభూమిలో పలనాటి కృష్ణుడు బ్రహ్మ నాయడు గీతోపదేశం జేశాడని రామస్వామిగారు భావించారు. ఈ భావం

నూతనమయింది. భారత యుద్ధానికీ, పల్నాటి యుద్ధానికి చాలా పోలిక లుండటంచేత భారత వీరులను పల్నాటి వీరులతోనూ, ద్రౌపదిని నాగ సానితోనూ, శ్రీకృష్ణుణ్ణి బ్రహ్మనాయనితోనూ పోల్చారు రామస్వామిగారు.

రామస్వామి గారు ఎంతో నియమ నిష్ఠలతో గీతా రచనను ప్రారంభించారు. గురిజాల రాజ ప్రాసాదంలో ఉన్న నలగామరాజు తన అంతరంగిక సచివుడైన గింజయుని ముఖతః యుద్ధ వార్తలను యథాతథంగా వినాలన్న కుతూహలంతో అతణ్ణి అడిగే ఘట్టం ఈ భగవద్గీతకు ప్రారంభం.

క. 'ధర్మాత్ములు మా వారల
ధర్ములు మలిదేవ భూతధాత్రీశ్వరులున్
ధర్మక్షేత్రంబు, మహా
కర్మక్షేత్రంబునైన కారెంపూడిన్.

క. చతురంగ బలమ్ములతో
ప్రతిపక్షజిగీష రెండు పాఁగులమగలూ
రిత గతిదండు విడిసి యు
ద్ధతులై యేమేమిచేసి రవతలఁజెపుమా!

గీ. తండ్రి గడియించి పెట్టిన, దాయమల్ల
బంచికొనలేక సరిపాలు ప్రథనభూమి
గ్రక్కదల నన్నదమ్ములు కత్తిఁగట్టి
పోర నడచిరేమయిగగుర్పాడుచుమండ ?

గీ. పోయివచ్చినాఁడవుకదే, పొలికలనికి
నే విశేషంబు పుట్టెనేమేమి జరిగె ?
ఉన్నదున్నట్టు చెప్పు మాయుద్ధవార్త
లన్ని వినమంటి మేలుకీశైనగావి?'

ఈ పద్యాలను చదువగానే వ్యాసుని భగవద్గీతలోని మొదటి శ్లోకం 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః। మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥' జ్ఞాపక మొస్తుంది. నలగామరాజు చెప్పినదంతా ఆలకించిన గింజయుడు, తొట్రుపడకుండా, పూసగ్రుచ్చిన రీతిగా ఇలా అన్నాడు :

తే.గీ. 'నేలయీనిన చందమైనిండి యున్న
మన దళంబులఁ బిలకించి మరలమరలఁ
జూచి పరికించి మార్తురవైపుఁ జూచి
నాగుశేటికి దొరసాని నాగసాని'.

ఏమి జరిగిందో వివరంగా చెబుతాడు గింజయుడు. ఉత్కంఠను రేకొలిపే ఈ ఘట్టం భావికావ్య హృదయానికి మార్గదర్శకంగా ఉంది.

ఇక బాలచంద్ర విషాదయోగంలో ఇరుపక్షాల సైన్యాలు (మలిదేవాదులదొకపక్షం, నాయకురాలిది మరో పక్షం) కారెంపూడి యుద్ధభూమిలో మోహరించి ఉండటం బాలచంద్రుడు పరికించాడు. అతని హృదయం విషాదమేఘచ్ఛన్నమయింది. అతని శరీరం నిలువెల్లా కంపించింది. ముచ్చెమటలు పోశాయి. మోకాళ్ళూ, మోచేతులూ చచ్చుబడి పోయాయి. చేతినుండి అనుకోకుండానే ఖలీనం జారి క్రింద పడిపోయింది. జాతిగుర్రం మీదనుండి బాలచంద్రుడు కూడా దిగజారిపోయాడు. గుండె దడదడలాడి మనస్సు చలించిపోయింది. శోకవ్యాకుల హృదయుడైన బాలచంద్రుడు "నన్ను ఘోరకార్యానికి ప్రోత్సహించకు. నేను యుద్ధాన్ని చేయజాలను" అన్నాడు బ్రహ్మనాయనితో.

వెంటనే బ్రహ్మనాయుడు "మలిదేవాదులు విన్ను నమ్మి సమర భూమికి వచ్చారు. శత్రువులైన నలగామరాజు పక్షాన్ని దునుమాడి వారి ఆశ నిరాశ జేయడానికి ఖడ్గం సారించు". అన్నాడు బాలచంద్రుణ్ణి. దానికి బాలచంద్రుడు యిలా ప్రత్యుత్తర మిచ్చాడు :

ఉ. 'కొంచెము తాల్మిలేక రిపు కోటిని జంపుము చంపుమంచు గో
రించుచు నుంటి వెట్లు పొనరించెదఁ బెంచిన తాత తండ్రులన్
బెంచిన చుట్టపక్కములఁ బెంచిన మామల మేనమామలన్
బెంచిన మాట నన్ను మఱపించునె? చంపుట యన్న మాటలే?

ఉ. పిన్నట నాఁట నుండియును బెంచిన వారలఁ ద్రుంచివైవగాఁ
జిన్నతనాన నాడుకొను స్నేహితులం బరిమార్చి పుచ్చఁగా
నన్నలరించు మిత్రులను నాకడ నుండిన ప్రాత నేస్తులన్
జెన్నఁటినై వధింపఁగను జేతులు రావు నిజంబుఁ జెప్పితిన్.

ఉ. కూళికి నై పిసంబు నొక గ్రుక్కెడు గ్రోలెడు వారు వీరినిన్
లాలనఁ జేసి బెట్టుగఁ జలంబును బెంచుచుఁ బోరితంబుకై
త్రోలి ననున్ వధింపు మని తొందఱఁ జేసిన వీరివి గూల్పఁగా
జాలను జెన్నకేశవుని సాక్షిగ నీ పలనాఁడు సాక్షిగా.

చ. స్వజనము ఘోర యుద్ధమున,జావ నరాతుల నెల్లఁ జంపినే
విజయముఁ బొంది యేమను భవింపఁగ నేర్చెద? నాడు కూయితో
గజిబిజియైన యింట్లకడఁ గల్గునె సౌఖ్యము లేశమాత్రమున్?
వృజినము రాదె? యీ పనులు పెద్దలు మెత్తురె చిత్తగింతురే.'

బాలచంద్రుని హృదయ దౌర్బల్యాన్ని జూచి ఆశ్చర్యచకితుడైన బ్రహ్మనాయుడు అతణ్ణి సమరోన్ముఖుణ్ణి చేయడానికై శస్త్రసన్యాసం చేస్తే వల్నాడంతా పరస్వాధీనమైపోతుందన్నాడు. ఆనాడు కురుక్షేత్ర రంగంలో అర్జునుడు అస్త్రసన్యాసం చేసినప్పుడు, శ్రీకృష్ణుడు అతన్ని ఎలా రణానకు ఉన్ముఖుణ్ణి చేశాడో, అదేవిధంగా కారెంపూడి రణరంగంలో, ఖిన్నవిషణ్ణుడైన బాలచంద్రునిలో సమరోత్సాహం ఉద్దీప్తం జేయటానికి బ్రహ్మనాయడు యిలా అన్నాడు.

ఉ. 'ఈ సమరంబు మర్త్యులకనేక విధంబుల మేలు సేయుఁ బే
రాసల భోగలాలసపరాయణులైన నరేంద్ర చంద్రులున్
జేసిన ఘోరపాప ఫలశేషముఁ బొందెదరిందు శస్త్ర స
న్యాసము నీవు చేయఁబలనాఁడికఁ బట్టి పరస్వ మౌనన్?

ఆ. పోతుగడ్డ మీదఁ బుట్టిన పురుషుండు
కత్తిచేతఁ బట్టఁగలుగువాఁడు
ప్రథనభూమిలోనఁ బగరకు వెన్నిచ్చి
పోవువాఁడు లేఁడు నీవు దక్క

ఆ. నాగసాని చురియ నైగ విగ్రహముఁ జూచి
పగర మొగరంబు మొగముఁ జూచి
శత్రు యోధవరుల చాక చక్యముఁ జూచి
బాలచంద్ర! యింత పందవైతి

ఉ. ఈ పగ సర్వ భూమిపుల నీ రణభూమికిఁ దోడి తెచ్చితిన్
గోపాలమున్ స్వకీయ పరకీయ విభేదముఁ జూపకుండఁగా
నీవు నిమిత్త మాత్రముగ విల్లును వీడిపుడే తమంత తా
మే విధిఁ గుప్ప తెప్పలుగ నీఁగి చత్తురొ చూడఁగానగున్?

ఇంతగా బోధించినా బాలచంద్రునిలో రణోత్సాహం కలుగలేదు. అతడు శోకమోహ సంతప్తుడు కావడమే దీనికి కారణమని గ్రహించాడు బ్రహ్మనాయుడు. బాలచంద్రా! ఏమిది! ఈ విధంగా భయపడటం క్షత్రియ వీరుడవగు నీకు తగదు. ప్రాజ్ఞులైనవారు జనన మరణాలను లెక్కచేయరు. పాంచభౌతికమగు ఈ దేహం నశిస్తుందిగాని ఆత్మకు నశింపంటూలేదు. ఆత్మకు నశింపులేదుగాన దేహ నాశనానికి వగవవలసిన పనిలేదు. స్థూల పదార్థమగు దేహ మెన్నటికైనా నశింప వలసిందే కదా! మానవుడు చినిగిన బట్టలను త్యజించి క్రొత్తబట్టలను ధరించునట్లుగా, ఆత్మ పాత శరీరాన్ని విడిచి మరో శరీరంలోకి ప్రవేశిస్తుంది. వికారాలు దేహానికే గాని ఆత్మ కంటవు. కాబట్టి విక్రమస్ఫూర్తితో కదన భూమిలో నున్న శత్రు సైన్యాన్నంతా చీల్చిచెండాడ వలసింది. నీవు యుద్ధంలో మరణించితివా స్వర్గ ద్వారాలు నీకొఱకు తెరువబడుతాయి. జయించితివా రాజ్యభోగాలనుభవిస్తావు'' అంటూ సాంఖ్యోపదేశం చేశాడు.

ఇలా బోధించినా బాలచంద్రుణ్ణి భీతావహం వదలలేదు. ఏవో తీరని సందేహాలతో సతమత మౌతున్నాడని గ్రహించిన బ్రహ్మనాయుడు, అతని రాగద్వేషాలను నిర్మూలించడానికి జ్ఞానయోగం బోధించసాగాడు. ''నాచేత ద్వాపరయుగాంతంలో పార్థునకు ప్రబోధించబడిందీ జ్ఞానయోగం. అప్పుడు నేను వాసుదేవుణ్ణిగా పేరుపొందాను. తరువాత బుద్ధునిగా అవతరించాను. నేడు బ్రహ్మఋషి సత్తమునిని. ద్వాపరయుగం నాల్గవ పాదంలో నరులు పాపాత్ములై చరించారు. అందుచేత భారతదేశం మునుపెన్నడూ ఎరుగని భయంకర యుద్ధాన్ని కల్పించి, ఇరుపక్షాలవారినీ హతమార్చి, ధర్మం వృద్ధిజెందేటట్లుగా చేశాను. కొన్ని వేలేండ్లు ధర్మం

నాలుగు పాదాలా నడిచింది. తదుపరి కృష్ణపక్షంలోని చంద్రునివలె క్షీణింపసాగింది. ఎప్పుడు ధర్మానికి గ్లాని ఉత్పత్తిల్లుతుందో, ఎప్పుడు ధర్మం కష్టపడిపోతుందో, ఆయా సమయాల్లో సాధుసంత్రాణం కొఱకూ, దుష్కృత వినాశం కొఱకూ, ధర్మ సంస్థాపనార్థమూ నేను ఉద్భవిస్తూ ఉంటాను" అన్నాడు బ్రహ్మనాయడు.

అప్పుడు బాలచంద్రుడు "ఓ తండ్రీ! కురుక్షేత్ర యుద్ధ సమయంలో కృష్ణుడు 'నేనే చాతుర్వర్ణ్యమును సృష్టించాను' అన్నాడు గాండీవితో. మరి కృష్ణుని కంటే ముందుగా గౌతమ మహర్షి 'భూమి మీదనున్న వర్ణాలు మూడు మాత్రమే' అన్నాడుకదా? ఈ రెంటికీ సమన్వయం ఎలా కుదురుతుంది? ఈ వర్ణవ్యవస్థ పుట్టుపూర్వోత్తరాలను కూలంకషంగా చర్చించి జ్ఞానోదయం కలుగజేయవలసింది" అన్నాడు బాలచంద్రుడు. అంతట బ్రహ్మనాయడు యిలా అన్నాడు.

ఉ॥ 'వాదములాడకుండ విను వాస్తవమున్ వివిపింతు లేవు
సృష్ట్యాదిఁ గులంబులున్ మనుజులందఱునొక్కటె తారతమ్యమున్
లేదు విశేష ధర్మములు లేవు దరిద్రులు విత్తవంతులన్
భేదము లేదు నేనెకద వీనికి నెల్లను స్రష్టఁబ్రీకా !

తే॥ వర్ణములు నాల్గు తొలుత నేర్పఱచి పిదపఁ
బ్రజ సృజించితి ననుమాట పట్టిమాట
ప్రజల సృష్టిఁజేసి గుణకర్మలచేఁత
వర్ణములను మూఁడింటి నేర్పఱచినాఁడ.

సీ॥ బ్రహ్మవిద్యాసక్తి బహుళభక్తి నెవ్వాఁడు
సతతంబు యత్నముల్ సలుపుచుండు
ఖడ్గవిద్యా పరిష్కారుఁడై యెవ్వాఁడు
జగదుపకారంబు సలుపుచుండు
వాణిజ్య గోపరిపాలన కృషుల నె
వ్వాఁడు తన్మయుండయి పనులుచేయు
అఖిలలోకైక కల్యాణంబు సాధింప
విస్తార సంఘాభివృద్ధి కొఱకు

తే॥ క్రమముగా వారు బ్రాహ్మణ, క్షత్రియులును
వైశ్యులని చెప్పి వివరించి, బాలచంద్ర
నిర్ణయించితి శ్రద్ధతో నీవెఱుంగు
మాది యందుఁ బ్రజా సృష్టియైన పిదప.

తే॥ మూఁడు వర్ణముల్ సృష్టించినాఁడ నీ చ
తుర్థ వర్ణమ్ము మానవుల్ ద్రోహచింత
సృష్టిఁ జేసిరి స్వార్థమపేక్షఁ జేసి
తారతమ్యంబుఁ గల్పించి తల్లడిల్ల.

తే॥ ఇంతజేసియు వీరంత తృప్తిపడక
నాల్గు వర్ణమ్ములైదు వర్ణములఁ జేసి
పంచమను పేరఁ జెప్పిరి వంచకులయి
నీతిశాస్త్రముల్ వ్రాసిన నిపుణమతులు.'

ఆర్యులు మనదేశానికి రావడం, వారికీ అంతకుముందు మన దేశంలోవున్న ద్రావిడులకూ అనేకవేల సంవత్సరాలు యుద్ధాలు జరగడం

మోసబుద్ధిగల ఆర్యులుకడకు జయించడం, దేశాన్ని ఆక్రమించుకోవడం, ఓడిపోయిన ద్రావిడులను బానిసలుగా చేసుకోవడం, వారికొఱకు నూతన వర్ణం (శూద్రజాతి) సృష్టించడం జరిగింది. ఈ పరిణామవాదాన్ని అర్థంచేసుకోకుండా కొందరు వృత్తుల్నిబట్టి వర్ణభేదా లేర్పడ్డాయంటారు. అదికూడా వాస్తవం కాదు. నిజంగా వృత్తులనుబట్టి వర్ణాలేర్పడితే ఈ ప్రపంచంలో ఎన్ని వృత్తులున్నాయో అన్ని వర్ణాలుండాలి గదా! మరి అలాలేవు. కాబట్టి శూద్రవర్ణాన్ని స్వార్థబుద్ధితో ఆర్యులు ఏర్పరచారనేది విస్పష్టం. ఇది తెలియని వానికి మోక్షం లేదంటూ బ్రహ్మనాయుడు యిలా అన్నాడు :

ఉ. ఈ పరిణామ వాదమును నెవ్వఁడు నమ్మక మూఢబుద్ధి నా
మూఁపుననుండి యొక్కరుఁడు మోముననుండి యొకండు తక్కువా
రాపయి నాదు గజ్జలను హజ్జలఁ బుట్టిరి యంచుఁ జెప్పునా
పాపికి ముక్తి చేపడదు బాలుఁడ! జన్మము లెన్ని యెత్తినన్.

తే॥ శాస్త్రముల నెల్లఁ జదివి విజ్ఞాన మెఱిఁగి
సంశయింపక సర్వధా చర్చఁ జేసి
నిజ మెఱుంగ వలయు నిది నేర్వకున్న
మూఢ విశ్వాసముసఁ జేటు మూఁడుచుండు

తే॥ కాన నజ్ఞాన సంభవ మైన సంది
యముల భేదించి వైచి జ్ఞానమున నీవు
కర్మములఁ జేయ సమకట్టి నిర్మతను
లెమ్ము యుద్ధమ్ముఁ జేయ ధైర్యమ్ముతోడ'.

ఆ తరువాత బ్రహ్మనాయడు, శ్రీకృష్ణునివలే, కర్మ, విభూతి యోగాలను కూడా బాలచంద్రునికి బోధించాడు.

వ్యాస భగవద్గీతలోని విభూతి (మహిమ) యోగంలో శ్రీకృష్ణ పరమాత్మ "సమస్త భూత హృదయాలలో ఉన్న ఆత్మను నేనే. భూతాల ఆది మధ్యాంతం కూడా నేనే. సూర్యులలో విష్ణువును నేనే. ప్రకాశవంతులలో సూర్యుణ్ణి నేనే. సప్తవాయువులలో మరీచిని నేనే. నక్షత్రాలలో చంద్రుణ్ణి నేనే. వేదాలలో సామవేదాన్ని నేనే. దేవతలలో దేవేంద్రుణ్ని నేనే. ఇంద్రియాలలో మనస్సును నేనే. ప్రాణులలో చైతన్యాన్ని నేనే. యజ్ఞాలలో జపయజ్ఞాన్ని నేనే. పర్వతాలలో హిమాలయాన్ని నేనే. వృక్షాలలో శ్రేష్ఠమైన అశ్వత్థ వృక్షాన్ని నేనే. దేవర్షులలో నారదుణ్ణ నేనే. ఏనుగులలో ఐరావతమును నేనే. ఆయుధాలలో వజ్రాయుధాన్ని నేనే. ఆవులలో కామధేనువును నేనే. మృగాలలో సింహాన్ని నేనే. పక్షులలో గరుత్మంతుణ్ని నేనే. అక్షరాలలో అకారాన్ని నేనే. సమాసాలలో ద్వంద్వ సమాసాన్ని నేనే. జ్ఞానవంతులలో జ్ఞానం నేనే. సర్వభూతాలకూ బీజం నేనే. నా దివ్యవిభూతుల కంతం లేదు. ఇది నా సంక్షిప్త విభూతుల వివరణ" అన్నారు. ఈభావం స్వార్థపరుల చేతులలో పడి మలినమై పోయింది. ఎవ్వరికివారు 'అహం బ్రహ్మాస్మి' (నేనే పరమ బ్రహ్మను) అనుకొనే దుర్భర పరిస్థితికి దారితీసింది. ప్రజలకు ఈ భావంమీద నున్న మోజును కడిగి వేయక తప్పలేదు చౌదరిగారికి. అందుకు పూనుకొని ఎంత హృద్యంగా అవహేళన చేశారో చూడండి. చౌదరిగారి భగవద్గీతలో పల్నాటి కృష్ణుడైన బ్రహ్మనాయడు, పల్నాటి పార్థుడైన బాలచంద్రునితో యిలా అన్నాడు :

క. "మేకముల 'హిహొ పొటమసు'ను
సుకములలోఁ బల్లె నాఁటి యుకమును రాలన్

చెకుముకి రాయిని నేనే
శకటములందెల్ల ధూమ శకటము నేనే.

క. మూనలలో వరి మూనను
వానరుల 'ఉరాంగు టాంగు' వానర మేనే
మీనులలో జెల మీనును
సానుల నాగ్వెల్లి నాగసానివి నేనే.

క. మ్రాఁకుల చిటారు కొమ్మల
యాకుల మెడ సాచి మెసవు నట్టి 'గిరాఫీ'
నేకుల ఖాదీ యేకును
గాకుల యందెల్ల బొంతకాకిని నేనే.

క. కారులలో నన కారును
నేరులలో నెల్ల నాగులేరును నేనే.
చేరెఁడు నీళ్ళు దొరకని యె
డారులలోన 'సహారా' యెడారిని నేనే.

క. కంకులలో వరి కంకిని
రంకులలో నెల్లఁబొడల రంకును నేనే
యంకెలలోఁ బద మూఁడును
వంకలలోఁ జంద్రవంక వంకను నేనే.

క. వెలుగుల రక్కొస వెలుగును
బులుఁగులలో రామబందు పులుఁగును నేనే
కలుఁగులను బట్ట కలుఁగును
తెలుఁగులలో నెల్ల మాల తెలుఁగును నేనే.

క. ఆసలలో నడి యాసను
బాసలలో నెల్లఁ గొలికి పూసను నేనే
రాసులలో నక్షత్రాశివి
బాసలలో నెల్లఁ దెల్గు బాసను నేనే.

క. పద్యములఁ గంద పద్యము
విద్యల యందెల్ల జోర విద్యను నేనే
వాద్యములఁ బటహ వాద్యము
ఖాద్యము లందెల్ల మాష ఖాద్యము నేనే.

క. నదముల 'కాంగో' నదమును
బదముల యందెల్ల నేల పదమును నేనే
కొదమల సింగపుఁ గొదమను
రథములలో యజ్ఞ ఘోణి రథమును నేనే.

క. కలములను గాలి కలమును
హలములలోఁ ద్రాగుఁ బోతు హలమును నేనే
ఫలములను జాత ఫలమును
బిలములలో గుత్తికొండ బిలమును నేనే.'

ఈ విధమైన తన అనంతమైన విభూతులను వివరించి కట్టకడకు బ్రహ్మనాయడు యిలా అన్నాడు :

ఆ. 'నా విభూతి చయ మనంతమైనను సంగ్ర
హించి చెప్పినాఁడ నేను నీయ
భీప్సితంబుఁ దీర్ప నింతకు వివరించి
చెప్పఁగాదు సమర సీమ యందు.'

వ్యంగ్యవైభవంతోనూ, సత్యసౌరభంతోనూ సాగి పోతుంది చౌదరి గారి లేఖిని. కృష్ణ భగవద్గీతలోని విభూతి యోగం పట్ల భక్తిశ్రద్ధలు చూపించేవారు కూడా బ్రహ్మనాయని ఈ గీతోపదేశంలోని వ్యంగ్యోక్తికీ, చతురతకూ వివాళులు ఎత్తి తీరుతారు. రామస్వామి చౌదరిగారి రచనా వైదుష్యం అట్టిది. సరళంగా, సున్నితంగా విషయాలను అవగాహనకు వదలడమూ, ఆలోచనలను రేకెత్తించి, పఠితల జిజ్ఞాసను పెంపొందించ టమూ, వారిని వివేక మార్గానుయాయులనుగా చేయడమూ చౌదరిగారి ప్రత్యేకత.

విశ్వరూప సందర్శన యోగంలో అర్జునునకు శ్రీ కృష్ణుని విశ్వ రూప సందర్శనం భయ సంభ్రమాలను కలుగజేసింది. తుదకు సౌమ్యరూప సందర్శనం అతనికి మనశ్శాంతి కలిగించింది. అదేవిధంగా బ్రహ్మ నాయని విశ్వరూపాన్ని జూచి భయకంపితుడై సాష్టాంగ ప్రణామ మాచ రించిన బాలచంద్రుడిలా అన్నాడు :

తే. 'దేవ ! నీ శరీరమం దందు దేవతలును
సిద్ధ చారణ గుహ్యక శ్రేణి, సాధ్య
గరుడ గంధర్వ యక్ష కిన్నరులు కూడి
బలసి యున్నట్టు పొడకట్టు బ్రహ్మనీడ.

తే. యవన పహ్లవ బర్బర ద్రవిడ శక య
వబ్బి మంగోలు మాగియ ర్లాప్స హూణ
నీగ్రో చీన షింటో హీబ్రు నిఖిల జాతు
లన్ని నీ యందె కుల కుల లాడుచుండె.

క. ఎటు చూచిన కన్గవలే
ఎటు చూచిన ముక్కు మొగములే పరమాత్మా !
యెటు చూచినఁ గాళ్ళేతులె
యెటు చూచిన దిక్కులేదు వృజినధ్వంసా!

తే. అతి భయంకరమైన మీ యాయుధములు
నతి భయంకరమైన మీ యాకృతియును
గాంచి నంతటనే స్వేద కణము లలమ
నల్ల కల్లోల మయ్యె నా యుల్ల మెల్ల''

"మీ రూపాన్ని జూచి నా మనసు బెంబేలు పడుతూ ఉంది.
మీ నిజ రూపాన్ని చూపండి'' అన్నాడు బాలచంద్రుడు.

తే. 'ఒక్క గద యొక్క శంఖమ్ము నొక్క చక్ర
మొక్క ఖడ్గంబు ధరియించు చుండు నాల్గు
చేతులు గల మూర్తిని ప్రదర్శింపు మయ్య
వేల కొలఁది చేతులు చూచి బేలు వోతి.'

అప్పుడు బ్రహ్మనాయుడు యిలా అన్నాడు :

ఉ. 'ఎందఱు నా స్వరూపము నిరీక్షణ సేయఁగఁ గోరి తొల్లి రా
త్రిం దివముల్ తపంబు నొనరించిరి యెండకు వానకోర్చి? వా
అందఱిలో నొకా నొకరుఁడైనఁ గనుం గొనఁ జాలినాఁడె! నీ
యందలి ప్రేమ భావమున నద్భుత దర్శన మిప్పు డిచ్చితిన్.'

ఆంధ్ర నాట వెలసిన అవ్యవస్థిత స్థితిని నిర్మూలించాలనీ, వర్ణ
వ్యవస్థను సమూలంగా నాశనం చేయాలనీ చౌదరిగారి ఉద్దేశ్యం. మానవు

లందరూ ఒక్కటే! జన్మను బట్టి ఆధిక్యానాధిక్యాలను నిర్ణయించడం అధర్మం. కాని స్వార్థపరులూ, ద్రోహచింతనులూ అయినవారు తమ తమ సుఖ సంతోషాల కోసం, కొన్ని జాతుల వారిని శాశ్వతంగా అణచిపెట్టి ఉంచడానికి ప్రయత్నించారు. ఈ ద్రోహవ్యవస్థ ఎక్కువకాలం నిలువ దనీ, సత్యం ఏనాటికైనా వెలికిరాక తప్పదనీ వారికి తెలుసు. ఆ శుభ సమయం కోసం తనేకాదు- తన జాతి యావత్తూ పోరాడాలనీ, అందరూ సుఖ శాంతులతో జీవించాలనీ రామస్వామిగారు ఎంతగానో ఆరాట పడ్డారు. అందుకోసం అప్పుడమలులో నున్న భావాలనూ, ఆచారాలనూ, వ్యవస్థలనూ భస్మీపటలం జేసి సర్వమానవ సమతాధర్మం గల ఒక నూతన ప్రపంచం నిర్మించాలని రామస్వామి గారు కలలు కన్నారు. ఈ ఉద్దేశాలనే విశ్వరూపసందర్భంలో బ్రహ్మనాయని నోట యిలా వెల్లడించారు.

తే. 'బ్రాహ్మణాది చండాల పర్యంత మైన
యన్ని జాతుల వారల నాస పెట్టి
యిటకుఁ దోడ్తెచ్చితిని వధియింప నెంచి
తెలుఁగు జాతి పున స్సృష్టి కలన కొఱకు.

తే. ఆత్మ విశ్వాస మడు గంటె నంతరించెఁ
బిక్క ధీ బల దోర్బల ప్రౌఢి యెల్ల
బ్రతికి యుండెను జీవచ్ఛవంబు రీతిఁ
దెలుఁగు జాతి పున స్సృష్టి వలదె చెపుమ!

తే. కర్మ శూరులు కాకాత్త గంధు లగుచు
నౌర ! యాచార యవని కాభ్యంతరమున

మెలఁపుతో దాఁగు చున్నారు మ్లేచ్ఛ బుద్ధిఁ
దెలుఁగు జాతి పున స్సృష్టి వలదె చెపుమ!

తే. ఒక్క జాతియఁ దుద్భవ మొంది కూడ
స్పర్శ దోషంబు దృష్టి దోషం బటంచుఁ
బతితమై పోవు చుండెఁ బ్రభ్రష్ట మగుచుఁ
దెలుఁగు జాతి పున స్సృష్టి వలదె చెపుమ!.'

బాలచంద్ర విషాదయోగం, సాంఖ్యయోగం, జ్ఞానయోగం, కర్మ యోగం, విభూతియోగం, విశ్వరూప సందర్శనయోగం, అను ఆరు యోగాలలోనూ, పద్దెనిమిది అధ్యాయాల 'కృష్ణ భగవద్గీత'ను పరిహసిస్తూ రామస్వామిగారు అపూర్వమైన 'బ్రహ్మ భగవద్గీత'ను ఆంధ్ర ప్రజలకు అందించారు. పాత భగవద్గీతలో ప్రతిపాదించిన సిద్ధాంతాలను తుత్తునియలు చేశారు.
* "రామస్వామి చౌదరిగారి భగవద్గీత' ప్రచురణతో గీతాహృదయం బ్రద్దలయింది. భగవంతుడు హాస్యాస్పదుడయ్యాడు. వ్యంగ్య రచన సంఘ సంస్కరణకు ఎంత చక్కగా ఉపయోగిస్తుందో ఈ గ్రంథం ద్వారా నిరూపించారు చౌదరిగారు. ఆంధ్ర సాహిత్యంలో ఇప్పుడుకాని, పూర్వం కాని, పద్యంలోగాని, వచనంలోగాని ఎవ్వరూచెయ్యని, చేయబోని పనిని వీరు భగవద్గీతలో చేశారు. ఆంధ్ర కవిత్వం ఎన్నడూ ఎరుగని చక్కని 'సెటైర్', చక్కని హాస్యం వీరివల్ల తెలుఁగు వారికి లభించాయి'" అన్నారు డాక్టర్ జి. వి. కృష్ణరావుగారు.

* కావ్యజగత్తు – డాక్టర్ జి.వి. కృష్ణరావు

రామస్వామిచౌదరిగారి భగవద్గీతను చదివిన జలసూత్రం రుక్మిణీనాధ శాస్త్రిగారు * "గీతను అలా సెటైర్ చెయ్యడం, పల్నాటి చరిత్రను జోడించి తెనుగుదనం తేవడం, ఆ రెంటి సామ్యాలనూ హత్తించడం, ఆ పద్యాలు, ఆ భాష అవన్నీ అపూర్వాలు. పీఠిక చదువుతున్నంత సేపూ ఆశ్చర్యమేగదా, ఆ విషయ వివరణానికి, ఆ పద ప్రయోగాలకూ విషయం విషయం నేను నేర్చుకోవడమే మరి. విభూతియోగాన్ని పేలవంగా కాకుండా అంత రసజ్ఞంగా సెటైర్ చేసినందుకు మాత్రమే కాదు సంతోషించింది. కవిరాజుగారు కాక ఇంకోరైతే - 18 అధ్యాయాలూ చెప్పి, చాట భారతం అనిపించి - విషయాన్ని పేలవంచేసి, పుస్తకాన్ని నీరసం చేసేవారు. ఈయన అసలు భగవద్గీతలో ఉన్నది అంతా విడిచి, నలుగురూ వినదానికి, కావిదానికి, ఉప్పూ పత్రిదా కాకుండా కోట్ చేస్తుంటారే వాటికి-ఈయన అసలు భగవద్గీతలో ఉన్న పురాతన విషయాలు నమ్మకాలుగా మారి, గలభా చేస్తున్నప్పుడు రామస్వామిచౌదరిగారు ఎదిరించా రనటంలోనే ఉంది ఆయన ప్రతిభా-పట్టుదలా నలుగురికీ కలిసి వద్దామనే గుణమూనూ, లేకుంటే మల్లెపూలమీదా, కోయిలమీదా, వడగాలిమీదా, ఇంద్రధనస్సుమీదా పద్యాలు రాయలేకనా_ఈ బాధంతా ఆయన పడ్డది. అనేక విషయాలను శ్రద్ధతో తఱచి, చఱచి, ఆచి,తూచి, నిజాన్ని నిర్భయంగా బయటపెట్టినవారు మనలో చాలా తక్కువ. త్రిపురనేని రామస్వామిచౌదరిగారూ, పెంద్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ నాకు వీళ్ళిద్దరి విషయంలో చాల గౌరవం. వారి వాదాలలోనూ, అభిప్రాయాలలోనూ మనస్సుకు నొప్పికలిగే అంశాలు కొన్ని ఉండవచ్చు. కాని సెంటిమెంటును చంపి, నిజం ఆలోచిస్తే - వారి భావాలు ఎంత సమంజసాలో మనకు బోధపడుతుంది" అన్నారు.

---

* కవిరాజు సన్మాన సంచిక

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని నే నొకసారి కలుసుకోవడం జరిగింది. ఆ సందర్భంలో శాస్త్రిగారు కుశలప్రశ్నల అనంతరం నాతో పారిహాసిక సాహిత్యాన్ని గురించి మాట్లాడుతూ "ఆంధ్ర సాహిత్యంలో వ్యంగ్యోక్తిని అత్యంత ప్రతిభావంతంగా వాడుకొన్న మహాకవి రామస్వామిచౌదరి. వారి భగవద్గీత ఏ విషయంలోనూ సంస్కృత గీతను తీసిపోదు. పూర్వ జన్మంపట్ల అచంచల విశ్వాసం గల నాకు అలనాటి వ్యాసుడే ఈ అవతారము నెత్తినాడా యనిపించినది. భగవద్గీత వంటి మహోత్తమ గ్రంథాలద్వారా, నిస్తేజమయిన జాతిలో చైతన్యం కలిగించి, ముందడుగు వేయించిన చౌదరిగారికి ఆంధ్రజాతి తరతరాలుగా ఋణపడి ఉండగలదు. ఇది నా ప్రగాఢ విశ్వాసము; దృఢసమ్మకము" అన్నారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు "నాచనసోముని కవిత్వమువలె గీతలోని పద్యములు తరిమెన బెట్టినట్లు తీరి అందచందములు గలిగియున్నవి" అన్నారు.

ఆంధ్రులు అనేక విషయాలలో అదృష్టవంతులు. ముఖ్యంగా ఆంధ్రభూమి సంస్కర్తలకు పుట్టినిల్లు. మహామనీషి, బహుభాషావేత్త, సత్యవాది, మధురకవి, సమతా సిద్ధాంత వేత్తలయిన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఇలాంటి అపూర్వమయిన 'భగవద్గీత'ను సృష్టించి, ఆంధ్రుల ప్రతిభను మారుమ్రోగునట్లు చేయుడం తెలుగువారి కందరికీ గర్వకారణం.

---

# రూపకముల పరిశీలన

కావ్యాలు శ్రవ్య కావ్యాలనీ, దృశ్యకావ్యాలనీ రెండు విధాలు. ఈ రెండు రకాల కావ్యాలలోనూ పాత్రపోషణ, వర్ణన, రసము మొదలైనవి సమానమయినప్పటికీ, వాటిని అభివ్యక్తం చేయడంలో కొంత భేదముంటుంది. ఈ భేదం ప్రత్యేకంగా రచనాసంవిధానానికి సంబంధించినది. శ్రవ్య కావ్యాలలోని 'వస్తువు' కేవలమూ పాత్రల ముఖతః మాత్రమే కాకుండా, కవి ముఖతః కూడా వెలువరింపబడుతూ ఉంటుంది. అంటే- తాను చెప్పదలచుకొన్న విషయానికి వాహకాలుగా మాత్రమే పాత్రలు ఉంటాయన్న మాట. ఐతే, ఈ పాత్రలు కవి చేతిలోని కీలుబొమ్మలు మాత్రం కావు. కారాదు కూడాను. వాటి వ్యక్తిత్వం వాటికి విధిగా ఉంటుంది. పాత్రలద్వారా చెప్పడానికి సాధ్యపడనప్పుడు మాత్రమే కవి తాను ప్రవేశిస్తాడు. ఇక దృశ్య కావ్యాలలోని పాత్రల రూపాలను నటులు ధరించి, సంభాషణ రూపంలోనూ, అభినయాదుల చేతనూ ప్రదర్శింపగా సామాజికులు చూచి ఆనందిస్తారు. ఇవే నాటకాలు. వీటినే రూపకములని అంటున్నారు. కథలోని పాత్రల రూపము, నటుల యందారోపింప బడుతుంది కాబట్టి, వీటికి రూపకము లనే పేరు గలిగింది. వీటి ప్రయోజనం 'సద్యః పరనిర్వృతి, సాంఘికోద్ధరణం'. మన పూర్వులు 'నాటకాంతం హి సాహిత్యం' అనీ, 'కావ్యేషు నాటకం రమ్యం' అనీ అన్నారు. దృశ్యకావ్యాలలో ఉన్న మరొక సుగుణం-

ఇది ప్రజానీకానికి అత్యంత సన్నిహితం కావడం. ఒక గ్రంథం చదివి ఆనందించలేని వ్యక్తి, ఒక నాటకాన్ని చూచి ఆనందించ వచ్చు. విషయం పాత్రలద్వారా, సంభాషణ రూపంలో అభివ్యక్తీకరింప బడటంవల్ల, నిరక్షరాస్యులు కూడా నాటకంచూసి, విషయాన్ని గ్రహించ డానికి అవకాశం ఏర్పడుతుంది. అంటే_ఒక నీతినో, ధర్మాన్నో, సందేశాన్నో, నూతన భావాన్నో, సంస్కరణనో, లక్షలాది ప్రజలవద్దకు తీసుకెళ్ళడానికి, నాటకం అత్యంతోపయుక్తమైన, అత్యుత్తమైన సాధనమన్నమాట !

ఈ విషయంతెలిసిన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, నాటకాన్ని తమ అభిప్రాయాల ప్రచారానికి సాధనం చేసుకొన్నారు. సాధారణంగా ప్రచార నాటకాలలో, నాటకీయత లుప్తమయి, ప్రచారం కొట్టవచ్చినట్లుగా కానరావడం కద్దు. నినాదాల పుట్టలుగా ఇవి మారడమూ మనకు తెలుసు. కాని కవిరాజులోని ప్రత్యేకత అక్కడే ఉన్నది. సాహిత్యపరంగా అత్యున్నత శ్రేణికి చెందినవారి నాటకాలు నిర్దేశించిన సాంఘిక ప్రయోజనాలను సాధించడమే కాకుండా, ప్రజాదరణను కూడా పొందాయి.

'కురుక్షేత్ర సంగ్రామము' – 'శంబుక వధ'_'ఖూనీ' కవిరాజు గారి ముద్రిత నాటకాలు, 'పలనాటి పౌరుషం' – 'రాణా ప్రతాప్' – 'నరకం' ,అంపకం, అనే నాటకాలు అముద్రితాలు.

ముందుగా అముద్రిత రూపకాలను గురించి కొంచెం తెలుసు కొందాం. మొట్టమొనటి రూపకం 'పలనాటి పౌరుషం.' పలనాటియుద్ధం ఇతివృత్తంగా గైకొని ఇది రచించబడింది. ముఖ్యమైన పట్టణాలలోనే

గాక అంగలూరు, చేబ్రోలు మొదలైన గ్రామాలలో పైగామూ ఈ నాటకం ప్రదర్శింపబడింది. దీని వ్రాతప్రతి చాలా కాలం వరకూ చౌదరిగారింట్లో వుండి, వెలుగు జూడకుండానే శిథిలమై పోవడం ఆంధ్రుల దురదృష్టమనే చెప్పాలి.

స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా జరుగుతున్న రోజుల్లో రామస్వామిగారు 'రాణా ప్రతాప్' రచించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగానూ, స్వాతంత్ర్య ఉద్యమానికి అనుకూలంగానూ వ్రాయబడిన నాటకం యిది. బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన సందర్భాన్ని పురస్కరించుకొని అనేకచోట్ల ఇది ప్రదర్శింపబడింది. ఈ నాటకం ప్రజానీకంలో దేశభక్తిని, స్వాతంత్ర్యానురక్తినీ, వీరావేశాన్నీ కలిగించింది. వీరరసం ప్రధానంగా గలిగి ఆంధ్రజాతిని ఉత్తేజితులుగాగిస్తున్న ఈ నాటకం ప్రదర్శనలతో బ్రిటిషుప్రభుత్వం భీతిచెంది ఈ నాటకాన్ని నిషేధించింది. కొంతకాలానికి దీని వ్రాతప్రతికూడా తగులబెట్టబడింది. మూడవ అముద్రిత నాటకమైన 'నరకం' వ్రాతప్రతి గానే వుండిపోయింది. ఆఖరి అముద్రిత గ్రంథం 'అంపకం' కూడా అదృశ్యమయింది. చౌదరి గారి ఇతర గ్రంథాలవలే 'నాటకాలు' కూడా ఆంధ్రదేశంలో పెద్దగాలి దుమారాన్ని లేపాయి. ఈ పెనుగాలికి తట్టుకోని ఒక పెద్దమనిషి 'సాహిత్యరంగం కురుక్షేత్రరంగంగా మారిపోయింది' అని ఆశ్చర్యపోయాడు. ఇప్పుడు వారి ముద్రిత నాటకాలను ఒక్కొక్కదాని గురించి సంక్షిప్తంగా తెలుసుకొందాం.

## కురుక్షేత్ర సంగ్రామము

లోకమంతటా అప్పటివరకూ కౌరవులు దుర్మార్గులనీ, అవినీతి పరులనీ, పాండవులే సన్మార్గవర్తులనీ, పూజ్యులనే భావం ప్రచలితమై

ఉంది. ఇది యధార్థం గాదని గాఢంగా విశ్వసించారు చౌదరిగారు. అంధ విశ్వాసాలతో నిండి నిబిడీకృతమయిన సమాజంలో చైతన్యం కలిగించడానికి గాను ఈ 'కురుక్షేత్ర సంగ్రామము' రచించబడింది. తొలి ముద్రణ 1910 సం.లో జరిగింది. ఆంధ్ర విద్యాధికుల గాఢాభిమానంచేత అచిరకాలం లోనే ద్వితీయ, తృతీయ ముద్రణలను పొందింది. దీనిలోని ఇతి వృత్తం మహా భారత యుద్ధానికి సంబంధించినది.అందువేత ఇది వీరరస ప్రధానమైన నాటకం. మరొకరైతే దీనికి 'పాండవ విజయము' అని పేరు పెట్టి ఉండేవారు. కాని కవిరాజు ఆ విధంగా చేయలేదు. అందులకు కారణం పాండవులకు లభించిన విజయం ధర్మమార్గసంగతం కాదని చౌదరి గారు అభిప్రాయపడటమే ! ఎందుకలా అభిప్రాయపడవలసివచ్చిందో ఈ నాటక ఉపోద్ఘాతములో అడవి సాంబశివ కవి గారు యిలా విశదీకరించారు.

"హస్తినాపుర రాజ్య సింహాసనము చక్రవర్తు లారోహించుటచే మొదటినుండియు గౌరవము నందియుండినది. దీని నధిరోహించిన పూరుభరతాదులగు శంతనువఱకుఁ గల రాజు లందఱు జ్యేష్ఠానుక్రమము గనే రాజ్యభారము వహించుచుండిరి. ప్రదీపునకు శంతనుఁడు, బాహ్లికుఁడు ననువారు పుత్రులు. అందగ్రజుఁడగు శంతనుఁడు రాజయ్యె. అవరజుండగు బాహ్లికుఁడు రాజభరణము నందుచు రాజ్యహీనుఁడై యుండి భారత రణంబున మడిసె. శంతనునకు నగ్రసుతుఁడు భీష్ముఁడు. ఇతఁడు పితృర్థము నస్వస్త రాజ్యుండయ్యెను. సత్యవతీ ప్రథమ పుత్రుఁడగు చిత్రాంగదుఁ డనపత్యుండై గతించుటచే, విచిత్రవీర్యుండనువాని యవరజుఁడు సింహాస నాసీనుడై యనపత్యుడై దివికరుగఁ దక్షేత్రమున వ్యాసునిచే దేవర న్యాయంబున ధృతరాష్ట్ర పాండురాజులు గలిగింపఁబడిరి. ధృతరాష్ట్రుండు జాత్యం

ధుఁడు గావున రాజ్యార్హుఁడు కాఁడయ్యె. తదనుజుఁడగు పాండురాజును పాండురోగపీడితుఁడగుటచే రాజ్యార్హుఁడు కాఁడందురు. పాండురాజు నిజ పరాక్రమముచే నెల్ల దిక్కులు జయించి రాజ్యాసనంబున నంధుండగు తన యన్న నునిచి తానే రాజ్యము చేసెను. ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులు సుతులు. పాండురాజు కొమరులు ధర్మరాజాదులు. ఈ యిరు తెగల వారికి రాజ్యసింహాసన విషయమై పోరాటము సంభవించినది. పాండు పుత్రులకు ధృతరాష్ట్రుఁడు పితృభాగమని రాజ్యమున సగము పంచి యిచ్చి నట్లును. పాండవులు మరల నిట్టి యర్ధరాజ్యమునే కోరి సుయోధన నిరాకృతులై యుద్ధము చేసిరనియు నాంధ్రభారతమందలి కథవలనఁ దెలియుచున్నది. రాజ్యసర్హత ధృతరాష్ట్ర పాండురాజుల కిరువురకుఁ బ్రాప్తించి యుండఁగా నెటులైన ధృతరాష్ట్రుండు సింహాసనాసీనుఁడయ్యెఁ గదా! అప్పుడు జ్యేష్ఠానుక్రమముగల రాజపీఠమునకు సుయోధనుఁడే హక్కుదారుఁడై యుండును. పాండవాగ్రజుఁడట్టి రాజ్యమునుగాని యదియవిభాజ్యమౌటచే నందలి భాగమును గాని కోరుట కర్హుఁడు కాఁడు. ఇది ధర్మశాస్త్రానుగుణమైన పద్ధతి.

“ఆంధ్ర భారతమునందీ సందియ మెచ్చటను బహిష్కరింపఁబడలేదు. ఇదిగాక ధృతరాష్ట్ర పాండురాజు లిరువురు రాజ్యార్హులు గామిచే నరాజకమగు రాజ్యమును భీష్ముఁడు ధృతరాష్ట్రుని నామమాత్ర రాజుం గావించి తానే రక్షించుచుండుటచే వారి సంతానమగు యుధిష్ఠిర దుర్యోధనులలో నెవ్వరు పెద్దవారో వారు రాజ్యపీఠము నధిరోహించుట కర్హులందురేని సర్వజ్యేష్ఠుఁడగు ధర్మరాజే రాజ్యమునకు నుత్తరాధికారియగుఁగదా. అట్లగుటచేతనే ధృతరాష్ట్రుఁడు తన సుతుఁడగు దుర్యోధనుఁడుండఁగా

ధర్మరాజునకే యువరాజ్య పట్టాభిషేకము జేసెను. యువరాజ్య పట్టాభిషిక్తుఁడెవఁడో వాఁడే రాజ్యమునకు నుత్తరాధికారి యనుట లోకప్రసిద్ధమగు నాచారమేగదా. ఇట్లుండఁగా ధృతరాష్ట్రుఁడు యువరాజ్య పట్టాభిషిక్తుఁడగు ధర్మరాజునకు నర్ధరాజ్యంబిచ్చి ఇంద్రప్రస్థనగరమున కనుపుటకుఁ గారణమేమి? భీష్మాది కురువృద్ధు లీ రాజ్యవిభజన కెట్లంగీకరించిరి ? ఇది శాస్త్రగర్హితము కాదా ? మఱియుఁ బాండురాజు తన పరాక్రమముచేఁ బెక్కు దేశంబులు జయించి హస్తినాపుర రాజ్యముతోఁ జేర్చెనుగదా?

"ఆ రాజ్యమునం దతని పుత్రుల కధికారంబుండునందమన్న దాను రాజునని ప్రకటించి పాండురాజు రాజ్యంబు నార్జించలేదు. రాజ్యాధికారి యగువాని పేరుమీఁదనే తాను యుద్ధముచేసినఁ దదుపార్జితము రాజునకే చెందును గాని వానికందధికారంబు లేదు. పోని పాండురాజు కష్టపడి రాజ్యాభివృద్ధి చేసినాఁడని ధృతరాష్ట్రునకు నతనియందుఁగల విశ్వాస గౌరవమునకుఁ జిహ్నముగాఁ దత్సునికి గొంత రాజ్య మిచ్చెనందుమా ధృతరాష్ట్రుడు రాజ్యప్రదాన కాలమం దట్లనలేదు.

గీ॥ * "సర్వలోక కర్మసాక్షి యీ కృష్ణుఁడు
సాక్షిగాఁగ మీకు సకల వృద్ధ
రాజులొద్ద నర్ధ రాజ్యమిచ్చితి బాండు
రాజు విభవమెల్ల రమణఁ గొనుఁడు"

అనిచెప్పెను. కావున నెట్లు విచారించినను ధర్మరాజునకు నర్ధరాజ్య మిమ్మని కోరు నధికారము లేశమాత్రము లేదు. అధికారమున్న సర్వ రాజ్యమును గోరు నధికారమే యుండవలయును. అట్లు సర్వరాజ్యాధికారమే కలదు. పెద్దతండ్రి యందలి గౌరవముచేత నతనికి సగము వదలె

నందురా యవిభాజ్య రాజ్యమును విభజించుటకు యోగ్యత లేదు. ఇదివఱకీ రాజ్యమప్పెన్నఁడు విభక్తము కాలేదు. పోనీ! విభజించిరన్నను శంతను భ్రాతయగు బాహ్లికుండు సజీవుఁడై యుండఁగా వానికి భాగమీయకుండు టకుఁ గారణము లేదు. విచిత్రవీర్యు ననంతరము ధృతరాష్ట్ర పాండురాజు లిరువురు సింహాసన మధిరోహించుట కనర్హులుకాఁగా రాజ్య మరాజకమగు నేని శంతను సోదరుఁడగు బాహ్లికునకు నా రాజ్యాధికారము సంక్రమించ వలసినదేకదా! అట్లు కాలేదు. ధృతరాష్ట్ర పాండునృపతులలో నెవరో యొకరు రాజయి యుండవలెను. పాండురాజు సింహాసనాసీనుఁడు కాలేదు. ధృతరాష్ట్రుడే రాజయినాఁడు.

ఉ॥ * "ఆయము సర్వమున్విడిచి యన్య నృపుల్పవిసేయుచుండ గాం
గేయ భుజాబలంబున వికృత్తవిరోధి సమాజుఁడై కుమా
రాయత శక్తిశాలి ధృతరాష్ట్రుడు రాజ్యముచేసె"

అవి కంఠోక్తి ధృతరాష్ట్రుడేఁరాజ్యము చేసినట్లు వ్రాయఁబడి యున్నది. పాండురాజే రాజ్యాధికారి కానప్పుడు తత్సుతులు 'తమ యయ్య సగంబిల పంచియిమ్ము' అని యడుగుట అధికారము లేదు. ఈ కారణముల వలనఁ బాండవులకు రాజ్యాధికారము లేనట్లు స్పష్టమగుచున్నది. ఏది యెట్లున్నను నంధ నృపతి తప్పుని బిడ్డల యందలి పక్షపాతముచేతఁ గొంత రాజ్యమిచ్చినందున దుర్యోధనుండా రాజ్యవిభాగము నంగీకరింపక తండ్రి కెదురాడలేని మోమాటముచే నప్పటికి కేమియ ననక పదపడి

---

* ఆంధ్ర మహాభారతము

ద్యూతవ్యాపారముచే దానిని మరల దీసికొనియె. అట్లు తీసుకొనునప్పుడు పండ్రెండేండ్లు వనవాసము నొక్కయే డజ్ఞాత వాసమును బాండవులు చేయవలయునని నిబంధన యేర్పఱుపఁబడెను. ఇట్లు సేయుటకుఁగల సూక్ష్మాభిప్రాయము, సాధారణముగాఁ బండ్రెండు సంవత్సరము లొకరి యాస్తి వారి యనుభవములోనుండి తొలఁగి పరాధీనమై యుండినయెడల వారికి దానియందలి స్వత్వము నశించునను ధర్మశాస్త్రాంశమే. ఇట్లు చూచినను బాండవులకుఁ బదమూఁడేడులు తమ యనుభవములో లేని రాజ్యమునందు హక్కు నశించెం గావున సద్దాని వారు మరలఁ గోరఁ గూడదు. ఎన్ని విధములు నాలోచించినను బాండవులకు రాజ్యాధికారము లేదనియు, వారు దానింగోరి యుద్ధము సేయుట అన్యాయమనియుఁ గనుపించుటకు సందియము లేదు."

మహాభారతంవంటి విపుల విషయగ్రథిత గ్రంథంనుండి విషయాన్ని తీసుకోవడమే కాకుండా, దాన్ని తన దృక్పథంనుండి నాటకంగా వ్రాయబూనడం చౌదరిగారు తలపెట్టిన సాహస కార్యాలలో ఒకటి.

నాటక ప్రారంభం ప్రేక్షకుల మనస్సులను ఇట్టే ఆకట్టుకొనేలా ఉండాలి. వారిదృష్టిని నాటకంపైకి కేంద్రీకరింపచేయాలి. వివిధ విధాలుగా ఉండే ప్రేక్షక లోకం, తెరలేవగానే, దృశ్యంలోకి రావాలి. అంటే – ప్రారంభం చిత్తాకర్షణీయంగా ఉండాలన్నమాట! నాటక శిల్పం కరతలామలకంగా ఉన్న కవిరాజు సంజయ రాయబారంతో ఈ నాటకాన్ని ప్రారంభించారు. ఈ విధంగా ప్రారంభించడం వల్ల అప్పటి కురుపాండవుల పరిస్థితి ఎలా వుందో ప్రేక్షకులకు వెంటనే స్ఫురిస్తుంది.

ఇరుపక్షాల మధ్యనూ రాయబారం నడుపుతూ సతమతమౌతున్న సంజయుని ఒక్క చిన్న పద్యంలో అత్యంత రమణీయంగా చిత్రించారు రామస్వామి గారు.

తే. 'ఆము పెద్దులు రెండు పోరాడుచుండ
నడుమనున్న లేగలకాళ్లు నలఁగునట్లు
పుడమికై కురుపాండవుల్ పోరనున్న
నొరులు చచ్చెద రిటు నటు తిరుగలేక'.

ఇది మూడంకాల నాటకం. మొదటి అంకంలో సంజయ, కృష్ణ రాయబారాలు, రెండవ అంకంలో భీష్మ యుద్ధం, మూడవ అంకంలో ద్రోణయుద్ధం చమత్కారపూరితంగా వర్ణించబడ్డాయి. పాండవులకంటే కౌరవులే నీతిపరులనీ, పాండవులకసలు రాజ్యార్హత లేదనే అభిప్రాయాన్ని వారీ నాటకంలో బలీయంగా వెలిబుచ్చారు. ఈ గ్రంథం వారు తమ చిన్న నాట వ్రాసింది. నాటక రచన పూర్తి అయిన అనంతరం చౌదరి గారు వారి గురువర్యులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి చదివి విని పించారు. సావధానంగా విన్న శాస్త్రిగారు "ఏమి రామస్వామీ ! పాండ వులకు అరణ్య, అజ్ఞాతవాసాలదృష్ట్యా పదమూడు సంవత్సరాలు గడిచాయి కాబట్టి వారికి న్యాయశాస్త్రరీత్యా రాజ్యార్హత లేదన్నావు. బాగానే ఉంది. అయితే సత్యానికి పన్నెండు సంవత్సరాల లిమిటేషన్ ఉంటుందా?" అని ప్రశ్నించారు.

"అదికాదండీ ! దుర్యోధనుడి పక్షాన ఉన్న Legal aspects ను లోకానికి తెలియజేయడమే నా అభిమతం" అన్నారు రామస్వామిగారు మందస్మిత వదనంతో. ఇలా చతురోక్తులతో ఆరోజు గడిచిపోయింది.

పాండవులకంటే కౌరవులే నీతిపరులని నిర్భీకంగా సాహసించి, పాత సంప్రదాయాల నుల్లఘించంట చేత, బ్రాహ్మణ వర్గం ఒక్క సారిగా కవిరాజుపై కక్ష్యట్ట జేసింది. ఈ నాటకం ప్రథమ ముద్రణ ఘాటైన విమర్శనలకు గురి అయింది. విశ్వనాథ సత్యనారాయణగారు, కొడాలి అంజనేయులుగారు విమర్శించిన వారిలో ముఖ్యులు. తరువాత కొంత కాలానికి కవిరాజు భావాలే సరియైనవని విమర్శకులు అంగీకరించక తప్పలేదు. కొడాలి ఆంజనేయులుగారు "కవిరాజుగారి కురుక్షేత్ర సంగ్రామాన్ని నేనూ, విశ్వనాథవారు విమర్శించాము. 1920 సం॥ నుండీ దేశం పొందిన పరిణామంతో పాటు నేనూ పరిణామం చెందాను. నేను అట్టి విమర్శన గ్రంధములు గొప్పవని గ్రహించాను. రౌండ్ టేబుల్ సమావేశంలో అంబేద్కరు గాంధీజీని వ్యతిరేకించినప్పుడు నా మనస్సు నొచ్చుకొన్నది. కాని తరువాత ఆలోచించగా మనమే వారి స్థానమున వున్నచో అంతకంటె హెచ్చు ఆందోళన కావించెడి వారమని నిశ్చయించు కొంటిని. అదేమార్గమున కవిరాజుగారి భావవిప్లవం జరిగింది. కాన వారి ప్రతి గ్రంథమును జిజ్ఞాస దృష్టితో చదువ వలెనిని నాకోర్కె" అన్నారు.

అడవి సాంబశివకవిగారు, "భారత కథ ననుసరించి వెడలిన కొన్ని నాటకములను తిలకించితిని. కాని కథా సందర్భము, కూర్పు నేర్పు, రంగ నిర్మాణము మొదలైన వానియందుఁ జాలవఱకు నీ గ్రంథమే మెరుగుగనున్నది. కథా సందర్భమును రమణీయముగ నలవఱచు నేర్పికవికి మిక్కుటముగఁ గలదు, శైలి మృదుమధురము" అన్నారు.

"త్రిపురనేని రామస్వామిగారు ఒక ప్రాంతానికి గాని, ఒక వర్గానికిగాని చెందిన వ్యక్తి కాదు. ఆయన ఒక ఉద్యమం. భారత రచనకు

పాండవుల ముని మనుమ డయిన జనమేజయుడు కౌరకుడగుటచేత పక్ష పాత దృష్టితో వ్రాయబడినదని కవిరాజు నమ్మి నిష్పక్షపాతంగా దానిని విమర్శించారు. ధర్మపక్షం పాండవులది కాదని, కౌరవులదేనని నిరూపించారు. భారతం అందరిసొత్తు. దాన్ని విమర్శించినందుకు ఒక మతాన్ని ద్వేషించారని కవిరాజున కాపాదించడం న్యాయం కాదు.'' అన్నారు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి.

ఇటువంటి అభినందనలు, అభిశంసలూ కూడా అసంఖ్యాకంగానే ఉన్నాయి. విషయం కొత్త దైనప్పటికి, రచనా సంవిధానంలో రామస్వామిగారు ప్రజాభిరుచులను పాటించారు. కేవలం సంభాషణాత్మక మైన నాటకాలకంటే గద్య పద్యాత్మకాలు మరింత రాణిస్తాయని వారికి తెలుసు. ఈ కారణంగానే వారీ నాటకంలో సందర్భోచితంగా పద్యాలను వాడారు. ఇక సంభాషణల శిల్ప విన్యాసాలు సరే సరి ! ప్రేక్షకుల హృదయాలనుండి రివ్వున దూసుకు పోగల శక్తి వాటి కున్నదంటే—సత్యాన్ని కొంతమాత్రమే చెప్పినట్లవుతుంది. అవసరమైనప్పుడు శబ్దాలను ఈటెలుగా, బాకులుగా మార్చడం ఒక్క రామస్వామిగారికి మాత్రమే తెలుసు.

ఈ నాటకంలోని కవితాధార, పదప్రయోగ నైపుణ్యం, పద్యములల నడక హొయలు అపూర్వం. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రభావం ఈ గ్రంథంలో గాఢంగా కనిపిస్తున్నది. మచ్చుకో పద్యం ఉదహరిస్తాను.

చం. 'రథియఁట కాలకేయ ముఖ రాక్షస ఘస్మర బాహుశాలి సా
రథియఁట సర్వలోక పరిరక్షణ శీలుఁడు కృష్ణమూర్తి, త
ద్రథమఁట వీతిహోత్రుని కృతజ్ఞతఁ జెల్వు ఫలంబు,మీమనో
రథమఁట దీర్పకున్నె కురురాజ సమూహము లెన్నివచ్చినన్'

ఈ గ్రంథ ప్రచురణతో చౌదరిగారిని 'నాస్తికవాది'గా అగ్రజాతి చిత్రించి ప్రచారం చేసింది. సంస్కరణాభిలాష, సాంఘిక విప్లవమూ దృష్టి యందుంచుకొన్న చౌదరిగారు యుగ యుగాల నుండీ ఈ తెలుగునాట కరుడు గట్టిన అంధ విశ్వాసాల మీద ఒక్కుమ్మడిగా ప్రళయ ప్రభంజనుని వలే విజృంభించి తిరుగుబాటు చేశారు. అందుచేతనే వారిని 'విప్లవ కవి'అని గౌరవించుకొంటున్నది ఇప్పటి సంఘం.

## శంబుకవధ

ఇది చౌదరిగారి రెండవ రూపకం. భారతదేశ చరిత్ర పరిశీలించి వ్రాయబడింది. మన దేశ చరిత్రను పరిశీలించి చూస్తే ఆర్య, అనార్య సంఘర్షణలు ముమ్మరంగా కనిపిస్తాయి. అనాదినుండీ ఆర్యులు ద్రావిడు లను పెక్కు ఇక్కట్లకు గురిచేస్తూనే వచ్చారు, యూరప్ఖండాన్నుండి వచ్చిన ఆర్యులు వర్ణవ్యవస్థను ఏర్పర్చడమే కాకుండా, ఈ దేశంమీద ఆధిపత్యం కూడా సంపాదించారు. ద్రావిడులపై అనేక ఆంక్షలు విధించి నిర్దయగా అణగద్రొక్కారు. రామరాజ్యంలోనే ఆర్యుల బా. [illegible] గులకు తప్పలేదు. ఆర్య పక్షపాతియైన శ్రీరామచంద్రుడు ద్రా[illegible] అష్టకష్టాలూ పెట్టాడు. 'కృశాంగున్, నిరాహారున్, శోణజటాచ్ఛటాదరున్, మహోగ్రాచారు నేకాగ్రతా పారీణాత్మ నధోముఖున్, భసితకుంభత్పాండుర శ్రీనిధిన్, ధీరత్వాకరు జీరధారు, దీప్యత్తపస్స్వాన్వితుడైన శంబుకుని. 'అనార్యతాపసి'అనే కారణంతో దయదాక్షిణ్యాలు లేకుండా శ్రీరామచంద్రుడు సంహరించాడు-అంటే-రామరాజ్యంలో అనార్యులకు తపస్సు చేసుకునే కనీస హక్కు కూడా లేదన్నమాట! ఈ సాంఘిక అధర్మాన్ని అద్దంవలే ప్రతిబింబింప

జేస్తూ,రసోచిత పదప్రయోగంతో నాలుగుఅంకాల రూపకంగా రూపొందించారు రామస్వామి చౌదరిగారు. ఇదితొలిసారి 1920 సం॥లో ప్రకటించబడింది. ఇందులో స్వతంత్ర సిద్ధికొఱకే శంబుకుడు ప్రాణత్యాగం చేశాడనీ, ద్రావిడులను దాస్యంలో నుంచడానికిగాను శ్రీరామచంద్రుని మతగురువైన వశిష్ఠుడు పన్నిన కుట్రను రామస్వామి చౌదరిగారు ఎలుగెత్తి లోకానికి చాటారు.

ఈ నాటకంలోని సంభాషణలు సామాన్యుని హృదయానికి హత్తుకొనేలా ఉన్నాయి.

చైనులు : ద్రావిడులయందు నూతన శక్తి యొండుద్భవిల్లినది. ఆర్యులతో సమాన స్వత్వమును గోరుచున్నారు. దీని కంతకును మూలకందమ మా శంబుకుడు. వానిని( గడతేర్చిన(గాని యీ యాందోళనము సమసిపోవదు.

సోమయాజులు : అయితే నీవు శంబుకు నెఱుంగుదువా ? వా(డెంత పని(జేయుచున్నాడు? తొల్లి తపోభంగమైన ద్రావిడు(డై పుట్టెను గా(బోలు.

చై : ఆ( ! యెఱుంగుదును. పరమ సాధువు, విజ్ఞాని, పరోపకారము( దలపెట్టు(డు.

సో. యా : నీ మాటలు చిత్రముగా నున్నవి. అట్లయినచో నిది యంతయు నేమిటి? ఎందులకు వచ్చిన పని ?

చై : ప్రజలందఱు సమానముగా( బరిపాలింప( బడవలయుననియు సమానమగు హక్కులుండవలయుననియు నాతని వాదము.

అందులో మత విషయమున నీషణ్మాత్రమైన భేదముండఁగూడ దని యాతని యభిప్రాయము. అందుచే నతఁడిట్లు చేయుచు న్నాడు.

సో.యా : అట్లయితే ఋషిప్రోక్తములగు గ్రంథములన్నిటిని మన్న చుట్టవలసినదేనా?

చై : స్వత్వసామాన్యమునకుఁ బ్రతిబంధకములగు నీతులన్నియు గర్హ్యములనియే యాతని యభిప్రాయము.

సో. యా: ఓహో ! కొంపకు నిప్పు ముట్టించుచున్నాడే ? అతఁడి ప్పుడెక్కడ నున్నాఁడు?

చై : మన పట్టణంబునకుఁ బరిసరంబుననే సరయూనదీ తీరమునఁ జిదానందాశ్రమ మని పేరు పెట్టుకొని యొక యాశ్రమము నిర్మించుకొని తపస్సుఁ జేసికొనుచు, నప్పుడప్పుడు శిష్యులకుఁ దత్త్వోపదేశముఁగావించుచున్నాడు.

సో. యా : (మండిపడుచు) ఏమిః తపస్సా? శూద్రుఁడు, తపస్సా? శిష్యుల కుపదేశములా? ఏమివింత? రామరాజ్యంలోనే యిట్టి వింతలా? ఇప్పుడు మనము చేయవలసినది యేమి?

ఈ నాటకం తెలుగునాట సాధించిన ప్రయోజనం అమూల్య మయింది. 1934 సం.లో ఈ నాటకం రెండవకూర్పు జరిగింది. దీని తొలి పలుకులలో నాటకకర్త యిలా వ్రాశారు: "పదిహేనేండ్లనాఁడు శంబుకవధ ఆంధ్రలోక ప్రచారంబునకై వెడలినప్పుడు లోకము సంపూర్ణ విముఖముగ నుండెను. పలుకరించువారు లేరు. ఆదరించువారు లేరు..

అయినను మొండికత్తెయై దేశదేశములు తిరిగినది. రంగూను వెళ్ళినది. దక్షిణ ఆఫ్రికా వెళ్ళినది. లెక్కలేనన్ని దూరులు పడుచు, లెక్కపెట్టక యిల్లిల్లు తొంగి చూచి తనకు తోచినరీతి నీతులు చెప్పినది. కట్టకడకు విముఖగా నున్న లోకము కొంతవరకు సుముఖమైనది. పలుకరించిరి. ఆదరించిరి. ఆతిథ్య మిచ్చిరి, ఆహ్వానములు వచ్చెను. పిలుపులు వచ్చెను. 'మా యూరువచ్చి యుపన్యసింపవలయు'నని ప్రజలు కోరిరి. పిలుపు వచ్చినచోటికెల్ల నేగినది. ఉపన్యసించినది. ప్రజలయొక్క దృక్పథములో మార్పు కలిగించినది. భావ పరిణామము చేకూర్చినది''. అనేక చోట్ల ''శంబుక వధ'' దిగ్విజయంగా ప్రదర్శించబడటం నేను స్వయంగా చూశాను. సంస్కరణాభిలాష గల నాటక సమాజాలెన్నో దీనిని ప్రదర్శించాయి. అంతవరకూ భగవంతుడుగా ఆరాధించబడు తున్న శ్రీరాముని యదార్థరూపాన్ని యీ నాటకం ప్రదర్శించింది. నాటకం చూచినప్పుడు శ్రీ రా మ చ ం ద్రు డు శంబుకుణ్ణి అన్యాయంగా సంహరించినందుకు ఆతనిపై మనకు కరుణ కలుగుతుంది. శ్రీ రామునిపై కోపం మాత్రం రాదు. ఈ విధంగా కరుణరసం వెల్లుబుకుతుందీ నాటకంలో. పాత్రపోషణలో చౌదరిగారికి అందెవేసినచేయి. వశిష్ఠుడు పన్నిన కుట్రను మన కళ్ళకు కట్టినట్లుగా చిత్రించారు. ఈ నూతన కాంతులకు ఆంధ్రులు దిగ్భ్రమ జెందారు. ఆ వెలుగులో సత్యాన్ని వారు చూడ గలిగారు. ఫలితంగా రామాయణ గాథపట్లనే వారికి అనేక సందేహాలు కలగసాగాయి. ఈ సందేహాలకు సంతృప్తికరమయిన సమాధానాలను వారు, మరే గ్రంథంనుండీ పొందలేకపోయారు. దీనిపై తర్కవితర్కాలు బయలు దేరాయి. శంబుక వధ న్యాయం కాదని అనేక మంది భావించసాగారు. ఊరూరా, వాడవాడా కవిరాజు కనేకమంది ఏకలవ్య శిష్యులు తయా రయ్యారు. ఈ మార్పు చూసి కలవరపడి పెక్కు మంచి బ్రాహ్మణులు

శంబుకవధపై దాడిచేశారు. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు శంబుక వధను విమర్శించారు. అంతేకాదు. అగ్రజాతి రామభక్తు డొక దుగ్రుడై *'అది అంగలూరు కాదు. రాక్షసుల లంక. అది త్రిపురనేనివంశంకాదు. త్రిపురాసుర వంశం. అతడు రామస్వామికాడు, రావణస్వామి. అతడు వ్రాసేది నూతపురాణం కాదు, బూతుపురాణం. రావణుడు దేవతల్ని బాధిస్తే,ఈ రావణస్వామి భూదేవతలన్ల బాధిస్తున్నాడు". అంటూఈనాటక ప్రతిని ముక్కలుముక్కలుగా చింపిపారేసి తన ఆక్రోశాన్ని వెళ్ళగక్కాడు.

పరిస్థితులు ఆ విధంగా వున్న రోజుల్లో స్థితప్రజ్ఞుడయిన రామస్వామిచౌదరిగారు ఎన్నో ఆటంకాలనూ, ఎన్నో విమర్శలనూ ఎదుర్కొని, అగ్రజాతి నిరంకుశత్వంతో హోరాహోరీగా పోరాడారు. అగ్రజాతి స్వార్థబుద్ధితో సృష్టించిన స్మృతిసాహిత్యంవల్ల వివిధ వర్ణాల మధ్య ఐక్యత నశించి, జాతి నిర్వీర్యమయిందని గుర్తించిన రామస్వామి చౌదరిగారు స్మృతిధిక్కారానికి పూనుకొన్నారు.

వారి నూతనోద్యమ రూపురేఖలను వివరిస్తూ శంబుక మహర్షి లేఖలో యిలా వ్రాయించారు.

మ॥ అతిలోభంబునుబూని యాత్మహిత కార్యస్థాపనాచార్యులై
స్మృతి నిర్మాణ విదగ్ధులై తనరువారిన్ సభ్యులం జేసి త
ద్విత పక్షుండవు ధర్మపీఠమునయం: దేకూరు చున్నంత మా
గతియే మౌనొ యెఱుంగఁజాలమొకొ యింకన్ రామచంద్రప్రభూ!

మ॥ మత నిర్మాణముకై వచించి ఋషులామ్నాయంబులన్ బిమ్మటన్
స్మృతులం జెప్పిరి యార్య సంఘమొగి వర్ధిల్లంగ మే మందుచేఁ
జతురామ్నాయములం దలంచుచు నమస్కారమ్ముం జేయుచున్
స్మృతి ధిక్కారముఁ జల్పబూనితిమి మా క్షేమాభిలాషంబుచేఁ.

---

* ఆంధ్రప్రభ వారపత్రిక 17-2-60

''మా రాష్ట్రవాసుల కెల్ల సమానములగు హక్కు లిచ్చి పక్షపాత రహితముగ రాజ్యమేలుట మాకు విధ్యుక్తధర్మము'' అని శ్రీరామునిచే అనిపించి లోకానికి తమ ఆదర్శం వెల్లడించారు.

వంగదేశంలో రాజారామమోహనరాయ్ వలే ఆంధ్రదేశంలో సంఘ సంస్కర్త అయిన చౌదరిగారు మహోద్యమాన్ని విమర్శించారన్న కారణంతో 'బ్రాహ్మణ ద్వేషి' అనే 'బిరుదులాంటి తిట్టు'ను అగ్రజాతి ప్రసాదించింది. విద్యాగంధం లేకపోవటంచేత రామస్వామి చౌదరిగారితో మాట్లాడితే తమకు కూడా బ్రాహ్మణ ద్వేషమనే మురికి అంటుతుందని బ్రాహ్మణేతరులు జంకేవారు. ఇలాంటి దుష్పరిస్థితిని ఈ నాటకంలో బహు చక్కగా చిత్రించారు చౌదరిగారు. 'స్త్రీజులు మరియు హేతువాద వనిము, మతద్రోహి అనియుం చెప్పుదురు. బ్రాహ్మణేతరులలో విద్యా గంధము లేమిచే బ్రాహ్మణద్వేషులని గొణుగుదురు. కట్టకడకు మీ రిరు వొకరుం గాని వారగుటయే ఫలము' అని శంబుక సంయ మీంద్రమని నోట్చి అంగముగ చెప్పిన పరిస్థితి కేవలం ఆనాటి రామస్వామి చౌదరిగారి పరిస్థితే. ఇప్పటికీ పరిస్థితి అలాగే ఉండటం మిక్కిలి దురదృష్టకరం.

## ఖూనీ

అంగరాజు కుమారుడయిన వేనుడు దుష్టుడయినట్లుగానూ, ప్రత్యక్షంగా కనుపించనిదాన్ని నమ్మనట్లుగానూ, రాజు దైవాంశసంభూతుడన్న సిద్ధాంత రీత్యా అహంకారంతో ప్రవర్తించాడనీ, చిట్టచివరకు మహర్షుల

కోపాగ్నికి ఆహుతి అయినాడని భాగవతంలోని చతుర్థ స్కంధం వలన తెలుస్తున్నది. భాగవతంలోని వేనుడు పాషండుడు; నాస్తికుడు. ఈ వేనుని గాథను ఇతివృత్తంగా గైకొని విశ్వనాథ సత్యనారాయణగారు అనేక అభూత కల్పనలతో 'వేనరాజు' అనే పదిఅంకాల నాటకాన్ని సృష్టించారు. భాగవతంలోని వేనునికి, ఈ నాటకంలోని వేనునికి పోలికలే కనిపించవు. వంచుల కథ కేవలము విశ్వనాథవారిచేత కల్పించబడింది. ఈ నాటకంలో విశ్వనాథవారు మరచిపోయిన తాతలనాటి కథలను త్రవ్వి వెళ్ళగించి, ఆర్యఋషుల మహాత్మ్యమునూ, వారి వృత్తశీలములనూ క్రొత్త మాటలచే లోకానికి బోధింప బూనుకొన్నారు. అందులో వారు భగవంతుని ఉనికిని ఈ విధంగా నిరూపించడానికి ప్రయత్నించారు.

గౌతముడు : భగవంతుడు లేడా?

వేనుడు ; ఉన్నాడా?

గౌతముడు ; ఉన్నాడు.

వేనుడు ; ఎట్లు?

గౌతముడు ; ఈ ప్రపంచము కార్యము. దీని కర్తడు కారణము.

వేనుడు ; ఈ ప్రపంచమే నిత్యము. ఇదియే అన్నింటికి కారణం.

గౌతముడు : అస్థిరముగాన నిత్యము కాదు. అందుకని కారణం కాదు.

వేనుడు : అట్లయిన నీవు చెప్పు భగవంతునకు వేరే కారణముండవచ్చును.

గౌతముడు ; లేడు. అట్లు కారణమునకు గారణమనగా నంతు లేకుండా పోవును. దాని ననవస్థాన దోషమందురు తార్కికులు.

ఈ విధమలుస తర్క కుతర్కాలతో వైదిక మతాన్ని, ఆస్తిక ధర్మాన్ని ప్రచారం చేయబూనిన విశ్వనాథవారు కృతకృత్యులు కాలేక పోయారు. వేనరాజును పరిశీలించి చూస్తే తానొక ఆర్యఋషి సంతతి వాడననే సమ్మకంతో, కృతికర్త వేనవధను సమర్థించటానికై పడరాని పాట్లు పడినట్లుగా బోధపడుతుంది. విశ్వనాథవారి రూపకములను పరిశీలించిన పోణంగి శ్రీరామ అప్పారావుగారు వేనరాజుపై ఈ క్రింది అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

*"1934 సం.లో వేనరాజు ఆంధ్రనాటక కళా పరిషత్తు సభలలో ప్రప్రథమంగా ప్రదర్శించ బడినది. ఆనాడు స్థానంవారు పృథువు. గోవిందరాజుల సుబ్బారావుగారు అంగరాజు. మాధవపెద్ది వెంకట్రామయ్యగారు గౌతముడు. శేషాచార్యులుగారు వేనరాజు. విశ్వనాథవారే స్వయముగా ఆచార్యత్వమును వహించిరి. కాని ఆనాడది విజయవంతము కాలేదు. ఇది వైదిక నాటకమని పలువురు పెద్దల విశ్వాసము. తత్ఫలముగా ఆనాడు పెద్ద అల్లరి జరిగినది. నాటకము సగములోనే ఆగిపోయినది. దానికి కారణము నాటకమునందొక లోపమున్నది. మొదటి భాగమున తర్కవితర్కము లెక్కువ. ఇది రంగస్థలము మీద రక్తి కట్టుట కష్టము. ప్రేక్షకులు కూడా అందులకు సిద్ధపడివచ్చినప్పుడే అందలి స్వారస్యమును గ్రహింపగలరు. లేనిచో ఇట్టి నాటకములు రంగస్థలము మీద విజయవంతము కాలేవు."

---

* స్రవంతి–జనవరి, 1959

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి వేనరాజు, 'ఖూనీ'నాటక రచనకు ఎలా కారణ భూతమయిందో రామస్వామి చౌదరిగారు తమ పీఠికలో ఇలా ఉల్లేఖించారు. "ఒకనాటి ప్రొద్దున మా స్నేహితుడు శ్రీ నందూరి శేషాచార్యులుగారి యింటికి నుబుసుపోకకు పోయితిని. మేజా బల్లపై విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన 'వేనరాజు' వ్రాతప్రతి పడియున్నది. తీసి చదువుట కారంభించితిని. చదివిన కొలది యాందోళన పడితిని. చదువుట పూర్తి కానివే నాచార్యులుగారి యనుమతితో నా గ్రంథమును నింటికిం గొంపోయి పూర్తిచేసితిని. కంపరపాటు గలిగినది. నిజముగ వేనరాజు మనుజుల పుట్టుకతోఁ చెరలాడు నంతటి క్రూరుడా. తన్మూలమున వధ్యుడా? యను సందియము కలిగినది. వెంటనే భాగవతంలోని వేనరాజు కథను చదివితిని. నిట్టూర్పు విడిచితిని. నా సందియము పటాపంచలైనది. వేనరాజు నిష్కారణముగ "ఖూనీ" చేయబడెనని నాకు బోధపడినది. "వేనరాజు" నాటకముచే వేనరాజునకుఁ దీరని మహాపచారము చేయఁబడినదని నాకు గట్టి నమ్మకం కలిగినది. ఈ యపచారమును వెంటనే తుడిచివేసి వేనరాజు నిజస్వరూపము లోకమునకుఁ బ్రదర్శించుట ధర్మమని తోఁచినది. దీనికి ఫలముగా "ఖూనీ" యను నీ చిన్న గ్రంథమును వ్రాసితిని. ఇది నా "ఖూనీ" జన్మకథనము'.

ఇప్పుడు 'ఖూనీ' నాటకంలోని వేనుని స్వరూప స్వాభావాదులను గురించి తెలుసుకొందాం. వేనుడు నిస్సందేహంగా మహాపురుషుడు. అతడు సింహాసనం అధిష్టించినప్పటినుండి అతని రాజ్యంలో కరువుకాటకాలు లేవు. 'ధర్మ సంస్థాపనా ప్రతిష్ఠంబైన యాతని ద్రాఘిష్ఠఖడ్గ ధారధాళ

'ధర్మాసు' ను జూచి జారచోరులు పరసీమలకు పలాయన మంత్రం పఠించారు. జానపదులు సైతమూ గుండెమీద చేయి వేసుకొని నిర్భయంగా కాలం గడపసాగారు. యావన్మంది ప్రజలు సుఖజీవనం చేయాలనీ, పశు, పక్షి, క్రిమి కీటకాదులు సైతమూ బాధపడరాదనునవి వేనుని ఆశయాలు. స్మృతికర్తలయిన ఋషులు తమ స్వార్థంకోసం స్థాపించిన సనాతన ధర్మాన్ని ఎదురించిన వీరుడు వేనుడు. అతని రాజ్యంలో జంతు బలి, యజ్ఞయాగాదులు పూర్తిగా నిషేధించ బడ్డాయి. అతని పరిపాలనలో వేనమతం ప్రబలి, వేదమతం సర్వనాశనమయింది. దేశంలో పొటమరిస్తున్న స్వాతంత్ర భావాలను ఆర్యఋషులు తమ నిరంకుశత్వాన్ని నిలపెట్టుకోవడానికే ఏరిపడేశారని తలంచిన వేనుని, ఆర్యఋషులు-లేదా-విశ్వనాథ సత్యనారాయణగారు ఖూనీ చేశారని కవిరాజుగారు భావించారు. వేనరాజు నాటకంలో వేనరాజును తీరని అపచారం చేయబడిందని గ్రహించిన రామస్వామిచౌదరిగారు, వేనుని నిజస్వరూపాన్ని లోకానికి తెలియజేయాలనే కాంక్షతో "ఖూనీ" నాటకాన్ని 1935 సం. లో రచించారు. ఇందులో నాలుగు రంగాలున్నాయి. వేనరాజు నాయకుడు. అతని సైన్యాధిపతి దృష్టవర్మ ఉపనాయకుడు. దృష్టవర్మ ఋషుల చేతుల్లో కీలుబొమ్మగా మారి, గాఢ నిద్రలోవున్న వేనుని గుండెల్లో బాకుతో పొడిచి చంపుతాడు. తుట్టతుదకు దృష్టవర్మ తన అపరాధాన్ని తెలుసుకొని తానుగూడా కత్తితో పొడుచుకొని మరణిస్తాడు. ఈ నాటకం ఆత్మహత్యతో అంతమౌతుంది. కాబట్టి దీనిని విషాదాంత నాటకం (tragedy) అన వచ్చు. భారతీయ సంప్రదాయం ప్రకారం నాటకం సుఖాంతం (comedy) కావలసి వుంది. కాని కవిరాజుగారు 'ఖూనీ' నాటకాన్ని సుఖాంతం చేయలేదు. కారణం

మోదాంత నాటకాలకంటే, విషాదాంత నాటకాలే పఠితల హృదయాలలో చెరగని ముద్రవేస్తాయి. షేక్స్పియర్ రచించిన 'కామిడీస్' కంటే 'హామ్లెట్' 'ఒథెల్లో' 'లియర్' 'మాక్‌బెత్' అను 'ట్రాజిడీస్'కే ప్రపంచ ప్రఖ్యాతి లభించింది.

రామస్వామిచౌదరిగారు సంస్కృతాంధ్రాలలోనేగాక ఆంగ్లంలో కూడా ఉద్దండ పండితులు. షేక్స్పియర్, బెర్నార్డుషా వ్రాసిన నాటకాలు వారికి కొట్టిన పిండి. వారు పాశ్చాత్య నాటకప్రదర్శనలనేకం చూశారు. అందుచేత కవిరాజుగారిపై పాశ్చాత్య నాటకకర్తల ప్రభావం కొంత ప్రసరించింది. అందుచేతనే నాటకాన్ని విషాదాంతం చేశారు. ఈ నాటకంలోని ప్రతిపాత్రలోనూ, సంభాషణలోనూ రామస్వామి చౌదరిగారి ప్రతిభ గోచరిస్తూ వుంటుంది.

'ఖూనీ' నాటకంలో రామస్వామి చౌదరిగారు నాస్తికత్వానికి దారి చూపుతూ 'పూర్తిగా నాస్తికుడయినట్లు పొడగట్టని వేనుణ్ణి పరమనాస్తికునిగా చిత్రిస్తున్నాను' అన్నారు. సర్వాంతర్యామి అని చెప్పబడే భగవంతుని నిష్ప్రయోజకత్వాన్ని నిరూపించారు.

వేను : దృగ్గోచరుడు కానివాడును, మానవులచే సృష్టింపబడినవాడును, సృష్టి స్థితి లయములకు కారకుడేమి? సృష్టిస్థితి లయములు స్వభావ జన్యములు కావా? పుట్టినది గిట్టకున్న దేది? ఇందులో భగవంతునకుం బెత్తనమేల? పెత్తనమే యున్నయెడల విప్లవ ఘాతక కృత్యము లేల జరుగును? వీని నణంచలేడా? ఎందులకు నణంచడు?

శునశ్శేపుడు : మానవుడు కర్మప్రేరితుడయి చేయుచున్న కార్యములను యెవ్వరు మాన్పగలరు ?

వేనుడు : అయినచో భగవంతుడు నిష్ప్రయోజకుడా ?

శునశ్శేపుడు : నిష్ప్రయోజకుడు యెట్లగును? అతడు సర్వ కర్మలకు సాక్షి.

వేనుడు : నీవు పాషండుడవు. నీకు సుగతులు లేవు.

ఈ సంభాషణలతో ఆధ్యాత్మిక సౌధం పేకమేడలా కూలిపోయి' వేనరాజుచేత పలికించిన రామస్వామి చౌదరిగారి 'హేతువాదం' తెనుగు దేశంలో శుక్ల పక్షంలోని చంద్రునివలే దినదినాభివృద్ధి నొందసాగింది. పాషండులయినంత మాత్రాన మానవులు దుర్మార్గులు కారనీ, వేనరాజు పాషండుడయినప్పటికీ విశ్వనాథ సత్యనారాయణగారు చిత్రించినట్లుగా దుర్మార్గుడు మాత్రం కాడనీ 'ఖూనీ' నాటకంలో రుజువు చేయబడింది.

ఈ నాటక ఇతివృత్తంలో పటుత్వమూ, ప్రాసంగిక కథా సంయోజన నిపుణత్వమూ, పాత్రపోషణలోని చాతుర్యమూ. సంభాషణలలోని లాలిత్యమూ, రసస్ఫురణ వైభవమూ, ఉపపత్తి ప్రదర్శన జాగరూకత, పదగుంఫనా మార్దవమూ, ఉపక్రమోప సంహార రమణీయత-కవి రాజుగారికి నాటక రచన యందుగల ప్రతిభా పాటవాలను వెల్లడిస్తున్నాయి.

ఈ మూడు నాటకాలు ఆంధ్ర నాటకసాహిత్యంలోనే కాదు,ప్రపంచ నాటక సాహిత్యంలో కూడా అమూల్యమయిన కళాఖండాలు. వీటిని ఆంగ్ల, రష్యను భాషలోకి పరివర్తించడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలుస్తు

న్నది. మన రాష్ట్రంలో హిందీ, ఉర్దూ భాషలలోకి అనువదించడానికి కొందరు పూనుకొంటున్నారు. ఇది సుదావహమయిన విషయం.

కవిరాజుగారి నాటకా లౌక యెత్తు. వాటి పీఠిక లోకయెత్తు. విషయాన్ని సత్యపథంలో వివరించే ఆ పీఠికలు పఠితల్లో ఆలోచన రేకెత్తిస్తాయి. తమ వాదం యదార్థమేననడానికి రామస్వామి చౌదరి గారిచ్చిన ఉదాహరణలు. ఉపపత్తులు, వారి పరిశీలనా పాటవాన్నీ, సత్యాన్వేషణాసక్తినీ నిరూపిస్తున్నాయి. వీటిని వ్రాసి రాజసగల విమర్శలు నాటికీ నేటికీ కూడా మృగ్యమే !

ఈనాటకాల విశిష్టతను గురించి సమకాలీనులు ఏమనుకుంటున్నారో చూద్దాం.

'ఖూనీ' నాటకమును గూర్చి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు "విశ్వనాథ సత్యనారాయణగారు వేనరాజు వ్రాశారు, కవిరాజుగారు 'ఖూనీ' వ్రాశారు. ఆయన వ్రాశారు గనుక అది చాలా ఉదాత్తంగా వొచ్చింది. అలా జరక్క 'వేనరాజు' లోని విషయాలకు ఎదురు తిరిగిన ఏ నాటోటి ఇంకొకరో పలపెట్టి ఉన్నట్లయితే వేనరాజుపై ప్రతిఘటన-ఫేలపంగా అవ్యాప్తి అతివ్యాప్తులతో నిండి ఉండేది" అన్నారు.

రామిస్వామిగారిని "ఆంధ్రా బెర్నార్డుషా" అని అభినందించారు కట్ట మంచి రామలింగారెడ్డిగారు. *"హిందూ పౌరాణిక నాయకుల ప్రవర్తనతో

* ప్రసిద్ధ నాటికల తొలిపలుకు

ముడిపడిన ధార్మిక విలువలను కదలించిన గౌరవము కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగారికి దక్కినది'' అన్నారు ఆంధ్ర విశ్వ విద్యాలయ రిజిష్ట్రార్ శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు.

ప్రసిద్ధ కథకులు, నాటక కర్తలు, హాస్య రచయితలైన భమిడిపాటి కామేశ్వరరావుగారు కవిరాజుగారి నాటకాల ప్రాశస్త్యాన్ని గురించి అనేక సభలలో ఎలుగెత్తి చాటారు. ''నేను సాంఘిక దురాచారాలను రూపుమాపటానికి పూనుకొన్నాను. కవిరాజుగారు పురాణ రోగాలను పూర్తిగా నివారించడానికి కంకణం కట్టుకొన్నారు. వారి కృషి ఫలించటం పైనే నా శ్రమ ఆధారపడి ఉంటుంది. ముందా దీర్ఘరోగాలు పోతేగాని చిన్న చిన్న జబ్బులకు నా చిట్కాలు వాడుకకోకి రావు'' అని తరచుగా సన్నిహితులతో అంటూ ఉండేవారు.

బాల వాఙ్మయబ్రహ్మగా ప్రసిద్ధికెక్కిన చింతా దీక్షితులుగారు కవిరాజుగారి సాహిత్యాన్ని ముఖ్యంగా నాటకాలను ఎంతో మెచ్చుకొనేవారు. ''ఇంత మందిమి మేము ఉండీ చెయ్యడానికే సాహసించలేని కార్యాన్ని మన చౌదరి చేశాడు. వారు మరి కొంత కాలం మన మధ్య లేకపోవడం మన దురదృష్టం. అంతేకాదు వారు మరి కొంత కాలం జీవించి ఉన్నట్లయితే ఆంధ్ర నాటకరంగం మూడు పువ్వులు, ఆరు కాయలుగా అభివృద్ధిచెంది ఉండేది'' అన్నారొక సందర్భంలో.

''రాజరాజు'' వంటి నాటకాలు వ్రాసి, ఎన్నో కథానికలు వ్రాసి ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

"కవిరాజు వ్యక్తికాదు; ఒక ఉద్యమం. తుఫాను వంటివాడు. చెత్త, చెదారం, దుమ్ము, ధూళి, మురుగు సమూలంగా తుడిచి పెట్టుకు పోవడానికి అప్పుడప్పుడు ఇటువంటి, తుఫానులు చాలా అవసరం. సరైన తరుణంలో కవిరాజు ఆవిర్భవించాడు. లేకపోతే తెలుగు సమాజం, అధమం, అర్ధ శతాబ్దం వెనుకబడి ఉండేది'' అన్నారు.

శ్రీ. శే. బళ్ళారి రాఘవాచారిగారు ''నటుడుగా నాకున్న పరిజ్ఞానంతో చూస్తే, కవిరాజుగారి నాటకాలు మహోత్తమమయినవి. చెప్పదలచుకొన్న విషయాన్ని ఉపన్యాస ధోరణిలో కాకుండా సంఘటన రూపంలోకి మార్చి చెప్పడంలో వారికి వారే సాటి. శక్తివంతమైన సంభాషణలు వ్రాయగల నాటకకర్త తెలుగువారిలో కొద్దిమంది మాత్రమే గలరు. ఆ కొద్దిమందిలో కవిరాజుగారు ప్రథమశ్రేణిలో కొస్తారు.'' అన్నారు.

ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తిగారయిలా అన్నారు: "నేనూ నాటకాలు వ్రాశాను. వాటిని కొన్నినాటక సమాజాలవారు ఆడుతున్నారుకూడాను. నేను ఆశించిన ప్రయోజనం వేరు. కవిరాజు నాటకాలు చదివిన తరువాత, నాటకం ఎంతశక్తి వంతమైన ఆయుధమో గ్రహించాను. ఇప్పుడు మరల నేను నాటక రచన కుపక్రమిస్తే ఈ నాటకాలను దృష్టిలో వుంచుకొని రచన చేస్తాను.''

"కవిరాజుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. కవిగా, విమర్శకుడుగా, ఉపన్యాసకుడుగా, సంస్కర్తగా మాత్రమేగాక, నాటకకర్తగా వీరు సాధించిన ఫలితాలు అమోఘమైనవి. అనూచానంగా వస్తున్న ఒకానొక

సాహిత్య ప్రక్రియను, సంఘ సంస్కరణకుగాను, ఇంత సంప్రదంగా ఉపయోగించుకొన్న వారు అరుదు" అన్నారు ఆచార్య కురుగంటి సీతా రామయ్యగారు.

"మన ప్రాచీన గాథలను కేవలం మూఢ విశ్వాలతో నమ్మే లోకానికి సవిమర్శకంగా, శాస్త్రీయక దృష్టిలో, భూతకాలాన్ని ఎలా అర్థం జేసు కోవాలో మొట్టమొదటగా తెలుగుదేశానికి తమ నాటకాలద్వారా నేర్పినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. గత కాలానికి వర్త మానానికీ మధ్య ఒక పెద్ద అఖాతమున్నదని నా నమ్మకం. ఈ అఖాతం మీద వంతెనగట్టి, చక్కగా శాస్త్రీయ దృక్పథంతో, గతాన్ని తెలుసు కోవడానికి 'కురుక్షేత్ర సంగ్రామము', 'శంబుకవధ' 'ఖూనీ' నాటకాలు తోడ్పడతాయి. ఈ అఖాతం కొందరికి కనుపించకపోవచ్చు. కాని అది పున్నమాట వాస్తవం. 800 సంవత్సరములు మహమ్మదీయుల, ఆంగ్లేయుల వరిపాలన క్రింద విచ్ఛిన్నమైపోయిన భారతీయ సంస్కృతి వికాసం పొందాలంటె శాస్త్రీయ దృక్పంతో పురాణాలనూ, ఉపనిషత్తులనూ పరిశీలించాలి. ఆ పరిశీలించడం ఏలాగో వివరించినవారు కవిరాజు" అన్నారు దాశరథిగారు.

ఆంధ్ర నాటకరంగానికి చేసిన అమూల్యమైన సేవవల్ల రామస్వామి చౌదరిగారు ఆంధ్ర నాటక కర్తలలో ప్రథమ శ్రేణికి జెందిన వారుగా పరిగణింప బడుతున్నారు.

ఓ సూతాశ్రమయోగీ! మీరు ధన్యజీవులు !!

* * *

# సూతాశ్రమ గీతాలు

కొందరు సంస్కర్తలు మార్పును ఏవో కొన్ని శాఖలకే పరిమితం చేస్తూవుండటం కద్దు. రామస్వామిచౌదరిగారు దానికి పూర్తిగా విరుద్ధం. ఛందోబద్ధమయిన పద్య రచనతోపాటు మాత్రాబద్ధమయిన గేయ రచనను కూడా వారు చేశారు. పద్యాలకు, గేయాలకు, ఒక ప్రధానమయిన భేదంవుంది. పద్యం పండితులకే పరిమితం కాగా, గేయం పామరజనానికి కూడా అందుబాటులో వుంటుంది. సామాన్య ప్రజానీకంలో ఏదైనా ఒక నూతన భావాన్ని బహుళ ప్రచారం చేయడానికి గేయం చక్కని సాధనం; ముఖ్యంగా స్త్రీలనూ, బాలబాలికలనూ, గ్రామీణులనూ—సంఘంలోని సామాన్య ప్రజానీకాన్ని, గేయాలు ఆకర్షించినంతగా, పద్యాలు ఆకర్షించవు. ఈ విషయాన్ని గుర్తించిన రామస్వామి చౌదరిగారు "సూతాశ్రమ గీతాలు" రచించారు. సాహిత్య క్షేత్రంలో వారు చేసిన ఈ కృషి దేశాభివృద్ధికి, జాతీయోద్యమానికి ఎంతగానో ఉపకరించింది.

రాజకీయంగా రామస్వామిచౌదరిగారు జస్టిసు పార్టీకి చెందిన వారని ప్రతీతి. కాని స్థూలంగా చూస్తే వారు జాతీయ మహానాయకుల కోవకుచెందినవారుగా కనిపిస్తుంది. సంఘంలో ఉన్న హెచ్చుతగ్గులను నిర్మూలించడమనే దృష్టితో విదేశీ ప్రభుత్వాన్ని ఆమోదించే పలుకూ వెళ్ళడం వారి కిష్టం లేదు. సంఘంలో వున్న హెచ్చుతగ్గులను నిర్మూలించ వలసిందే. అదేవిధంగా పర పీడన కూడా అంతం కావలసిందే. దోపిడీ, పరపీడన ఎక్కడున్నా వాటి నెదుర్కోవలసిందే. ఈ ఉద్దేశ్యంతో

వారు "జాతీయ బ్రాహ్మణేతర ఉద్యమం" అనే నూతన ఉద్యమాన్ని జస్టిసు పార్టీకి పోటీగా ప్రారంభించారు. ఈ ఉద్యమం తరఫున బెజవాడలో జరిగిన మహాసభలకు వారే అధ్యక్షత వహించారు. కులతత్వాన్నీ, కులాల పేరు మీదుగా జరిగే అత్యాచారాలనూ ఎదుర్కొనే వరకూ దీని స్వభావం జస్టిసు పార్టీ స్వభావమే. కాని అది దేశభక్తిని ఏ మాత్రం అడ్డుకోరాదు. మాతృదేశసేవకు అవకాశం దొరకడం కోసమే కులతత్వ నిర్మూలనగాని, దేశాన్ని పరదేశీయ పరిపాలనక్రింద వుంచడానికి కాదు అనే ఆదర్శం కలిగి వుండటమే దీని ప్రత్యేకత.

రామస్వామిచౌదరిగారు దరిద్ర దేవతను ఆశ్రయించిన జాతీయ గేయకవి. జాతీయాభిమానం వీడి, జస్టిస్ పార్టీ నాయకులను ఆశ్రయించివుంటే గొప్పపదవిని అలంకరించి వుండేవారు. ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం వారికి గొప్ప పదవులను ఎరగా జూపించినా చౌదరిగారు వాటికి లొంగిపోలేదు. అందులకు కారణం వారికి పదవీ వ్యామోహం లేకపోవడమే. వారు భారతజాతికి అండగా నిల్చి జాతీయోద్యమంలో పాల్గొని, భారతమాత దాస్యశృంఖలాలను విచ్ఛేదం చేయాలని సంకల్పించారు. నీరసమూ, నిస్తేజమూ అయిన జాతిలో వీరరసంతో ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించడానికి 'వీర గంధము' అను జాతీయ గీతం వ్రాశారు. చూడండి ;

'వీర గంధముఁ దెచ్చినారము
వీరుడెవ్వఁడొ దెల్పుఁడీ !
పూసి పోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో ! !

తెలుఁగు బావుట కన్ను చెదరఁగ
కొండ వీఁటను నెగిరినప్పుడు
తెలుఁగు వారల కత్తి దెబ్బలు
గండి కోటను కాంచి నప్పుడు.

తెలుఁగు వారల వేఁడి నెత్తురు
తుంగ భద్రను గలసి నప్పుడు
దూర మందున నున్న సహ్యజ
కత్తి నెత్తురు కడిగి నప్పుడు.

ఇట్టి సందియు మెన్నఁ దేనియుఁ
బుట్టలేదు రవంతయున్
ఇట్టి ప్రశ్నల నడుగు వారలు
లేకపోయిరి సుంతయున్.

నడుము గట్టిన తెలుఁగు బాలుఁడు
వెనుక తిరుగండెన్నఁడున్.
బాస యిచ్చిన తెలుఁగు బాలుఁడు
పాఱి పోవండెన్నఁడున్.

ఇదిగొ ! యున్నది వీర గంధము
మైనలందుము మైనలందుము
శాంతి పర్వము జదువ వచ్చును
శాంతి సమరంబైన పిమ్మట

తెలుఁగు నాటిని వీరమాతను
జేసి మాత్రము తిరిగి రమ్మిఁక
పలు తుపాకులు పలు ఫిరంగులు
దారి కడ్డము రాక తప్పవు

వీర గంధముఁ దెచ్చినారము
వీరుఁడెవ్వఁడో, దెల్పుఁడీ !
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !! "

"ఉప్పు సత్యాగ్రహపు జైలు జీవితంలో నేను, ఆచార్యరంగా ఈ గేయాన్ని సంస్మరిస్తూ ఉత్తేజితులమయ్యేవారము" అన్నారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు.

ఈ గీతం స్వాతంత్ర్య పోరాటపు దినాల్లో ఆంధ్రదేశంలోని ముఖ్య పట్టణాలలోనే గాక, మారు మూలల గ్రామాల్లో సైతమూ ప్రతి ధ్వనించింది. 1930వ సంవత్సరంలో గాంధీజీ ఆధ్వర్యాన ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించబడింది, గాంధీజీ పూరించిన శంఖారావాన్ని ఆకర్షించిన కవిరాజుగారు స్వాతంత్ర్య సమర రంగంలో దూకారు. 'సత్యాగ్రహోద్యమ నిధి'కి వేలకు వేలు చందా వసూలు చేశారు. వంగీయులవలే, ఆంధ్ర ప్రజలు ఏ ఉద్యమంలో నైనా ముందడుగే గదా ! ఆంధ్ర రవీంద్రుని ప్రబోధంతో తెనాలి పట్టణ పరిసర ప్రాంతాలనుండి సత్యాగ్రహులు జట్లు జట్లుగా ముందుకు రాసాగారు. వారి కందరికీ సంతర్పణ చేయించారు చౌదరిగారు. వీర గంధంలో, అక్షతలు జల్లి అంపకం పెట్టారు. వీరరస

ప్రధానమైన ఈ గీతం ఆంధ్ర జాతిని ఉర్రూత లూగించింది. సత్యాగ్రహులు దండులు దండులు, ఉప్పెనగా ఉద్యమంలో దూకడం సాగించారు. దీనికి కారణమేమిటి? భారత నేత, జాతిపిత, అహింసామూర్తి అయిన గాంధీజీ సందేశం వాడవాడలా ప్రచారం కావడమే. అలా ప్రచారం కావడానికి కవిరాజు గారి గేయాలు ఎంతగానో ఉపకరించాయి. ఒక్క గీతం యింతగా చైతన్యాన్ని కలిగిస్తుందా? అని విస్తుపోయే వారికి ఒక్కటే జవాబు! గాంధీజీ పలికిన ఒక్కమాట యావద్భారత దేశాన్ని చైతన్యవంతం చేసినప్పుడు, మహాకవి మధుర గీతం ఆ చైతన్యాన్ని [illegible] విస్తరింప చేయడంలో ఆశ్చర్యమేముంది? ఇంతేగాదు. [illegible] సందర్భంలో సత్యాగ్రహులు పాడడానికి 'పిలుపు' అనే మరో గీతం కూడా వ్రాసియిచ్చారు చౌదరిగారు. ఆ సందర్భంలోనే వారుకూడా అరెస్టయ్యారు. వారికి ఎరియకుండానే విడుదల జరిగింది. అందుచేతనే స్వాతంత్ర్య సముపార్జనలో రామస్వామి చౌదరిగారికి ప్రముఖస్థానం వుంది.

ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసంలేని వారు దేన్నీ కొరగానట్టా చేయ లేరు. ప్రాంతీయాభిమానం లేనివారికి, దేశాభిమానం ఉందనుకోవటం కేవలం భ్రమ మాత్రమే అవుతుంది. ఐతే, ఈ ప్రాంతీయాభిమానం, దేశాభిమానానికి ప్రోద్బల కారణ మవ్వాలేగానీ, రాష్ట్రీయ దురభిమానంగా పరిణమించరాదు. అలాంటి సంకుచిత స్వభావం కలవారు కాదు కవిరాజు గారు. వారు ఎంతటి దేశభక్తులో, అంతటి స్వరాష్ట్రాభిమానులు. వారికి తెలుగు ప్రజలన్నా, తెలుగు భాషన్నా, తెలుగు దేశమన్నా అభిమానం మెండు. అందుచేతనే వారు నిద్రాణమైన తెలుగు ప్రజానీకానికి వైతాళిక గీతికలు ఆలపించారు.

'గౌతమీ నది, కృష్ణ వేణియు,
తుంగభద్రయు, సర్వదా
జీవనదులై యెండిపోవక
యెల్ల కాలము పాఱుచున్.

వీళ్ళ నన్నిటి బంట పొలములు,
పండ్లతోటలు చేయుచున్,
తెలుగుదేశం బతి సుభిక్షము
గా నొనర్చును సర్వదా

తెలుఁగు బిడ్డా! మఱవి పోకుర
తెలుఁగు దేశము పురిటి గడ్డర
కాక్కొరోక్కో పాట బాడర
తెలుగు వారల మేలు కొల్పర.'

మహోజ్వలమైన పూర్వాంధ్ర దేశపు ఔన్నత్యాన్ని స్మరించి, మధురాను భూతిని పొంది, పులకితులైన రామస్వామిచౌదరిగారు తెలుగు ప్రజలకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆంధ్ర రాష్ట్రోద్యమ మారంభం నుండీ అవిరళ కృషి చేశారు. విశాలాంధ్ర నిర్మాణమే కవిరాజుగారి ప్రగాఢ వాంఛగా గోచరిస్తుంది.

'రెండు కోట్లకు మించియుండిన
తెలుగువారల నక్కటా!
చీల్చి వైచిరి, నాలు దెసలకు,
జిమ్మివైచిరి నేటికిన్,

కొంతమంది నిజాము రాష్ట్రము
నందుఁజిక్కిరి జేలలై,
కొంతమందియు కన్నడంబున
నుండిపోయిరి దీనులై,

లెమ్ము లెమ్మిక నడుము గట్టుము
తెల్లవారల నెల్ల నీ
వొక్క రాష్ట్రమునందుఁ గూర్పఁగ
గట్టి యత్నముఁ జేయుమా!'

ప్రత్యేక రాష్ట్రం సాధనలో ఒకరిని యాచించడం ఎంత మాత్రమూ ఆయన అంగీకరించే వారుకాదు. మన నాయకులు ప్రత్యేక రాష్ట్రం సాధిస్తారని చాలాకాలం రామస్వామిచౌదరిగారు ఎదురు చూశారు. కాని ఫలితం హళ్ళికిహళ్ళి, సున్నకు సున్న అయింది. క్రోధోద్దీపితమానసులైన కవిరాజు తెలుగు ప్రజలకు ప్రబోధం చేయక తప్పలేదు. తిలకించండి.

తెలుఁగు వారికిఁ దెలుఁగు రాష్ట్రము,
తేర తేరఁగ నూడి పడునా!
ద్రవిడ మంత్రి సుఖావలోకన
భాగ్య సంపద యబ్బనప్పుడు

తెలుఁగు మంత్రులు మంత్రవిదులై
మూఁగ నోమును బట్టినప్పుడు,

తెలుఁగు శాసన సభ్యులెల్లరు
తెల్ల మొగములు వైచు నప్పుడు.

తెలుఁగుబిడ్డా ! లేవ లేవా !
వీరపాణము సేయ రావా ; !'

ఆంధ్రులలో ఐక్యత శూన్యం; బహు నాయకత్వం హెచ్చు. కొందరు ప్రత్యేక రాష్ట్రం కావాలంటే మరి కొందరు అక్కర్లేదన్నారు. చారిత్రకంగా చెన్నపట్టణం తెలుగు వారిది. కాబట్టి చెన్నపట్టణం రాజధానిగా గల ఆంధ్ర రాష్ట్రం ఏర్పడాలి అన్నారు కొందరు నాయకులు. ఇంకా కొందరు నోరు మెదిపితే ఏమౌతుందో భగవంతుడాయని మౌనం వహించారు. ఈ విచిత్రమైన వైరుధ్యాన్ని రామస్వామి చౌదరిగారు ఈ సూతాశ్రమ గీతాలలో మహా చక్కగా చిత్రించారు ;

'ఆంధ్ర కేసరిరేయిఁ బవలును
గుహల నిద్దుర బోవునప్పుడు,

.... .... ....

చెన్న పట్నము వదలి పెట్టగఁ
సాహసింపక యున్న యప్పుడు.

.... .... ....

గద్దె యెక్కిన గద్దె వారలు
గద్దరింపులు మానినప్పుడు,

నిలువు మీసము పైని నుండిన
నిమ్మకాయలు జాఱు నప్పుడు,
అరవ సచివుని మాటలనుచో
నులికి పాటును బొందునప్పుడు.

.... .... ....

ఏమి చెప్పిన నేమి వచ్చునో
ఏమిరా భగవంతుడా యని
తెలుఁగు డాక్టరు తెలుఁగు దేశపు
నాడిఁ జూచుచు విల్చునప్పుడు

.... .... ....

రెడ్డి దొర గురు పాదులకు జే
జేలు పెట్టుచు విల్చునప్పుడు.
తెలుఁగు రాష్ట్రము పనికి రాదని
తెల్ప నేర్చితి ననెడు నప్పుడు

.... .... ....

తెలుఁగు పత్రిక లసలె పుట్టుట
మానివేసితి ననెడి నప్పుడు.

.... ........ ........

ఆంధ్ర రాష్ట్రము గూర్చి యాంధ్ర మ
హర్షి యేదియు చెప్పనప్పుడు'

ఆంధ్రరాష్ట్రం ఎలా వస్తుంది? కాబట్టి కుటిల రాజకీయ నాయకుల మాటలకు మోసపోవద్దని యావదాంధ్రజాతికి హెచ్చరిక చేశారు చౌదరిగారు:

'తోడుఁ బోతుల సమ్మనేలా ;
కాడఁ పలిచిరి యనఁగనేలా
తోడుతోడన్ నడుముగట్టిన
నూడిపడదే తెలుఁగు రాష్ట్రము :

మొక మొగంబులఁ జూడనేలా
రికరకంబులఁ జూడనేలా !
ఊరుఉకమును ఒక్కటయితే
ఊడిపడదా తెలుఁగురాష్ట్రము !!'

కవిరాజుగారి అసలు హృదయం, చివరి చరణాలలో బయట పడింది. ప్రజలకు నాయకత్వం కావలసిందే! కాని ఆ నాయకత్వం ప్రజా క్షేమం కన్నా, తమ స్వార్థమే ఎక్కువగా భావించినప్పుడు ప్రజలు నాయకులను క్షమించరని, క్షమించకూడదని చౌదరిగారి ఉద్దేశ్యం. అలాంటి విపరీత విపత్కర పరిస్థితి సంభవించినప్పుడు, నాయకత్వాన్ని కాదని, ప్రజలు ఐక్యతతో ముందుకు సాగాలంటారు. ఈ ప్రబోధం ఫలితంగా

ప్రజలలో ఆందోళన బయలుదేరింది. నాయకత్వం - కదలి పోయింది. కవిరాజుగారు తలంచినట్లుగానే పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతితో యావదాంధ్రజాతి ఏకోన్ముఖమై 1-10-53న ఆంధ్రరాష్ట్రం సాధించింది. అదే ఆంధ్రప్రదేశ్ అవతరణకు దారి తీసింది.

రామస్వామి చౌదరిగారు ప్రాచీనాంధ్ర నాయకుల పౌరుష పరాక్రమాలను, సాహసకృత్యాలనూ గురించిన కథలు మహాసరదాగా చెపుతుండేవారు. ఆంధ్రత్వం పూర్తిగా మూర్తిభవించిన వ్యక్తి కవిరాజుగారు. వారు మిక్కిలి ధైర్యసాహసాలు కలవారని చెప్పడానికి ఒక్క సంఘటన వివరిస్తే సరిపోతుంది.

ఒకప్పుడు తంజావూరులో జస్టిసుపార్టీ సమావేశాలు జరిగాయి. అప్పుడు జస్టిసుపార్టీ నాయకుడు మునుస్వామి నాయుడుగారు, మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా వున్నారు. నాయకత్వానికి బొబ్బిలిరాజా పోటీ చేయాలని సంకల్పించారు. ఆ మీటింగు జరక్కుండా చేయాలని కొందరు తలపెట్టారు. ఆనాటి సమావేశానికి ఎక్కువ మంది ప్రతినిధులు మునుస్వామి నాయుడుగారి పార్టీకి చెందినవారే హాజరవడంవల్ల, మీటింగు ఏర్పాటు చేయడంలో కొంత ఆలస్యం జరిగింది. సమావేశం జరగకుండా వాయిదా పడుతుందని పుకారుకూడా చెలరేగింది. ప్రజలు ఉద్రేకపూరితులయ్యారు. అందరికంటె ముందుగా రామస్వామి చౌదరి గారు కోట గోడలు దూకి హాలులో కెళ్ళారు. ప్రతినిధులంతా చౌదరి గారిని అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకొని కొన్ని తీర్మానాలు ఆమోదించారు. తరువాత సమావేశము సమాప్తమయింది. అందుచేతనే కవిరాజుగారు తెలుగువారు పిరికి వారు కాదంటూ 'తెలుగు జోదులు' అనే గీతం వ్రాశారు.

'కంచి కోటలు కంచి తలుపులు
ఖంగు ఖంగున మ్రోగునప్పుడు
తంజ నగరపు కోట గోడలు
చెంగున చెంగునఁనెగురు నప్పుడు

తిరువటంబునఁ జేర సేనలు
కెవ్వు కెవ్వున నరుచు నప్పుడు
మధుర కోట యగడ్త లన్నియు
జివ్వు జివ్వున దూఁకునప్పుడు

తెలుఁగు వారలు పిఱికి వారలో
తెలుఁగు బిడ్డా ! తెలుసు కొనుమా !'

దేశ చరిత్రలయొక్క ప్రయోజనం మన పూర్వులకు అట్టే తెలిసినట్లు కనుపించదు. అందుచేతనే, సరియైన ఆంధ్రుల చరిత్ర వారు వ్రాసియుండలేదు, ఇది జాతిపురోగమనానికి ఆటంకంగా పరిణమించింది. చారిత్రక జ్ఞానం లేకపోతే, స్వార్థపరులైన అగ్రజాతి ఏ అసత్యం ప్రచారంచేసినా అది సత్యంగా చెలామణి ఔతుందని గ్రహించారు రామస్వామిచౌదరిగారు. ప్రజలు చారిత్రక దృష్టి అలవరచుకోవలసిందిగా పదే పదే నొక్కి వక్కాణించారు. * 'కళా నైర్మల్యం వడగట్టేందుకు చారిత్రక దృష్టి అవసరం. చాలామంది రచయితలలో అది అరుదు. రామస్వామిగారికి మాత్రం ఇది బిరుదు' అన్నారు శ్రీరంగం నారాయణబాబు. చౌదరిగారు ఎంత ఘనత వహించిన కవులో, అంత చారిత్రక పరిశోధకులు కూడానూ. వారు భారత దేశచరిత్రనే కాక, ప్రపంచచరిత్రనుకూడా కూలంకషంగా పరిశోధించారు.

* సన్మాన సంచిక

ఇందులకు వారి గ్రంథరాజములు పితకలే ప్రబల నిదర్శనం, చారి త్రక సంఘటనలకు విరుద్ధంగా వున్నవాటిని 'పిట్ట కథల' క్రింద జమకడు తుండేవారు. అది కారణంగానే వేదం వేంకటరాయశాస్త్రిగారి 'ప్రతాప రుద్రీయము'ను ఈ గీతాలలో నిశితంగా విమర్శించారు చౌదరిగారు. ప్రతాప రుద్రీయం చారిత్రక నాటకమని భావించబడుతున్నది. కాని అందలి ఇతి వృత్తం చరిత్రకు భిన్నంగా ఉండి అనేక అభూత కల్పనలతోనూ, అస్వాభా వికమైన పాత్రలతోనూ నిండివుందని ప్రముఖ నాటకకర్తల అభిప్రాయం. అందులోని ప్రతాపరుద్రుడు, యుగంధర మంత్రి, సుల్తాన్, పేరిగాడు మొదలయిన పాత్రలు స్వభావసిద్ధంగా లేవు. పేరిగాడు, యుగంధరుడు చారిత్రక పురుషులు కానేకారు. ఈ నాటకంలోని సంభాషణలు కృతిమం గానూ, సంఘటనలు వాస్తవజగత్తుకు అతీతంగానూ ఉన్నాయి. ఢిల్లీలోని గంగానదిలో ఓడలు వెళ్ళటం, వాటిలో సౌదాగర్లు మకాం చేయటం లాంటివి చారిత్రక సంఘటనలు కానే కావు. పిచ్చివాడి చేష్టలు, పేరిగాడి కథ, సుల్తాన్ కథ జరిగినట్లు విశ్వసించడానికి వీలులేకుండా వున్నాయి. వాస్తవ జగత్తుకు దూరమయిన ఈ నాటకంలో చారిత్రకమయిన, భౌగోళిక మయిన తప్పులు, కుప్పలు తెప్పలుగా ఉన్నాయని తలంచారు రామస్వామి చౌదరిగారు. తెలుగుబిడ్డకు సరియైన తెలుగు చరితను తెలిసికోవలసిందిగా సలహా యిచ్చారు :

'ఢిల్లీ దగ్గర గంగ యుండెనా ??  
గంగయొడ్డున ఢిల్లి యుండెనా ??  
గంగమీఁదను బడవ యెక్కిన  
ఓరుగంటిని జేరఁగలదే ?

ఔర ! వేంకటరాయ శాస్త్రీ !
ఔర ! వేంకటరాయ శాస్త్రీ !!
ఎంత బొంకును బొంకిపోతివి
చచ్చి యెచ్చట నుంటివోకద.

తెలుఁగు బిడ్డా ! తెలుగు చరితను
నేఁటికైననుఁ దెలిసికోరా !!'

తెలుగు రాజుకూ, తెలుగు ప్రజలకూ అపఖ్యాతి నార్జించే కథలు, గాథలు ప్రచారం చేయివద్దన్నారు. యుగంధరుడు, జనార్ధనుడు అనే బ్రాహ్మణ మంత్రులుగాని, పేరిగాడనే పెద్ద చాకలిగాని ప్రతాపరుద్రుని కొలువులో లేరన్నారు. ప్రతాపరుద్ర మహారాజును బందెనుండి విడిపించిందొక బ్రాహ్మణేతర దండనాధుడని, ఆతనికి 'రాయబంది విమోచకుండు' అనే బిరుదు గలదని, అతణ్ని ప్రజలు నేటికి పూర్తిగా విస్మరించారని తెలియచేశారు. బందెపోయిన ప్రతాపరుద్రుడు బైటపడి, అవమానంతో, సిగ్గుతో, సింహాసనం మరల అధిష్ఠించలేదన్నారు. గౌతమీ నది సమీపంలో తపస్సు చేస్తూ జీవిత శేషం గడిపారన్నారు. ఓరుగంటిని తిరిగి ఒక్కనాడు కూడా చూడలేదన్నారు.

"ఇలాంటిదే మరో తెలుగురాజుకు అపఖ్యాతి నాపాదించిన కథ; అదే సారంగధరుని కథ. ఇది మాళవదేశానికి సంబంధించిన గాథ. మాళవ దేశాన్ని పరిపాలించిన రాజరాజ నరేంద్రునకు సారంగధరుడు అనే కుమారు డున్నాడనీ, కేవలం నామ సామ్యంచేత తెలుగు రాజయిన

రాజరాజుకు ఈ కథ అంటగట్టబడిందనీ భావించిన రామస్వామిచౌదరిగారు యథార్థమైన సారంగధరుని చరిత్రను ప్రజలకు తెలియచేశారు.

'లేదు సారంగధరుడని యెడి
సుతుడు, రాజనరేంద్రుకున్
లేదు రత్నాంగి యను భార్యయు,
లేదు చిత్రాంగి యను వేశ్యయు,

తెలుఁగుదేశపు జరిత గాదిది,
తెలుఁగు రాజుల చరిత గాదిది,
వట్టి బూటంమయ్యె నీ కథ,
పిట్టకథయే : పిట్టకథయే : :

తెలుఁగుబిడ్డా : తెలుఁగు చరితను
దెల్పుచుంటివి దెలిసికొనుమా : :'

సామాన్య మానవునికి, అసాధారణ ప్రజ్ఞగల కవికి ప్రధానమయిన భేదం ఒక్కటున్నది సామాన్యుడు సత్యాసత్యాల జోలికి పోకుండా ఆయిష్టంతోనే అన్నింటినీ భరిస్తాడు. కవి అలా సహించలేడు. అతని దృష్టి సత్యం మీద లగ్నమై ఉంటుంది. తాను సత్యమని విశ్వసించిన విషయాన్ని పదిమందికి తెలియజేయాలని కాంక్షిస్తాడు. అలా తెలియ జేసేవరకూ అతని ఆరాటం ఉపశమించదు. రామస్వామిగారు ప్రతాప రుద్రీయ నాటకాన్ని విమర్శించిన తొలిరోజుల్లో తెలుగునాట బ్రాహ్మణ వర్గం, దాని అనుయాయులు చేసిన గల్లంతు, గందరగోళం ఇంతా-అంతా

కాదు. సారంగధరుని గురించిన 'సత్యం' వెల్లడించిన కొద్ది కాలానికి "కంపిలి శాసనం' బయటపడింది. రామస్వామి చౌదరిగారు చెప్పిందే సత్యమని మరోసారి రుజువయింది:

కవిరాజుగారి హృదయం అతి విశాలం. ఆయన హృదయంలో రాష్ట్ర వాంఛ, దేశ సమైక్యత, అగ్రజాతుల నిరంకుశత్వాన్ని ఎదుర్కోవడం, దేశభక్తి మొదలయిన భావాలన్నీ సమన్వయించబడ్డాయి.

ఈ సూతాశ్రమ గీతాలలోని భాషలో పటిమ, భావనలో బలము ఉన్నాయి. శైలి ఆపాత మధురంగా ఉంది గీతం అమృత స్రవంతిగా రూపొందింది. అందుచేతనే కవిరాజుగారి గేయ రచనా సంవిధానాన్ని సాహితీ వేత్తలే గాక, రాజకీయ నాయకులు కూడా కొనియాడారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ అభిప్రాయాన్నిలా వ్యక్తీకరించారు. 'మా రోజుల్లో పోలీసుల జులుం బహుజాస్తిగా ఉండేది. కాంగ్రెసు వాలంటీర్లు ఎంతగా ప్రచారము చేసినప్పటికిన్ని పోలీసులకు భయపడి, ప్రజలు మా మీటింగులకు అంతగా వస్తూఉండేవారు కాదు. ఒకసారి ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, కవిరాజుగారి సూతాశ్రమ గీతాలను నాకు చూపించారు. అవి నాకెంతో మహదానందాన్నిచ్చాయి. నలుగురు వాలంటీర్లకు వాటిని పాడటం నేర్పాము. 'వీరగంధము తెచ్చినారము....' పాటపాడుతూ వాలంటీర్లు వీథుల్లో తిరుగుతూ వుంటే, ప్రజ అసంఖ్యాకంగా వారివెంట బయలుదేరేవారు. ఆ తరువాత మేము మీటింగులు చేసేవారము. చౌదరిగారి గీతాలు అందకుంటే-మా ఉపన్యాసం

ప్రజలలోకి అంత త్వరితగతిలో వెళ్ళేది కాదు. కవిగా రామస్వామిచౌదరి స్వాతంత్ర్య సమరానికి చేసిన సేవ బహు దొడ్డది.'

గాంధీజీ సిద్ధాంతాలకు భాష్యకారులైన డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు యిలా అన్నారు: "స్త్రీలు, పురుషులు, బాల బాలికలు కాంగ్రెసులో చేరవలెనన్న, ఆ దినములలో చాలా కష్టముగా ఉండెడిది. కొండా వెంకటప్పయ్యగారు కాంగ్రెసు ప్రచారము ముమ్మరముగా చేయుచున్నారనియు, అటులనే నీవును చేయవలయుననియు బాపూజీ నాతో ఒకసారి యనిరి. నేను బాపూజీని కారణమడిగితిని. దేశభక్తి ప్రబోధితములయిన గేయములతో కొండావారు చైతన్యము కలిగించుచున్నారని గాంధీజీ యనిరి. నేను వెంకటప్పయ్య పంతులుగారికి వెంటనే ఒక జాబు వ్రాసితిని. వారు ప్రత్యుత్తరముతో నాటు, రెండు పాటలను నాకు పంపినారు. క్రింద కవి పేరు లేదు. మా కాంగ్రెసు వర్కర్లకు కూడా వానిని పాడమని ఆదేశించితిని. కొన్ని రోజుల తరువాత ఆ పాటలు వ్రాసినవారు కవిరాజు త్రిపురనేని రామస్వామిగారని నాకు తెలిసినది. అప్పుడే వారిని అభినందిస్తూ ఒక లేఖ వ్రాసితిని. దేశభక్తి ప్రపూరితములయినవారి గీతాలు మా శ్రమను చాలావరకు తగ్గించినవి"

మధురకవి నాళం కృష్ణారావుగారు 'నేను కవిత్వం అల్లినాను. సన్మానాలు చేయించుకొన్నాను. బిరుదులు పొందాను. కాని, కవిత్వమనేది-సూటిగా ప్రజల హృదయ కుహరాంతరాలలోకి చొచ్చుకొని పోయేదిగా ఉండాలి. వారిని కదిలించాలి. ముందుకు నడిపించాలి. ఆ పని చాలా మందికన్నా కవిరాజుగారు ఎంతో ఘనంగా చేశారు. వారు కొంత మందికి

బాధకలిగించారని చెబుతారు. 'యదార్థవాదీ, లోక విరోధి' అను సామెత వుండనే వుంది గదా! సత్యం ఎప్పుడూ బాధగానే ఉంటుంది. అనుకొని లాభంలేదు. బాధపడ్డా, ఓ సత్యం తెలిసికొన్నామన్న సంతృప్తి లభిస్తుంది. చాలామంది కవితలలో ఈ సంతృప్తికి ఆస్కారం లేదు' అన్నారు.

కోటంరాజు రామారావు గారు 'నాకు, కవిరాజుగారికి చాలా పోలిక లున్నాయి. మెత్తగా, సున్నితంగా చెప్పడం ఇద్దరికి చేతకాదు. అందుకనే కవులు ఆయనను, జర్నలిస్టులు నన్ను. దూర దూరంగా ఉంచుతారు. దేనికీ భయపడక పోవడం మా ఇద్దరి ప్రకృతి. నాకు, వారికి గూడా చిరాకు జాస్తి. ఆయన ప్రజలను సత్యపథంలో నడపించడానికి కవిత్వం చెప్పారు. నేను వచనం వ్రాశాను. కవిరాజుగారి మరణంతో తెలుగు సాహిత్య రంగంలో ఏనాటికి భర్తీ చేయలేని లోటు ఏర్పడింది. అలాంటి వారు ఇంతవరకు తెలుగుదేశంలో జన్మించియుండలేదు; ఇకముందు జన్మిస్తారన్న ఆశలేదు....' అన్నారు.

రామస్వామిచౌదరిగారు 'ప్రతాప రుద్రీయము' మీద వ్రాసిన విమర్శనా గేయాన్ని చదివిన, దువ్వూరి రామిరెడ్డిగారు * 'నాటకము-చరిత్రము' అని ప్రతి విమర్శనా వ్యాసమును వ్రాశారు. 'చౌదరిగారు ఢిల్లీ యెక్కడ, గంగ యెక్కడ? అని ప్రశ్నించినారు. నాటక ప్రపంచ మును యథార్థ ప్రపంచదృష్టితో చూడజనదు. నాటకమును కొన్ని కవి సమయములకును. కళా నియమములకును లోబడియున్న అనన్యపర తంత్రమయిన సృష్టి" అన్నారు కవికోకిల రామిరెడ్డిగారు. చరిత్రను నాటక కర్త ఎంత వరకు మార్చవచ్చును? అను విషయాన్ని చర్చిస్తూ

ఫ్రెంచి, జర్మను కవుల అభిప్రాయాలను ఉదహరిస్తూ, 'నాటకము చరిత్రకు భిన్నముగ నున్నదని విమర్శించుట పొరపాటు కాగలదు,' అన్నారు రెడ్డిగారు. ఈ ప్రతి విమర్శ వ్రాసిన రెండు నెలల తదనంతరం కవిరాజుగారిని తెనాలిలో కవికోకిల రామిరెడ్డిగారు కలుసుకోవడం జరిగింది. * వారిద్దరూ ఈ సమస్యను ముఖాముఖిగా చర్చించారు. ఆ సందర్భంలో రామిరెడ్డిగారితో 'చరిత్రను మార్పుచేసి వ్రాసే హక్కు నాటకకర్తకు ఎంతవరకుందో, అంతమేరకూ, ఆ నాటకంలోని అసందర్భాలను ఇతివృత్తంగా గైకొని కవిత్వం చెప్పే హక్కు కవికి ఉంది' అన్నారు చౌదరిగారు. వారి తార్కికధోరణి రామిరెడ్డిగారిని ఆశ్చర్య చకితులను చేసింది. ఈ సంభాషణల అనంతరం, రామిరెడ్డి గారు 'సూతాశ్రమ గీతాల' ను గురించి ఇలా అన్నారు : 'కవిరాజుగారి గ్రంథ పఠన మొకయెత్తు. వారితో సంభాషించుట మరియొక యెత్తు. వారి నిరంతర గ్రంథ పఠనము, గ్రంథరచనము, వాసనా కౌశలము నన్నాకర్షించినవి. కవిరాజును 'బ్రాహ్మణేతర కవి' యని తూలనాడు వారికి, వారి శక్తి సామర్థ్యము లేమియు తెలియవని యూహించ్చును. పద్య, గద్య రచనములందు వారి శైలి యపూర్వము. సాంఘిక చైతన్యము ను గలిగించుటకు ఈ గీతము లెంతేని అవుసరము. ఈ తీరు మహాకవుల యవుసర మాంధ్రావని కెంతేని గలదు.''

ఆంధ్ర సాహిత్య నందనోద్యానంలో పూచిన సురభిళ ప్రసూనాలు ఈ సూతాశ్రమగీతాలు.

---

* కవికోకిల గ్రంథావళి

* 9-7-1935

కవిరాజు డైరీ పుటలనుండి.

# శతకవాఙ్మయం

శతకవాఙ్మయం మనకు ఈనాటిది కాదు. ఋగ్వేదకాలంనుండీ ఉన్న దాఖలా లున్నాయి. శతక రూపానికి బీజమనదగిన ఒకే మకుటం గల ఋక్కులు ఋగ్వేదంలో ఉన్నాయి. లెక్కసరిగా నూఱు పద్యాలతో వ్రాయబడ్డ గ్రంథాలు ప్రాకృతభాషలో కూడా ఉన్నాయి. సంస్కృతంలో భర్తృహరి విరచితమైన 'సుభాషిత త్రిశతి' సుప్రసిద్ధమైనదే. మయూరుడు ఒకే ఒక్క శతకాన్ని వ్రాసి మహాకవి అనిపించుకున్నాడు. సంస్కృతంలో కాకుండా, తెలుగుసాహిత్యంలో కూడా, కొన్ని వందల సంవత్సరాలనుండి శతకరచన సాగుతూ నానాటికి ఉజ్వలంగా విలసిల్లుతూ ఉంది. ఇప్పటి వఱకూ ప్రచురించబడ్డ శతకాల సంఖ్య రమారమి వెయ్యిదాకా ఉంటుంది. ఒక మకుటాన్ని ముందుగానే ఎన్నుకొని, అన్ని పద్యాలకూ చివరి పాదంలో అదే మకుటం వచ్చేలా శతకం రచించబడుతుంది. సాధారణంగా మత్తేభము, శార్దూల విక్రీడితము మున్నగు ఒకే విధమగు వృత్తమునందో, కందము, సీసమూ మొదలగు జాతులందో శతకం రచించబడుతుంది.

ఈ శతక వాఙ్మయం భక్తి, నీతి, శృంగార, వైరాగ్యమని అనేక విధాలు. కేవలం తమ ఆరాధ్య దైవాన్ని స్తుతిస్తూ కొందరు శతకాలు వ్రాశారు. పండితారాధ్యుని శివతత్వసారము, పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము ఇలా వ్రాయబడినవే. తమ హృదయాంతరాళాల్లోనుండి ఉప్పొంగివచ్చే భక్తిని ప్రబోధిస్తూ మరికొందరు వ్రాశారు.

ధూర్జటికవి శ్రీ కాళహస్తీశ్వర శతకమును, కంచెర్ల గోపన్న దాశరథీ శతకమును, గోగులపాటి కూర్మనాధకవి సింహాద్రి నారసింహ శతకమును. నృసింహకవి కృష్ణశతకమును, మారన భాస్కర శతక ములను ఇందులకు ఉదాహరణంగా చూపవచ్చు. ఇంకొందరు సమాజంలో నైతిక విలువలను నిలబెట్టడానికి శతకాలు వ్రాశారు. కొన్ని శతకాలు ఆయా కవుల స్వీయపరివేదనను వెల్లడించడానికి వ్రాయబడ్డాయి. హృదయ పరితాపాన్నే కాకుండా, మత, వేదాంత విషయాలను వివరించే శతకాలు కూడా ఉన్నాయి. ఇవన్నీ మహోదాత్తమైనవి కాకపోవచ్చు. కాని ఆయా పరిధుల్లో వాటి పని అవి చేసుకు పోయిన గ్రంథాలు వీటిలో చాలా ఉన్నాయి. ఐతే, ఇవన్నీ జనసామాన్యపు పరిధుల్లోకి వెళ్ళలేక పోయాయి. దీనికి కారణం శతకాల పట్ల నిరాదరణ చూపడమే. అప్పకవి శతకాలను క్షుద్రకావ్యాల క్రింద జమకట్టాడు. అయినప్పటికి కొన్ని శతకాలు వాటి ప్రత్యేక వ్యక్తిత్వం వల్ల ప్రజాదరణను పొందగలిగాయి.

తెనుగు నాట అమిత ప్రచారంలో ఉన్న శతకాలు రెండు—ఒకటి సుమతీ శతకం — రెండవది — వేమన శతకం. కాళహస్తీశ్వర శతకం, దాశరథీ శతకం కూడా ప్రచారంలో వున్నప్పటికీ, పై రెండిటికి వున్న బహుళప్రచారంతో పోల్చిచూచినప్పుడు వీటస్థానం చాలాతక్కువగానే కనిపిస్తుంది. అయితే, ఈ రెండు శతకాలకూ ఇంతటి ప్రాచుర్యం ఎలా వచ్చింది? సాంఘిక జీవనాన్ని ఈ రెండు శతకాలూ సరిదిద్దటానికి ప్రయత్నించటమే ముఖ్య కారణంగా కనిపిస్తున్నది. అక్షరాస్యులు కాని వ్వండి, నిరక్షరాస్యులు కానివ్వండి, సుమతీ శతకంలోని పద్యం కనీసం ఒక్కటైనా రాని తెలుగువాణ్ణి చూపటం కష్టమే! అదే విధంగా వేమన

పద్యం ఒక్కటీ రావి తెలుగు వాణ్ని చూపటం అంతకన్నా మరీ కష్టం కేవలం నీతిబోధకంగా వుండటంవల్లనే వీటికింత ప్రచారం వచ్చిందనటం పూర్తి సత్యంకాదు; అర్థ సత్యం మాత్రమే. ఇంతకు మించిన వేదాంత సారంలో కూడిన శతకాలు బోలెడున్నాయి! మరి వాటి మాటేమి టంటారు? భాషా విషయికంగానైతేనేం, కవిత్వపరంగా నైతేనేం, వీటితో తులతూగగలవీ — కొన్ని సందర్భాలలో వీటిని మించగలవీ కూడా ఉన్నాయి. అవన్నీ సామాన్య ప్రజల కందుబాటులో లేకుండా పోయాయి. వారి కర్థమయ్యే విధంగానూ, జానపద గేయాలవలే పాడుకోడానికి వీలుగా లేక పోవటమే ఇందులకు కారణం. మరోటేమిటంటే, చెప్పదలచుకున్న నీతి–లేదా–ధర్మం–లేదా ఉద్బోధ–ఏదైనా కావివ్వండి. అది రమణీయంగా ప్రతిపాదించటం అవసరం. సామాన్య పాఠకుని అవి ఇట్టే హృదయానికి హత్తుకొనేలా ఉండాలి. వారి నిత్య జీవితాలకు సన్నిహితమైన ఉదా హరణలతో జోడించి చెప్పినప్పుడు ప్రజలు తప్పకుండా ఆలకిస్తారు. ఆచరిస్తారు కూడాను. సుమతీ శతకంలో ఈ గుణం ఉంది. ఇక, వేమన శతకం తేట మాటలతోను, ఆటవెలదులతోను, సులభశైలితోను, సూటి సూక్తులతోను ఉండటమే కాకుండా మనోరంజకంగా కూడా ఉంది.

'ఉప్పు కప్పురంబు ఒక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేఱు'

* * *

'అల్పుఁడెపుడుఁబల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను'

అని మాత్రమే వేమన వ్రాసివుంటే ఈ పద్యాలు ప్రజల దాకా వచ్చి ఉండేవి కాదనుకుంటాను. మూడవ పాదంలోనే వేమన తన కవిత్వ మహత్వాన్ని ప్రదర్శించాడు. 'పురుషులందు పుణ్య పురుషులు వేరయా' 'కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?' అనటంతో వేమన తారక స్థాయినందుకున్నాడు. సామాన్య ప్రజలకు అర్థమయ్యే చక్కటి ఉప మాలంకారాలను ప్రయోగించి ప్రజా హృదయాలను చూఱగొన్నాడు. ఇది ప్రజా కవిత్వానికి గుర్తు. ఈ బాటలో మహాకవి వేమన తన సంస్కారాన్ని అభివ్యక్తీకరించాడు. ఆనాటి సాంఘిక దురాచారాలను దూయబట్టాడు. మతం పేరిట, దైవం పేరిట జరుగుతున్న అత్యాచారాలను గర్హించాడు. మౌనం, డాంబికం లేకుండా జ్ఞానం అలవఱచు కోవాలన్న భావాలు వేమన శతకంలో కోకొల్లలుగా వున్నాయి.

## కుప్పుసామి శతకం

వేమన పలె రామస్వామిచౌదరిగారు ప్రజాకవులుగానే ప్రసిద్ధికెక్కారు. ప్రజల శ్రేయస్సుకొఱకే కవితను వారు సాధనంగా ఉపయోగించారు. అందుచేత సంస్కరణకు వేమనయోగి మార్గాన్నే చౌదరిగారు అవలంబించారు. మూఢ విశ్వాసాలలో మునిగి తేలుతున్న సమాజంలో నీతి మృగ్యమౌతున్నదని వారు గమనించారు. నీతి లుప్తమైతే అభ్యుదయ పథంలో మానవుడు పురోగమించ జాలడని వారు గ్రహించారు. తేటతెల్లమగు తెనుగు నుడికారంతో కుప్పుసామి శతకంపేర 'కందలు' కూర్చారు.

ఈ శతకంలోని మొట్టమొదటి పద్యమే మనలను ఆశ్చర్య చకితులను చేస్తుంది. మన ఆలోచనలను రెక్కలిప్పి, సత్యం ఆలోచించమంటుంది. అందరికీ తెలిసినదైనప్పటికీ పాఠకుల సౌకర్యార్థం దాని నిక్కడ పొందు పరుస్తున్నాను.

తే॥ 'గొంటరులఁ దుంటరుల గుమిగూర్చి సృష్టిఁ
జేసి చీటికి మాటికి గాసి వారు
తన్నుకొని చచ్చుచుండగఁ దవియ చూడు
గొప్పవానికి జేజేలు కుప్పసామి'.

సమస్త సృష్టి భగవంతునిదే నంటున్నారు పెద్దలు. 'శివుని ఆజ్ఞ లేనిదే చలిచీమయినా కుట్టదు' అన్న సామెత మనకు ఉండనే ఉన్నది. భగవంతుడు నిర్వికారుడు, నిరంజనుడు అంటున్నారు. అయినప్పుడు సృష్టిలో ఇంత మంది తుచ్ఛులు, నీచులు, దుర్మార్గులు, అసత్యవాదులు, అధర్మవాదులు, హంతకులు, కృతఘ్నులు, ఘాతకులు, జారులు, చోరులు ఎందుకుంటున్నారు? పరస్పర హననోద్రేకంతో ప్రాణులిట్లా ఎందుకు నిరంతర సమరాగ్నిలో మ్రగ్గిపోతున్నాయి? దీనికి కారణమేమిటి? నిర్వికారత నుండి వికారాకారత జనించటానికి ఆస్కారం లేదే! అలాగే నిరంజనత నుండి, రంజనత ప్రాదుర్భవించటానికి అవకాశం లేదే! బంగారం నుండి మరో లోహం పుడుతుందా మరి? లేదుగదా! ఈ సృష్టి భగవంతునిదే అయివుంటే—అతనిలో లేని— లేవని చెప్పబడుతున్న దుర్గుణాలన్నీ అతని సృష్టిలోకి ఎలా వచ్చాయి? వీటికి సమాధానం చెప్పవలసి ఉంటుంది.

కాబట్టి___ ఇది భగవంతుని చర్య కాదని మనం ఆలోచించుకోవలసి ఉంటుంది. ఒకవేళ భగవంతుడే అనుకొన్నా- అతగాడు స్వార్థపూరితులైన అగ్రజాతి చిత్రిస్తున్న భగవంతుడు మాత్రం అయివుండడు. ఇంత ఆలోచనా మనకు కలిగి తీరుతుంది. ఇక రెండవ పద్యం దగ్గరకొచ్చేసరికి మనకు స్ఫురించే సందేహాలు ఇన్నీ—అన్నీకావు

తే. 'ఏడొ, పద్నాలుగో, మూఁడో యెన్నొ, జగము
లెల్ల సృష్టించినటువంటి యీశుఁడొకరొ
యిర్వురో, యెందఱో వారికెల్ల వేఁడి
కోళ్ళనర్పింతు భక్తితోఁగుప్పసామి'.

ఇన్నిటికీ మనవారు చెబుతున్న లోకాల సంఖ్య ఇంకా అంతిమ నిర్ణయం కానట్టే ఉంది. మూడు లోకాలని కొందరంటే, కాదు ఏడు లోకాలని మరికొందరు, పన్నాలుగని ఇంకొందరూ దెబ్బలాడుతున్నారు. పోనీ, దాని కర్మానికి దాన్నొదిలి పెడదామన్నా — వీటన్నింటికీ కర్త ఎవరో మనకు తెలియకుండా ఉంది. ఆదిశక్తి అని కొందరు, బ్రహ్మ అని మరికొందరు, విష్ణువేనని ఇంకొందరు — ఈ గొడవలతో చస్తున్నాం. ఈనాటి రాజకీయ వాదుల్లో కానవస్తున్న పదవీ వ్యామోహ పరత్వానికి, ఆనాటి దేవతల చరిత్రకు తేడా ఏమీలేదు; అవునా ?

రామస్వామి చౌదరిగారి అభిప్రాయాలను తెలియ జేయటానికి మరికొన్ని పద్యాలను పరిశీలిద్దాం.

మనతో మాట్లాడే వారందరూ మన స్నేహితులు కారు. పూసు కొని తిరగని వారు మన విరోధులు కారు. స్నేహితులమంటూ మన చుట్టూ 'మంద' ఎప్పుడు ఏర్పడుతుందో కవిరాజు చెబుతున్నారు:

తే. 'పూలు వెగ(బూసినప్పుడు మూగు(చుండు
దేనెటీ(గలు పైబడి తేనె కొఱకు
స్నేహితులు కొందరీతి( జేరుచుంద్రు
రప్పుడప్పుడు కవిపెట్టు కుప్పుసామి'.

ఏకీభావం లేనిదే స్నేహమనం ఉండదంటారు కవిరాజు. దీన్నే మనం "కార్య కారణ వాదం" అనికూడా చెప్పుకోవచ్చు. వారేమంటారంటే—

తే. "పండ్లచెట్ల క్రిందకు నెట్టి బాలసారి
యూఱకేరా(డు ఫలమును గోరివచ్చు
వానికొక కంట(గనిపెట్ట వలసియుండు
గోలకాకుండ సుంతైన( గుప్పుసామి.'

కొంతమంది అయాచితంగా మనకు సలహా లివ్వబోతారు. వారి సలహాల వలన ప్రయోజన ముంటుందన్న విశ్వాసం మనకుండాలే గాని మనం తప్పకుండా అడుగుతాం. అడగ లేదంటే వారిమీద ఆ నమ్మకం మనకు లేదన్న మాటే! మనం పిలవకుండానే వచ్చి పెద్దమాటలు చెప్పే వాణ్ణి విశ్వసించ కూడదు. అతని సలహా వలన ముప్పు గలుగుతుంది గాని మేలు చేకూరదు. దీన్నే కవిరాజుగారు ఇలా అన్నారు:

ఆ॥ 'పిలువకుండ వచ్చి పెద్దమాటలు చెప్పు
వానినెపుడు నమ్మవలదు, వలదు
మేలు కలగఁబోదు మెఱమెప్పుల కతండు
తప్పుచెప్పు మూఢుఁ గువ్వసామి'.

ఒక రకం మనుష్యులున్నారు. వారు మన శత్రువుల్నే కానీయండి— మన ముందు తెగ మూషిస్తూ ఉంటారు. మన సానుభూతిని సంపాదించాలని ప్రయత్నిస్తూ ఉంటారు. అటువంటి వారిపట్ల ఎలాంటి అప్రమత్తతతో ప్రవర్తించాలో చౌదరిగారు చెబుతున్నారు :

తే॥ 'పరుని నీ ముందుఁ దిట్టెడువాడు నిన్ను
నొరుని ముందటఁ దిట్టక యుండఁబోడు
చనవు రవ్వంత వాని కొసంగరాదు
ముప్పువచ్చుఁ దప్పక దానఁ గువ్వసామి'.

కొంతమందిలో అసూయ, ద్వేషం హెచ్చు మోతాదుల్లో ఉంటాయి. వారు ఎంత సేపటికీ వారి గొప్పతనాన్ని చాటుకోవటం తప్ప ఇతరుల గొప్పతనం జూచి ఓర్వలేరు. ఈ అసూయా భావంతోనే వారు క్రమేణా నీరసించి. కృశించి, నశించి పోతారు. దీనిని రామస్వామిగారు ఎంత రమ్యంగా వర్ణించారో చూడండి :

తే॥ 'ఒరుల గొప్పతనముఁజూచి యోర్వలేని
పురుషుఁడెందు వేదనఁబడి పొక్కి పొక్కి
తెవులులేక యే తెగటారుఁ జివరకతఁడు
తప్పదీమాట వేదంబు కువ్వసామి.'

ఒకడు పాపి, ఇంకొకడు కాదు అనడానికి గుర్తులేమిటి? నేరం చెయ్యని వాడికి పోలీసు స్టేషనంటే భయం వుండదు. పాపం చెయ్యని వాడికి దేవుడన్నా భయం ఉండదు. నేరస్థుడు పోలీసు ఠాణాల చుట్టూ తిరగక తప్పదు. గజదొంగలు ఉదయం, సాయంత్రంకూడా పోలీసు ఠాణాకు వెళ్ళి హాజరు చెప్పివస్తూ ఉండాలి. అలాగే మహా పాపులు రెండు పూటలు గుడికి పోయి వస్తూ ఉంటారు. వారు చేసిన పాపమే వారిచేత ఆ విధంగా తిప్పిస్తూ ఉంటుంది. అందుచేతనే కవిరాజుగారు ఇలా అన్నారు :

ఆ॥ 'గుడికిఁదఱచు పోయి గొణగుచుండెడి వాఁడు
చెడ్డపాప మేదో చేసియుండు
నదియె వానిఁబట్టి యటిటు పీడింప
గుడికిఁబోవు నఁతడు కుప్పుసామి.

తే॥ పాతకునిచేత నెప్పుడు గీతయుండు
మొగముపై నింత నింతఁగఁ బొట్టులుండుఁ
జిన్నెలివియె మనస్సాక్షి సన్నగిలిన
యప్పుడు జనాళికెందును గుప్పుసామి.'

బాహ్యవేషం ప్రజలను మోసగిస్తుంది కాని నిన్ను మోసగించ లేదు.

ఆ॥ 'ప్రొద్దు పొడవకుండ నిద్దుర మేల్కాంచి
బుడిగి బుడిగి నీట మునిఁగి మునిఁగి
మొగము నిండ బూది పూసిన మాత్రానఁ
గుదుటఁ బడునె మనసు కుప్పుసామి.'

లౌకిక ధర్మాన్ని ఎంత లలితంగా చెప్పారో చూడండి :

తే॥ 'రాజు వ్యభిచారియైనచో రసికుఁడండ్రు
త్రాగి తందనాలాడుచో భోగియండ్రు
పాడిదప్పిన మంత్రాంగ పరుఁడటండ్రు
తప్పు తెలియని లోకులు కుప్పుసామి'.

సామాజికాభ్యుదయ చక్రం ఆర్థికనేమి మీద పరిభ్రమిస్తూ ఉంటుంది. ఆర్థిక దృష్టిలేని వారి జీవితంలో అరాజకత్వం తప్పదు. ఎంతటి తుచ్ఛులైనప్పటికీ ధనముగల వారికి సంఘంలో గౌరవ మర్యాదలు లభిస్తున్నాయి. ఎంతటి నీతివంతులయినా సరే ఆర్థికంగా వెనుకబడి వుంటే వారి జీవితాలు అవహేళనకు గురి అవుతున్నాయి. అందుచేతనే కవిరాజుగారు ఇలా అన్నారు—

తే॥ 'కాసులను గూడఁబెట్టిన దాసికొడుకు
పలుకుబడి గల్గి యందందుఁ బ్రాకులాడు
ధనముతోఁగాని పనులేవి ధరణిలేవు
మెప్పుకొఱకుఁ జెప్పుటకాదు కుప్పుసామి.

ఆ॥ కావి డబ్బుచేతఁ గల్గువాఁడెట్టివాఁ
డయిన గౌరవంబునందు మెఱిఁగి
పరువుఁగోరి బ్రతుకువాఁడెందు ద్రవ్యంబుఁ
గూడఁ బెట్టవలయుఁ గుప్పుసామి',

జూదమాడుట, స్త్రీల గోరుట, కల్లుద్రాగుట, వేటాడుట, కఠినపు మాటలాడుట, పరుల సొమ్ము నపహరించుట, పరులను నిందించుట అనేవి సప్తవ్యసనాలుగా పేర్కొన్నారు ప్రాచీన నీతిశాస్త్ర కోవిదులు. కాలానుగుణంగా ఇవీ మార్పుజెందాయి. ఆధునిక యుగంలో మానవుడు అనేక కొత్త వ్యసనాలకు గురి ఔతున్నాడు. ఆ నూతన సప్త వ్యసనాలు ఏమిటో చౌదరిగారు చెబుతున్నారు చూడండి :

తే॥ 'నవలచదువు, వ్యాజెంబుల కవిలెకట్ట,
యోట్లు, సిగరెట్లు, సినిమాలు, చీట్లు, కాఫి,
నూత్న సప్త వ్యసనములనుచు వచింత్రు
గొప్పనీతి శాస్త్రవిదులు కుప్పసామి.

స్త్రీ విద్యపట్ల చౌదరిగారికున్న అభిమానం అపారమైనది. భావి తరాల ప్రజానీకం సుఖప్రదమైన జీవితం గడపాలంటే-స్త్రీ విద్య చాల అవసరమని వారు నొక్కి వక్కాణించారు.

ఆ॥ 'చదువులేని జాయ నల్లాపముల కన్నఁ
జదువుకొన్న జాయ చలముమేలు :
వీనువిందు గాఁగ వినవచ్చునొక మాట
నప్పుడప్పుడైనఁ గుప్పసామి.

ఆ॥ భార్య చదువు పతికిఁబనికి వచ్చుచునుండు
గొడుకు చదువుకన్నఁ గొంతవఱకు
చదువుకొన్న భార్య సంసారమును దిద్ది
కొనుచుఁ బతికిఁ గూర్చుఁ గుప్పసామి.

ప్రతిభగలవాడు ఏ రంగంలో వున్నా రాణిస్తాడు. అసలు ప్రతిభ లేని వాడు ఎంత గొప్ప పదవి నలంకరించినా, ఏదో ఒకనాడు పదవీ చ్యుతుడు కాకతప్పదు. ఒకవేళ కాలం కలిసిరాక ప్రతిభావంతుడు ఒకప్పుడు పతనావస్థ జెందినా, తిరిగి ఉన్నతస్థితి పొందే అవకాశం ఉంది. ఇది ఎలా జరుగుతుందో కవిరాజుగారు వివరించారు :

ఆ॥ 'ప్రతిభగలుగువాఁడు పతనంబుఁ జెందిన
మరల పైకి వచ్చు మహిత శక్తి
రాలిపడిన పూలు రమణుల క్రొవ్వెద
నొప్పుఁ జూపరావె? కుప్పుసామి'.

ఈ పద్యం చదివినవెంటనే భర్తృహరి సుభాషితములలోని 'కందుకము వోలె సుజనుడు' అనే పద్యం మన స్ఫురణ కొస్తుంది. భర్తృహరి పద్యంలోకంటే కూడా యిందులోని 'ఇమేజరీ' చాలా ఉదాత్తంగా ఉంది.

రామస్వామిచౌదరిగారు అహింసా సిద్ధాంతాన్ని అక్షరాలా ఆచరించేవారు. 'ఆత్మవత్సర్వ భూతాని'—అన్ని జీవులు నీ వంటివే అనుకో, ఎవరినీ బాధపెట్టకు' అన్న సిద్ధాంతమే వారిది. ఇందులకు ఓ చిన్ని సంఘటనను ఉదాహరిస్తే సరిపోతుంది.

చౌదరిగారు తెనాలి పురపాలక సంఘ చైర్మనుగా వున్న రోజుల్లో దురదృష్టవశాత్తూ గంగానమ్మ ఆ పట్టణం మీద విరుచుకుపడింది. పౌరు లందరూ భీతావహంతో ఆమెకు ముడుపులు కట్టి, కొలుపులు కొలవడానికి తయారయ్యారు. ఎన్నో-గొర్రెలు, మేకలు, కోళ్ళు-అమ్మవారి పేరి

బలి ఇవ్వడానికి సిద్ధంగా వుంచబడ్డాయి. ఈ జంతుబలికి చైర్మను గారే 'లైసెన్సు' ఇవ్వాలి. ఈ విధమైన సామూహిక జంతుబలికి అంగీకరించను అన్నారు చౌదరిగారు. 'లైసెన్సు' ఇవ్వటానికి నిరాకరించారు. ఈ వార్త పట్టణమంతా మహా దావానలంలా వ్యాపించింది. పౌరులలో అలజడి గలిగించింది. చౌదరిగారి వద్దకు కొందరు 'కౌన్సిలర్లు' రాయబారం వెళ్ళారు. 'లైసెన్సు' ఇవ్వవలసిందేనని పట్టుబట్టారు. జీవహింస పనికిరాదు. పట్టణ ప్రజానీకమంతా తమ్మవారి ఆగ్రహానికి గురి అయినా సరే, మూఢనమ్మకంతో జరిపే కొలుపుల పేరిట, మూగజంతువులను బలి ఇవ్వడానికి నేను అగీకరించజాలను' అన్నారు చౌదరిగారు. అంతట కౌన్సిలర్లు విశ్వాసరాహిత్య తీర్మానం తెస్తామంటూ బెదిరించారు. చౌదరి గారు చలించకుండా చిరునవ్వుతో, 'మీ ఇష్టమొచ్చినట్లు చెయ్యండి. అందు లకు నేనూ సిద్ధంగానే ఉన్నాను' అన్నారు. విశ్వాస రాహిత్య తీర్మానం పెట్టారు. తీర్మానం నెగ్గింది. తరువాత వారం రోజులలోనే చైర్మను ఎలక్షను జరిగింది. కవిరాజుగారినే తిరిగి చైర్మనుగా ఎన్నుకొన్నారు. కొలుపులు మాత్రం జరగలేదు. జీవహింస ఆగిపోయింది. తరువాత కొన్ని రోజులకు మార్సు పేటలో కొందరు యజ్ఞం చేయాలని తల పెట్టారు. 'యజ్ఞం పేరుతో వారు జీవహింస చేస్తున్నారు. కాబట్టి యజ్ఞం చేయడానికి వీల్లేదు' అన్నారు రామిస్వామిగారు. అంతేకాదు, నాలుగు రోజులు అనర్గళంగా ఉపన్యాసాలిచ్చారు. కవిరాజుగారి అనుచరులు కొందరు యజ్ఞగుండం వద్దకు తీసుకొని పోతున్న యజ్ఞపశువు (మేక)ను బలాత్కారంగా లాక్కొని పారిపోయారు. అంతటితో ఆ యజ్ఞం విఫలమయింది. ఆ పట్టణంలో మరల అట్టి యజ్ఞమును

ఎవరూ కాలుపెట్టలేదు, అందుచేత ఈ శతకంలో జీవహింస చేయరాదంటూ, జీవకారుణ్య సిద్ధాంతాన్ని చాటి, ఏసుక్రీస్తు, బుద్ధభగవానుడు మొదలగు విశ్వమానవవాదుల కోవలో చేరారు చౌదరిగారు.

ఆ॥ 'జీవహింస చేసి జీవింతు ననుకంటె
జెట్టయెందుఁ గూడఁ బుట్టఁబోదు
జీవహింస మాని జీవింపరాదొకో :
కొంత మేలుదానఁ గుప్పుసామి,

తే॥ మాంసమును భుజింప నిచ్ఛించి మానవుండు
మ్రొక్కు మ్రొక్కించు దేవుని ముందఁబెట్టి
గొంతుగోసి యే మృగమునో కుడుచుచున్న
గోపపడకున్నె దేవుండు? కుప్పుసామి'.

మానవుడు నీతిని పరిత్యజించి, దేవుని పేరుతో చేసే దుర్మార్గపు చేష్టలు ఆరోజుకారోజూ పెచ్చుపెరుగుతున్నాయి. దేవుడు మానవుణ్ణి సృష్టించాడా? లేక-మానవుడే దేవుణ్ణి సృష్టించాడా?అన్న తాత్విక మీమాంస ఈ నాటికీ ఉంది. దీనికి భారతీయ తత్త్వశాస్త్రం సరియైన సమాధాన్ని ఇవ్వ లేకపోయింది. ఈ నాటి మానవుడు దేవుణ్ణి 'గర్భగుడి'లో బంధించడమే కాకుండా, దర్శనానికి డబ్బుకూడా వసూలు చేస్తున్నాడు. ఇది దేవుని పేరుతో జరిగే దోపిడి. ఇలాంటి దోపిడీలను చౌదరిగారు వేమన యోగివలే చూయ బట్టారు. చూడండి.

ఆ॥ 'ముక్కు మొగముఁ జెక్కి మూల విరాట్టంచు
నొక్కరాయిఁ దెచ్చి యుంచి గుడులఁ
గూడుగుడ్డ లిచ్చి కొల్తురు ప్రజలెల్లఁ
గొంటె పనులుగావె కువ్వసామి',

వేమన పద్యం పరిశీలించండి :

ఆ॥ 'రాతిబొమ్మకేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములను
కూడుగుడ్డ దాను గోరునా దేవుండు
విశ్వదాభిరామ వినురవేమ'.

మానవుడు మర్త్యుడు. పుట్టిన ప్రతి ప్రాణీ ఏనాటో ఒకనాడు గిట్టవలసిందే. ప్రపంచంలో శాశ్వతంగా వుండేది ఏది? ప్రతిదీ నశించవలసిందే! మరణించిన ప్రతి జీవికి తన పూర్వజన్మ సుకృతాన్ని బట్టి 'పునర్జన్మ' గలుగుతుందని హిందూమత వేదాంతులంటున్నారు. "చచ్చిపోయిన ప్రతి ప్రాణీ కర్మ ఫలితాన్ని బట్టి మరల జన్మమెత్తేటప్పుడు 'పితృలోకం' ఎలా ఉంటుంది ? చచ్చిపోయినవారికి 'పిండాలు' ఎలా చేరుతాయి ?" అని ప్రశ్నించారు రామస్వామిచౌదరిగారు. ఉదర పోషణార్థం కొందరు ఈ విధానాన్ని సృష్టించారని చౌదరిగారు భావించారు.

తే॥ 'చచ్చిపోయిన వెంటనే జన్మమెత్తు
జీవ కుడువఁగర్మ మటంచుఁ జెప్పుచుండుఁ
రట్టులైనచోఁ బితృలోక మెట్టువచ్చుఁ
గుటిలమైన వృత్తిగాదొకో కువ్వసామి.

తే॥ చచ్చిపోయిన వారికే నరణిఁ జేరఁ
గలవు పిండములు నివాపజలము కూడ
నావులును భోక్తలును దృప్తులగుట కొఱకు
గూర్చి పెట్టిరి గాకేమి కుప్పసామి.'

స్వసన్ వేద ఉపనిషత్తు * రెండవ సూత్రంలో ఇవే అభిప్రాయాలు వెల్లడించబడ్డాయి. ఈ ఉపనిషద్భావాలను లోకానికి తెలియజేసినందుకు రామస్వామిచౌదరిగారు పరమ నాస్తికులుగా చిత్రించబడ్డారు. కాని నిష్పాక్షికంగా చూస్తే కవిరాజుగారు నాస్తికులుకారు. వారు ప్రచారం జేసింది నాస్తిక భావాలు కావు. అప్పట్లో అమలులోవున్న సాంఘిక దురాచారాలనూ, మూఢ నమ్మకాలనూ, మతం పేరుతోనూ, దైవం పేరుతోనూ జరుగుతున్న అత్యాచారాలనూ నిర్భయంగా దూయబట్టారు చౌదరిగారు. వారు సృష్టించిన సాహిత్యం సమాజంలో పతనమైపోయిన నైతిక విలువలను పునరుజ్జీవింప జేసిందని ఈనాటి సాహిత్యవేత్తలందరూ అంగీకరిస్తున్నారు.

* There is no incarnation, no God, no heaven, no hell, all traditional religious literature is the work of Conceited fools; Nature, the originator, and time the destroyer, are the rulers of things, and take no account or virtue or vice, in awarding happiness or misery to men; people deluded by flowery speeches cling to God's temples and priests when, in reality, there is no difference between Vishnu and a dog.',
Swasen Ved Upanishad, sutra II

మానవునికి ఎన్ని సుగుణాలుంటే మాత్రం ఏమి లాభం? 'నీతి' ఒక్కటి లేకపోతే మిగిలినవన్నీ బూడిదలో పోసిన పన్నీరు గదా! అందుచేత మానవులను నీతి, నియమాలతో బ్రతుక వలసిందిగా ఉద్బోధించారు కవిరాజుగారు:

ఆ. 'ఎన్ని రసములున్న నేమి రుచించును
నుప్పులేని కూర చప్పనగుచుఁ
కోటి గుణములున్నఁ గొఱగావు నీతి యొ
క్కొండులేకయున్నఁ గుప్పసామి.

ఆ. నీతిలేనివాని నిరసించు జగమెల్ల
నీతిశాలి కెపుడు నెగడు లేదు
నీతిశాలినెపుడు నీతియే కాపాడు
గుణనుబారిసుండి కుప్పసామి'.

ఈ శతకమును ఆరంభంనుండీ అంతంవరకూ కమ్మని శైలిలో నడిపించారు కవిరాజుగారు. ఇందులోని పద్యాలన్నీ పసిడి తునకలే గనుక యిలా చెప్పుకొంటూ పోవడమే జరిగితే, అందులోని పద్యాలన్నింటినీ ఉటంకించవలసి ఉంటుంది.

ప్రభుత్వం వారు ప్రతి సంవత్సరం ప్రచురించే పాఠ్య గ్రంథాలలో నీతి పద్య భాగంలో, ఈ శతకంలోని కొన్ని పద్యాలను ప్రచురిస్తే విద్యార్థులకు ప్రయోజన కారిగా ఉంటుంది. ఇది ప్రజలయెడ ప్రభుత్వం యొక్క విధ్యుక్త ధర్మం కూడాను.

# ధూర్త మానవా!

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ప్రారంభించి అసంపూర్తిగా ఆపివేసిన మరో శతకం 'ధూర్త మానవా'. ఈ మకుటం తోనే ఇందులోని పద్యాలు సమవృత్తాలుగా రచించబడ్డాయి. ఈ పుస్తకం ప్రకటించినప్పుడు ఆంధ్ర విద్వల్లోకంలో మరో పెనుతుఫాను చెలరేగింది. శక్తివంతమైన భాష మహాశక్తి వంతమైన భావం–వీటిసమ్మేళనమే ఈ 'ధూర్త మానవా!' శతకం. కవిరాజు ఆకస్మాత్తుగా మరణించినందువల్ల ఇది అర్ధ శతకంగానే నిల్చిపోయింది. దీని ప్రథమ ముద్రణ 1943 సం. సెప్టెంబరులో జరిగింది. ఆంధ్ర సాహిత్యంలో ఇప్పటివరకూ ఇలాంటి శతకం వెలువడ లేదంటే అతిశయోక్తికాదు!. సర్వసాధారణంగా అన్ని శతకాలలోనూ మానవులకు జరుగుతున్న అన్యాయాలనూ, అధర్మాలనూ తమ ఇష్టదైవానికి నివేదించుకోవడం ఇతివృత్తంగా ఉండటం కద్దు. కాని ఈ శతకంలోని చిత్రమేమిటంటే–మానవుడే మకుటధారియైన ప్రపంచంలో–భగవంతుడే కవిరాజుగారికి కలలో కనిపించి, తన పేరిట భూసురులు, సమాజంలోని ఇతర వర్గాలకు చేస్తున్న అన్యాయాలను గురించి విన్నవించుకొంటాడు. ఈ శతకంచదివితే ఇతర జాతులను బానిసత్వంలో శాశ్వతంగా వుంచడానికి భగవంతుణ్ణి, స్వర్గ–నరకాలనూ భూసురులు తమ సౌఖ్య సౌభాగ్యాల కోసం సృష్టించారనేది స్పష్టమౌతుంది. ఎత్తుకోలులోనే భగవంతుని చేత్త పిడుగుల వర్షంకురిపించారు కవిరాజుగారు. భగవంతుడు ఏమంటున్నాడో చూడండి.

ఉ॥ 'ఏఁబది నాల్గు లోకముల సృష్టియొనర్చుచుఁ బెండ్లి పిమ్మటన్
దూబవలెన్ హరింతునని దొంగనుడుల్ వచియించుచుంటివే?
యేఁబదీ మాటలేమిటికి? ఇట్టి ప్రచారము మానకున్నచో
గూబలు సాఁగఁ దీసెదను గూయకు మిట్టిపి ధూర్త మానవా !

భగవంతుడు ఫద్నాలుగు లోకాలనూ (మూడో-ఏడో-పద్నాలుగో-నిచ్చితంగా చెప్పలేం) సృష్టించాడంటున్న నోటితోనే, ఆయన భువన భువనాలకూ కర్త అన్న నోటితోనే ఆయనకు ప్రతి సంవత్సరం పెండ్లి జేయడానికి చందా ఇవ్వమని అడగటం మనకందరికూ తెలుసు. సకల చరాచర సృష్టికి కారణభూతుడైన ఆ మహాశక్తికి పెళ్ళిచేసుకొనే తాహత్తులేదా? అలాంటి శక్తిలేదని శంకించుకున్న మానవునిగూర్చి భగవంతుడిలా అంటున్నాడు:

ఉ॥ 'ఈ టకటొంకులేమిటికి? విల్లును వాకిటఁ గట్టిపెట్టి యే
కోటను పెండ్లి సేయుమని యేనెపుడైనను గోరియుంటినే?
చీటికి మాటికిన్ బరుల జేబులు గొట్టుట ధర్మ మార్గమే ?
ఏటికి నీయబద్ధ మరరే! యిఁకసాగునె ? ధూర్త మానవా !

మ॥ గుడులున్ గోపురముల్ కుశీలవ్యఁడవై కట్టించి పెంపారఁగా
మడి మాన్యంబులు నాదు పేరుననె నిర్మాణంబు గావించుచున్
పడ ప్రచారమున్ బెరవారి కిచ్చెదవె ! నీ భావంబు నెంచెమి గి
ల్పడఁగానేర్చెడి ? చెప్పుమింతటి దివాలాఖోరువే మానవా !'

—— మన స్వభావాలను బట్టే మన 'సృజనశక్తి' కూడా ఉంటుంది. స్వభావానికి భిన్నమైన సృష్టి మనవల్ల కాదు. మానవుడు భగవంతుని

సృష్టించటమే కాకుండా, మానవుని లంపటత్వమంతా అంట గట్టినందులకు భగవంతుడు యిలా అంటున్నాడు:

ఉ॥ 'కాపురముండనిల్లుఁ నడ కత్తెరలోఁ బడియుండఁ బెండ్లమున్,
మాపులు కుక్కఁగాఁ బడక మంచము, నెక్కఁగ నెక్కిరింతలున్.
సాపడఁ బైడి కంచమును జక్కఁగఁ గూర్చి, యుపన్యసింతువే ?
నీపనిఁ బట్టెదన్ వినుము నీ విది మానవ ధూర్త మానవా !

ఉ॥ బొక్కఁడు కూడు పట్టుమని పొట్టకు తింటినె యొక్కపూటయేన్ ?
జక్కఁగ నోంటినిండ నొక జానెడు గుడ్డను గప్పుకొంటినే ?
ఒక్కటి యేని ముచ్చిక యుంచితివే ? యిఁక నీదుపాటు లే
నక్కయుఁ గుక్కయున్ బడదు; నాపలుకుల్ విను ధూర్తమానవా'!

దుష్ట శిక్షణకు, శిష్ట రక్షణకు భగవానుడు అనేక అవతారాల నెత్తి వలసివచ్చిందని పురాణాలు ఘోషిస్తున్నాయి. ఇవే దశావతారాలు. పూర్వ మెప్పుడో నాలుగు వేదాలనూ సోమకుడనేవాడు హరించాడని అప్పుడు భగవానుడు చేపరూపమెత్తి వాటిని రక్షించాడని తలంచ బడుచున్నది. అందులకు భగవానుడు యిలా అంటున్నాడు.

ఉ॥ 'వేదము లెట్లు బ్రహ్మముఖ వీథులనుండి హరింపగాఁ బడున్
పాదలి సోమకాసురుడు వచ్చి తయిన్ హరియించె నంచు నే
చీదరఁ బొందకుండ చేపవేషము జేసితివే ననున్-సరే ?
నీదయ మీద నాబ్రతుకు విడ్చెనె చెప్పుమ ధూర్త మానవా !

---

* మత్స్యావతారము

ఆర్య, అనార్య తెగల మధ్య జరిగిన పోరాటాలను ద్రోహులు తమ స్వార్థానికి బాగా ఉపయోగించుకొన్నారు. ఆర్యులను దేవతలుగా కీర్తించారు. అనార్యులను రాక్షసులని దూషించారు. మహాభాగవతం అష్టమ స్కంధంలోని 'బలిచక్రవర్తి గాథ'ను ఇందుకు నిదర్శనంగా చూపవచ్చు.

బలిచక్రవర్తి మళయాళ దేశానికి ప్రభువు. అనార్యుడైనందు వల్ల 'రాక్షస రాజు'గా చిత్రించబడ్డాడు. అతడు తన దానధారచేత సమస్త లోకస్థుల దాహాన్ని తీరుస్తూ అందరిచేత పొగడ్తలందసాగాడు. ఇంద్రాది దిక్పాలకుల గర్వానికి గొడ్డలి పెట్టు, లోభానికి చెంపపెట్టు, వివిధ యజ్ఞ వ్రత దానక్రియలకు ఆటపట్టు, (నిరాటంకంగా నూరు యజ్ఞాలు చేశాడు). దేవకాంతల ముఖ పద్మాలకు వెన్నెలకట్టు, సత్యదయా ధర్మాలకు తలకట్టు' అని భాగవతంలో బలిచక్రవర్తి వర్ణింపబడ్డాడు. బలిచక్రవర్తి కీర్తిని జూచి ఆర్యులకు కన్నుగుట్టి, ఒక * 'పొట్టి తంగబా'ను పంపించి, అతనిచేత మూడడుగుల దానాన్ని గ్రహించి. అతనిని పాతాళలోకాని కణగ ద్రొక్కించారనే గాథను గూర్చి భగవంతుడు యిలా అంటున్నాడు :

మ॥ 'బలి యే పాపముఁ జేసినాఁడతనిపై వైరంబు నాకేల ? త
ద్బలి రాజ్యంబు హరింప వంచకుఁడనై ధర్మంబుఁ బోద్రోసి దో
ర్బలహీనుండగు నింద్రుఁ బ్రోవ నవతారంబెత్తి నానంచు లో
కులు నమ్మన్ వచియింతు వింకయిన బొంకుల్ మానవా? మానవా!

---

* వామనావతారము

చ॥ పరులను, ధర్మ దూరులను, బంధుర పాపనిమగ్న చిత్తులన్
కరుణను గాచి ప్రోచుటకుఁ గాచుటతో బలి చక్రవర్తినిన్
దిరిపెపు నెత్తినాఁడనని దేబిరిగొట్టు మొగంబు, యెల్లడన్
నిరతము చాటుచుండెదవె ? నీ పనిఁ బట్టెద ధూర్తమానవ

మ॥ తమ పెల్లన్ గులపెట్టి జీర్ణసుఖ రుగ్ధ ద్రువ్యధాపీడచే
త నహోరాత్రులు కామతృప్తికొఱకై దారాడు స్వర్లోక నా
థుని పక్షంబయి దానశీలుని మహత్ప్రాజ్ఞున్ బలిన్ సత్యవా
క్య నిరూఢున్ బొరియించి నాసనుచు 'పల్కన్ జూచువే మానవా !

అనార్య జాతికి చెందిన రాజ కుటుంబాలు స్వతంత్రంగా మనటాన్ని ఆర్యులు చూడలేకపోయారు. అలా స్వతంత్రంగా ఉంటున్న రాజ కుటుంబాలను అనేక కుట్రలు పన్ని, సర్వనాశనం చేశారు. ఇందులకు పరశురాముణ్ణి ఉదాహరణగా పేర్కొనవచ్చు. స్వతంత్ర రాజకుటుంబాల నిర్మూలనానికి ఆర్యులు చూపే కారణం-అర్థరహితమయింది. జమదగ్ని మరణాన్ని ఆసరా చేసుకొని, ఈ దారుణ హింసాకాండ జరుపబడింది. ఆర్యులు పరశురాముణ్ణి ఈ హత్యలు చేయమని ప్రోత్సహించారు. ఈ హంతకుడు - శిక్షింపబడలేదు సరిగదా - దశవతారాలలో ఒక అవతారంగా చిత్రించినందులకు భగవంతుడు యిలా అంటున్నాడు :

ఉ॥ 'ఒక్కఁడు తండ్రి జంపెనని యోరిమిలేకయె గండ్రగొడ్డటన్
[illegible] క్షత్రజాతిగొంప ధర్మవగు నా కులమంతయు ? దీని జేయ నే
నొక్కఁడనే కనంబడితినో ! యిటువంటివి పూర్వమందు నే
దిక్కులఁ నేని విన్నదెనె ? తిక్క వదల్చెద ధూర్త మానవా ?'

ఇక, శ్రీరామచంద్రుని దగ్గరకొచ్చేసరికి ఆర్యజాతి విజృంభణ పెచ్చరిల్లింది. అతడు అర్యేతరుడై నప్పటికీ ఆర్యుల చేతుల్లోని కీలుబొమ్మ అయ్యాడు. ఆర్యఋషులకు శ్రీరాముని నిజతత్వం తెలుసు. అందుచేత వారు శ్రీరాముని 'మాయామానుష విగ్రహుడు' అని వర్ణించారు. రామాయణమును సవిమర్శకంగా చదివిన రామస్వామి చౌదరిగారు 'సామాన్య మానవునిలో వున్న లక్షణాలన్నీ శ్రీరామచంద్రునిలో ఉన్నాయి'. అన్నారు. రామావతారాన్ని గురించి భగవంతుడుయిలా అంటున్నాడు :

చం. 'ఉడుగక తొల్లి పెండ్లమును నొక్కతె నా మెడకంటఁ గట్టి యా
ఓడ నెవడో హరించెనని వెంగలి మాటలు చెప్పి యామెకై
యెడతెగకుండ బావురని యేడ్చితి నంచును నెన్ని రోజులో
బడబడ పెద్ద గ్రంథములు వ్రాసితివేమిర ? ధూర్త మానవా !

శ్రీకృష్ణుని శ్రీమహావిష్ణువు అవతారంగా భావించి హిందువులు పూజిస్తున్నారు. శ్రీకృష్ణుని కాలంలో అయనొక గొప్ప తత్వవేత్త; రాజకీయ నాయకుడు. అతడు లేకపోయినట్లయితే మహాభారతయుద్ధం జరిగి ఉండేదికాదు. భాగవతంలో శ్రీకృష్ణుడు వ్యభిచారిగా వర్ణించబడ్డాడు. అందుకు భగవానుడుయిలా అంటున్నాడు.

మ. 'మిడి మేలంబుగఁ దెచ్చి పెటితివిగా మేన త్రతో గూటమిన్
బడి మువ్వంకల సుందరాంగ మధురాపట్నంబులోఁ గూటమిన్
మెడకుం గట్టితి వెంతవాడవుర క్షీ పి మిటోటలనా మానవా?
[illegible] మానవా

అప్పటి వరకూ దశావతారాలను గురించి ప్రచారంలోనున్న భ్రమలను ఈ పుస్తకం తొలగించి వేసింది. సర్వశక్తివంతుడైన భగవంతుడు ఇన్ని అవతారాలను ఎందుకెత్తవలసి వచ్చింది? ఇన్ని అవతారాల నెత్తకుండా తాను చేయాలనుకొన్నది చేయలేడా? అలాంటి శక్తి లేదని తలంచిన మానవుని గూర్చికోపోద్దీపితుడైన భగవంతుడుయిలా అంటున్నాడు.

మ. 'అవతారంబులనెత్తి చేయగల నన్యాయంబు లన్నింటి నే
నవతారంబుల నెత్తకుండ మఱి చేయన్ శక్తి లేదంచు న
న్నవమానించితి వింతకాలమిటు? నిన్నాపాద మస్తంబుగా
విస్ఫురుంజేసెద నెవ్వరడ్డ పడగా నీ కుండిరో మానవా!'

మానవుడు సమస్త పాపాలు చేసినప్పటికీ ఒక్కసారి భగవన్నామం జపిస్తూ, పూజ చేస్తే, అవన్నీ హరిస్తాయన్న బూటకాన్ని కవిరాజు ఖండించారు.

చం. 'త్వరపడకుండ సంజపడు దాఁకను తప్పుపనుల్ బొనర్చి పై
బొరుగున నున్న తోఁటలను బూవులు ముచ్చిలి కోసితెచ్చి నా
శిరమునఁ బోసినంతటనె చేసిన పాపము లొక్కసారిగా
మఱచెడునట్టి పెంగలినె మానవ యిట్టివి ధూర్త మానవా!

చం. మరణపు శయ్యమీఁద నొకమారయినన్ నను దప్పకుండ సం
స్మరణము చేసినంతటనె స్వర్గము వచ్చునటంచు; వేగతిన్
బొరయుమ? విట్లె నీవెపుడు బొంకుచు నుందువు దీనికై వినున్
గఱగఱ గొంతు కోసెదను కావివి చెప్పకు ధూర మానవా!'

మానవులందఱున్ సరిసమానులుగారొకొ నాకు ? మాయురే!
మానక నీవు యిట్టి యవమానముఁ జేతువె ధూర్త మానవా !

చం. పసులను, జెట్టుచేమలను బక్షితతిన్, గ్రిమికీటకాదులన్
బుసుకున దాకినంతఁ దలపోయవు స్నానము మాట; కాని, మ
నిసి నిను దాకినంతఁ దలనిండుగ స్నానము ధర్మ మార్గమే !
ముసిముసి నవ్వు నవ్వెదవు మోరెగబట్టుక ధూర్త మానవా !'

ధర్మమార్గాన్ని వీడి, పరులను పీడిస్తూ జోలిగట్టుకొని, ఊళ్లు తిరిగి కట్టకడకు తిరుపతి కొండమీదకు ఎగదేకినా, ఇసుమంత ప్రయోజన మైనా వుండబోదని, అందుచేత ధర్మమార్గానుయాయులుగా మానవులందరూ ప్రవర్తించ వలసిందని రామస్వామిచౌదరి గారు మానవాళికి మహోత్తమ మైన సందేశం యిచ్చారు.

చం. 'తిరిపెము నెత్తియెత్తి యతి దీనతఁ దిగ్గుము జోలెబట్టుచున్
తిరుపతి కొండమీదఁకెగ దేకుచు నచ్చట చెప్పు దెబ్బలీ
పొరువుగఁ దిన్న లేశము ప్రయోజనముండదు ధర్మమార్గమున్
బిట్టిఁదికిఁ ద్రోసిపుచ్చి పరపీడకుఁ బూనిన ధూర్త మానవా !'

'మమాత్మా సర్వ భూతాత్మా' అంటున్నాయి వేదాలు. 'సర్వే జనా స్సుఖినో భవంతు' అన్నది ఆర్షోక్తి కాని ఇవి ఆచరణలో వున్నట్లు ఎక్కడా కనుపించదు. 'నీన్నువలే నీ పొరుగువాణ్ని ప్రేమించు' అన్నాడు ఏసుక్రీస్తు. కాని ప్రపంచంలో పరస్పర మానవోద్రేగం ప్రబలి పోయింది. మానవుణ్ణి మరో మానవుడు పీడిస్తున్నాడు. కనీసం ఇరుగుపొరుగువారు సుఖంగా పదువుతో బ్రతకడం నేటి మానవులు చూడలేక

పోతున్నారు. ఇలాంటి వారిలో మానవత్వం మృగ్యమై, పశుత్వం పరపశు ప్రాకృడమే కారణంగా కనిపిస్తున్నది. మానవుల స్థితి ఇంతగా దిగజారి పోతే, యిక. విశ్వమానవకళ్యాణానికి మార్గమేమిటి ? దాన్ని కవిరాజు చూపించారు. వ్యక్తి సుఖం- వ్యక్తితో మాత్రమే సంబంధించి లేదు. నీ కుటుంబం ఆరోగ్యంగా ఉండాలంటే. నీ పరిసరాలూ ఆరోగ్యంగా ఉండాలి. నీదేశం సుఖశాంతులతో వర్ధిల్లాలంటే నీ ఇరుగు పొరుగు దేశాలు సుఖంగా ఉండాలి. ఈ విధంగా సంఘీభావాన్ని, సహజీవన సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు చౌదరిగారు. విశ్వమంతటి ఈ భావాన్ని ఈ ఒక్క పద్యంలో ఇమిడ్చారు కవిరాజుగారు చూడండి

చం. 'ఇతరులఁ బర్వితోఁ బ్రతుకనిచ్చుట నెన్నఁడు నేర్చి కొందువా
యతమగు నీ ప్రపంచ సుఖమన్నది యొక్కటె నీ సుఖంబుగాఁ
బ్రతిదినమున్ స్మరించు సమ భావము నెన్నఁడు నేర్చి కొందు వు
న్నతిఁ గనుచుండి నీ ప్రజల నారతమున్ నిను మెచ్చ మానవా!'

చిట్టచివరకు మానవుడు చేసిన తప్పులన్నింటినీ వివరించి. 'ఇప్పటి వరకూ చేసినవేవో చేశావు. వాటికి క్షమిస్తున్నాను. ఇకముందు ఇలాంటి తప్పులు చేయకుండా, లోగడ చేసిన తప్పులను సరిదిద్దు కోడానికి గట్టిగా ప్రయత్నించు మానవా! జాగ్రత్త!!' అని భగవంతుడు మానవునికి Severe warning ఇవ్వడం జూస్తే చౌదరిగారి రచనల్లోని సున్నితమైన హాస్యం పాఠకునికి సాక్షాత్కరిస్తుంది

ఉ. 'వాజను మానకున్న దేవతాదులకుఁ దప్పవు శృంగ భంగములే;
రోజులు నీకుఁ జాలవిసిరో ! జులు మింతకు మానకున్నచో
బాధిపి ఙూదు నీవు నగుబాటు ఘటిల్లును నింకమీఁదనీ
పోజులు జూచి మెచ్చినసపడి మోసపడదు గల్గదు ధూర్త మానవా!'

భగవంతుడే వుండి_మానవునితో మాట్లాడటమే జరిగితే-ఇంత కన్నా ఆయన చర్చించ వలసిన విషయాలుఉండబోవు. ఈ లోకంలో ఎన్నో-అన్యాయాలూ, ఘాతక కృత్యాలు-తన పేర జరుగుతున్నా కిమ్మనకుండా వున్న ఆ లీలామానుషవిగ్రహుడు, మహానుభావుడు-మనకు కనుపించి, ఆ విషయాలను ప్రస్తావించకపోతే, అతనికి ఆస్థాన మివ్వడం మనదే తప్పవుతుంది కదూ.

ఈ విధంగా పురాణ గ్రంథాలనూ, వేదాంత మత బోధలనూ, మూఢాచారాలనూ మాయబట్టి, సంఘంలో నీతిని నెలకొల్పడానికి వేమన యోగివలే కృషిసల్పిన అగణిత ప్రతిభావంతులు, సంఘసేవా పరాయణులు చౌదరిగారు. భూతదయ, పతితజనోద్ధరణ, నిస్వార్థ సేవాపరాయణ త్వము, విశ్వమానవ ప్రేమ, మానవులాచరించ వలసిన పరమ ధర్మాలని బుద్ధ భగవానునివలే మహోత్కృష్ట ప్రబోధం చేసిన మహా ప్రవక్త రామస్వామిచౌదరిగారు.

శతక వాఙ్మయం సాధించవలసిందేమిటో, ఎలా సాధించాలో, చౌదరిగారి 'కుప్పుసామి శతకం', 'ధూర్తమానవా' శతకాలు చాటు తున్నాయి.

వీరు "గోపాలరాయ" అన్న మకుటంతో మరో శతకం కూడా వ్రాశారు. ఇందులో శ్రీకృష్ణుని గూర్చి వ్యంగ్యంగా చెప్పిన 26 పద్యాలు ఉన్నాయి. వ్రాతప్రతి కనిపించటంలేదు.

చదలవాడ వాస్తవ్యులు శ్రీ సజ్జావీరయ్యగారి సహాయం వలన రెండు పద్యాలనుమాత్రం సేకరించినగలిగాను. అందులో రెండవ పద్యం

అసంపూర్ణంగానే ఉంది. పాఠకుల సౌకర్యార్థం ఆ పద్యాలను ఇక్కడ పొందు పరుస్తున్నాను.

సీ. తగవుఁదీర్చెద నంచు ధర్మ పన్నముఁ జెప్పి
యైనవారి కుటుంబమార్పి నావు,
తిట్టినాడని చెప్పి దీర్ఘ రోషమ్మున
మేనత్త కొడుకును ద్రుంగినావు,
దయతోడ తల్లిని దండింప కుండిన
మేనమామను పట్టి మెసపినావు,
సరిగావు నా సహోదరిని పుట్ట దగవన్న
బావజుట్టు గొరిగి పంపినావు.

గీ. ఇట్టి తుచ్ఛుడ వీవు గాబట్టి గాదె
గాడిద మెగిరి నిన్ను పండ్లూదఁ దన్నె
కట్టుకొన్నది నెత్తిపై కాలుబెట్టె
పనికి మాలిన ఓరి గోపాలరాయ !

*  *  *

సీ. పిన్న పెద్దలు నవ్వ కన్న తల్లికినీవు
కడుపు చింపించిన ఘనుడవయ్యా,
ఎల్లప్పుడును కల్లునే త్రాపుచుండెడి
పాలసుడే నీకు భ్రాత యయ్యె,
ఇంటికి వచ్చిన ఋషి పుంగవుని తగు
లొక్కని పోయెనయ్యో నీ యనుజ యయ్యె,

పనికి మాలిన ఓరి గోపాలరాయ !

రచన అంతా లభించి వుంటే ఎంత బాగుండేదో !

ఇదే విధంగా 'చెన్నకేశవా' మకుటంతో మరో శతకాన్ని కూడా చౌదరిగారు వ్రాశారు. జ్ఞాపకంలో వున్న పద్యాలు రెండు మాత్రమే. ఇక్కడ ఉదహరిస్తున్నాను:

చం. నిరుపమ వీరవైష్ణవుడు నీ ప్రియ భక్తుడు బాలచంద్రు డో
క్కరుడయి పోరఁ గూలునెడ గన్గొని యూరక యున్న నీవు మ
మ్మరసి కటాక్ష వీక్షణ సమాదర ణాప్తిమ నజాతు వన్న యే
కరణిని మాకు నమ్మకము గల్గునొ చెప్పవె చెన్నకేశవా !

* * *

తే. దూర భారంబనక మేము త్రొక్కుపడచు
వచ్చినారము వినుజూచు వాంఛతోడ
చెన్నకేశవా కోరము చిల్లిగవ్వ
చిత్తశుద్ధి మాత్రము దయచేసి పంపు.

రసగుళికల వంటి ఇలాంటి పద్యాలను చదువుకోగల్గే భాగ్యం మనకు లేదు.

# వివాహవిధి

కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు చిన్ననాటినుండీ తాను విశ్వసించిన అభిప్రాయాలను నిర్భయంగానూ, నిరాఘాటంగానూ వెల్లడించేవారు. మానవజీవితంలో వివాహం మహోత్కృష్టమైనది గనుక వివాహనిర్వహణవిధానంలో వారికిగల కొన్ని అమూల్యమైన అభిప్రాయాలను లోకానికి తెలియజేయాలనే ఉద్దేశంతో "వివాహవిధి" అనేచిన్నపుస్తకాన్ని ప్రచురించారు. దీనినిగురించి తెలసికొనే ముందు వివాహంయొక్క పుట్టుపూర్వోత్తరాలను కొంతవరకు తెలియజేయడం అసందర్భం కాదను కొంటాను.

ఈనాడు కొందరనుకొంటున్నట్లుగా, 'వివాహం' మానవజాతి ఏర్పడి నప్పటినుండీ ఉన్నదనుకోవడం పొరపాటు. అసలు మానవజాతి ఏర్పడటానికే, కొన్ని లక్షల సంవత్సరాలు పట్టింది. కోతులు- ఆ తరువాత- అర్ధవానర జాతులు, ఆపిదప- అర్ధ నరజాతులు, ఆపైన- నరజాతి -ఈ క్రమంలో మానవజాతి వికసిస్తూవచ్చింది. ఈ వికాసమనేది 'జీవి' గుణాలలో ఒకటి. ఆహారం సంపాదించుకోవటం, తనను తాను కాపాడు కోవటం, తన జాతిని విస్తరింప జేసుకోవటం- ఈ మూడు ప్రతిప్రాణికీ వుండే కనీస లక్షణాలు. కాలం, ఈ లక్షణాలమీద అనేక ప్రభావాలను కలిగించింది. రకరకాల వాతావరణాలు, జీవులను మార్చివేశాయి. ఇదీ కారణంగానే మానవుడనేవాడు భూమిమీద అవతరించటానికి అవకాశం కలిగింది.

తన జాతిని విస్తరింప జేసుకోవటానికి, ప్రకృతి-స్త్రీ, పురుష విభాగమంటూ చేసింది. మనకు తెలిసినంతవరకూ, సృష్టికి, విభిన్న

తరగతులకు చెందిన ఈ రెండు ప్రకృతులూ అవసరమే! జీవశాస్త్రం చదివిన వారికి ఇందులో విడ్డూరమేమీ కనిపించదు.

అనాది యుగంలో వివాహమంటూ ఉన్నదనటానికి ఆధారాలులేవు. స్త్రీలు, పురుషులు యథేచ్ఛగా కలుసుకొంటూ వుండేవారు. సంతానాన్ని కంటూ వుండేవారు. ప్రపంచ మంతటా– కొద్దివందల సంవత్సరాల తేడాతో ఆదిమ మానవులు అవతరించారు. ఆయా వాతావరణాలనుబట్టి, వారి ఆహార విధానం, వాడే ఆయుధాలు ఉంటూవుండేవి. ఉదాహరణకు చూద్దాం :– ఉష్ణమండల ప్రాంతంలో అవతరించిన ఆదిమ మానవజాతి, వస్త్రధారణకు, అంతగా ప్రాముఖ్యం ఇచ్చినట్టు కనబడదు. వీరు, కొంత బలహీనులుగా కూడా వుండేవారు. హిమ ప్రాంతీయులు, ఆహార సంపాదనలోనూ, ఆత్మరక్షణలోనూ, వేటలోనూ, బాగా ఆరితేరి వుండేవారు. వారు బలశాలురు కూడాను. ఒక్కొక్కసారి హిమప్రాంతపు మానవ తండాలు, ఆహారంకోసం, చలినుండి కాపాడుకోవడం కోసమూ యోజనాల పర్యంతం ఉష్ణమండల ప్రాంతాలవైపు ప్రయాణాలు సాగించేవి. ఈ ప్రయాణాలలో ప్రకృతి వారిని నిర్దాక్షిణ్యంగా సంహరించేది. ఇతర మానవ తండాలు, కొత్తగా వచ్చినవారితో హోరాహోరీగా పోరాటాలు సాగించేవి. అపారమైన జననష్టం సంభవించేది. ఆనాడు, ఈనాడు కూడా, బలంవున్న వాడిదే గెలుపు. ఆరోజుల్లో బలానికి మరింత ప్రాముఖ్యత ఉండేది. ఈ బలం, సంఖ్యమీదా, వాడే ఆయుధాలమీదా ఆధారపడి ఉండేది. తమ తండాలలోని సంఖ్య, దిన దిన ప్రవర్థమానమైతేనే, బలంగా వుంటేనే, ఆ తండా నిలబడ గలిగేది; లేకపోతే, నామరూపాలు లేకుండా నశించి పోయేది. అలా నశించిపోయిన జాతులు చాలా ఉన్నాయని మానుష శాస్త్రజ్ఞు లంటున్నారు.

చెప్పవచ్చిందేమిటంటే-ఉత్పత్తికి నిబంధనలంటూ ఏర్పడితే, అది కుంటుపడుతుందని, ఆనాటి మనిషికి తెలుసు. అందుచేతనే, అతను స్త్రీ పురుష సంబంధాలకు నియమాలూ, నిబంధనలూ ఏర్పాటు చేసుకోలేదు. తండాలు పెరగడమే ప్రధానం.

రాను, రాను, మానవజాతిలోని ఈ కల్లోలాలు సమసిపోయాయి. జాతుల మధ్య వైషమ్యము, యుద్ధాలు కొంతవరకు చల్లారాయి. ఆ దశ లోనే, ఈ సంబంధాలకు కొన్ని నియమాలు ఏర్పడ్డాయి.

ప్రథమంలో-అన్ని జాతులలోనూ 'మాతృస్వామిక వ్యవస్థలు' అమల్లో ఉండేవి. పురుషుడు, శారీరకంగానూ, మానసికంగానూ బల వంతుడు కావడంవల్ల, స్త్రీ నుండి అధికారాన్ని గుంజుకొన్నాడు. అప్పటి నుంచీ 'పితృస్వామిక వ్యవస్థలు' అమల్లోకి వచ్చాయి. మాతృస్వామిక వ్యవస్థ తాలూకు చిహ్నాలు, ఇప్పటికీ కొన్ని జాతులలో కనబడతాయి. గోండులు, గదబలు, సుగాలీలు, మాతృస్వామిక వ్యవస్థనే అంటిపెట్టు కొని ఉన్నారు. మలబారులో ఇప్పటికి ఆ లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి.

సాంఘికంగా పురుషుడు పెత్తనానికి రావడంతోనే, స్త్రీ, పురుష సంబంధాలలో ఎన్నో మార్పులను ప్రవేశపెట్టాడు. యథేచ్ఛా విహారానికి కొన్ని హద్దుల నేర్పరిచాడు. దాన్నే 'వివాహం' అన్నాడు. వివాహాన్ని గురించిన ప్రసక్తి వేదవాఙ్మయంలో కూడా వుంది.

'వివాహం' ఒక్కటే అనుకోరాదు. 1. బ్రాహ్మణము 2. దైవము 3. ఆర్షము 4. ప్రజాపత్యము 5. రాక్షసము

6. అసురము 7. గాంధర్వము 8. పైశాచికము అని ఎనిమిది రకాలున్నాయి.

ఇందులోనూ మళ్ళా, శాఖ, ఉపశాఖలు చాలా ఉన్నాయి. మతం కులం, జాతి, ప్రాతిపదికమీద మరికొన్ని రకాలు ఏర్పడ్డాయి. ఒక కులం లోనేగల అంతశ్శాఖలలో, శాఖకొక విధంగా పెళ్ళిళ్ళు తయారయ్యాయి. బ్రాహ్మణ వివాహ సందర్భంలో హోమం చేస్తారు. బ్రాహ్మణేతరుల వివాహానికి దీపం వెలిగిస్తారు. ఇలాంటివి చాలా భేదాలున్నాయి

ఈ వివాహాలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఆయా యుగాలలోని మానవజాతి జీవిత విధానాన్ని, సాంఘిక వ్యవస్థను, నాగరికతను మనం అర్థం చేసుకోవచ్చు.

కృతయుగంలో—గాంధర్వ వివాహాలు రెండు: రాక్షస వివాహాలు కూడా తరుచుగా జరిగేవి. వాని వరుసలు అంతగా వున్నట్లు కనపడదు.

బృహస్పతి స్వంత అన్నయగు రుచికుని భార్యయైన మమతతో రతి క్రీడలలో తేలాడు. దీర్ఘంగా విచారించి చూస్తే, ఆనాటి వివాహాలు నేటి పాశ్చాత్య దేశాలలోని వివాహాల మాదిరిగా పొడగట్టుతున్నాయి. ...జారత్వం వల్ల సంతానం గలిగిననూ తాళి గట్టిన మగడేవగించడం కన్పించదు. దేవగురువైన బృహస్పతి భార్య తార, పరపురుషుడైన చంద్రునితో క్రీడించి గర్భవతియై, బిడ్డనుగని, చంద్రునికే ఇచ్చి, మాంగల్యం తాళిగట్టిన బృహస్పతిని జేరి కాపురం జేసింది.

త్రేతాయుగంలో - గాంధర్వ, రాక్షస వివాహాలకు స్వయంవరం తోడయింది. ఒకరిభార్య నొకరు తెచ్చియుంచుకొనుట ధర్మవిరుద్ధం. ఎంచ

బడింది, త్రయ్యారణ్యుని పుత్రుడైన త్రిశంకుడు అవివాహిత నొక్కతెను బలవంతంగా తీసుకొని వచ్చినందులకు, తండ్రి కుపితుడై వానిని రాజ్య భ్రష్టునిగా జేసి, చండాల రూపాన వర్ధిల్లుమని శపించాడు. రామాయణ కాలంలో ఏకపత్నీ వ్రతానికీ, ఏక భర్తృకతకూ చాలా ప్రాధాన్యంఉండేది. సీతాదేవిని రావణుడు ప్రతాంచి కొనిపోవటంవల్ల లోకం అతనిని దూషించింది. పట్టుదలకు ఏక పత్నీత్వమే రాముణ్ని అవతార పురుషునిగాజేసింది. వైవాహికధర్మం ఉన్నతస్థానమలంకరించింది. కాని అనులోమ వివాహాలు నిరాఘాటంగా జరుగుతూ ఉండేవి. ఒక్క వశిష్ఠుని వంశాన్ని తీసికొని విచారిస్తే సత్యం బోధపడుతుంది. వశిష్ఠుడు బ్రాహ్మణుడు. భార్య అరుంధతి మాల. కుమారుడు శక్తి మహాముని, ఆతని భార్య పుంగనూరు మాదిగ. శక్తిమహాముని కుమారుడు పరాశరుడు. భార్య బోయ. చాలా బ్రాహ్మణ కుటుంబాలు ఈ విధంగానే కనిపిస్తున్నవి. బ్రాహ్మణులు బ్రహ్మముఖము నుండి ఊడి పడ్డా మంటున్నారు. వంశవృక్షము పరిశీలిస్తే ఎక్కడనుండి ఊడిపడినదీ తెలుస్తుంది.

ద్వాపర యుగమునాటికి వావి వరుసలతో పెండ్లిండ్లు నిరాఘాటంగా జరగడం ప్రారంభమయ్యాయి. కుంతీదేవి కన్యగానే కర్ణుని కలియడం తప్పను అభిప్రాయం మోసులెత్తడం చేతనే దుర్వాసుని వరం అడ్డంగా పెట్టవలసి వచ్చింది. ఆవిడ వంశం కోసం, పర పురుషునితో సంగమించ డాన్ని వ్యాస భగవానుడు కూడా తప్పు కాదనలేక పోయాడు. ద్రౌపది సంగతికూడా ఇటువంటిదే! ఐదుగురు కలిసి ఒకే స్త్రీని సమిష్టి వంపిణీమీద భార్యగా వాడుకొన్నారు. నీతి సంబంధమైన ఈ సడలింపులు భారతకాలం నాటికి ఎలా వచ్చాయో మనం తెలుసుకొన్నాం. ఇక కలియుగంలో పెళ్ళిళ్ళకు మిగుల కట్టుదిట్టాలు జరిగాయి. వావివరుసలులేని

పెళ్ళిళ్ళు నల్వురినోటాపడి నగుబాటు పొందుతున్నాయి. బహుపతీత్వము లేదనే చెప్పవచ్చు. రాను, రాను ఈ పరిణామం, పురుషునికి అనుకూలంగా మారుతూ వచ్చింది. ఒక పురుషుడు అనేకమంది స్త్రీలను భార్యలుగా చేసుకోవచ్చు, కాని స్త్రీ మాత్రం, ఏక భర్తృకగానే ఉండాలి. ప్రస్తుత సమాజంలో ఏకపత్నీ, ఏకభర్తృకతా పద్ధతి ఆచరణీయంగా ఉంది.

ఇది ఏమైనప్పటికీ వివాహం కూడా "సమాజాంగీ కారాన్ని పొందిన వ్యభిచారం" అని పాశ్చాత్యుల అభిప్రాయం. కాని కవి రాజుగారు వివాహమనేది "జారత్వమునకు గౌరవస్థానము నిచ్చుటకై ఏర్పడినట్లు తోచకపోదు" అన్నారు. కాని, ఈనాడు వివాహ విషయంలో మనకు దోషం కనిపించడంలేదు. శతాబ్దాల తరబడి అలవాటు పడటమే దీనికి ముఖ్య కారణమనుకుంటాను. వివాహ వ్యవస్థను ప్రాతిపదికగా తీసికొని బ్రాహ్మణ వర్గం, తన పెత్తనాన్ని నిలుపుకొంటూ వచ్చింది. బాపడుచేసిన పెళ్ళేపెళ్ళి, సంస్కృత మంత్రాలే మంత్రాలు అనే స్థితి దాకా వచ్చింది. ఆనాటి ప్రజలూ అలాగే ఉండేవారు. బ్రాహ్మణ పురోహితుడు, శుభలగ్నాన్ని నిర్ణయించి, మంత్ర తంత్రాలతోనూ, బాజా బజంత్రీలతోనూ చేసిందే "వివాహం" అనే మూఢాభిప్రాయం ఉంది. ఇలాంటి సాంఘిక వ్యవస్థను, వివాహ పద్ధతిని, యోగి వేమన తన సహజ నర్మోక్తులద్వారా సంస్కరించడానికి చౌదరిగారు పూనుకొన్న సంగతి లోకవిదితమే. ఈ క్రింది పద్యం చూడండి.

ఆ. విప్రులెల్లరు జేరి వెఱ్ఱికూతలుకూసి
పతిని పతివిగూర్చి సమ్మతమున
మునుముహూర్తముంచ ముండెట్లు మేపెరా
విశ్వదాభిరామ వినురవేమ.

ఇలాంటి సంస్కరణోద్యమానికి చౌదరిగారు కూడా కంకణం గట్టుకోవలసి వచ్చింది. వారు హేతువాదంతో ప్రజలను మార్చాలని సంకల్పించారు. పట్టాభిషేకానికై వశిష్ఠుడు పెట్టిన ముహూర్తం శ్రీరామచంద్రుని వనవాసానికి దారితీసిందని రామస్వామి గారు సోదాహరణంగా వివరించారు దీనితో ప్రజలలో కొంతవరకు శుభలగ్నం శుభం కలిగిస్తుందనే నమ్మకం పటాపంచలయింది.

ఈ "వివాహవిధి" ఇప్పటికి రమారమి 35 సంవత్సరాల క్రితం వ్రాయబడింది. ఆనాటి నుండి ఈనాటి వరకూ బ్రాహ్మణేతర వర్గాల వారికిది ప్రామాణిక గ్రంథంగా ఉంటూ వచ్చింది. వరునికిగాని, వధువుకుగాని అర్థకాని మంత్రాలు చదివితే లాభమేమిటి? వారికి తెలియని భాషలో నీతులు బోధించటం ఎందుకోసం? ధర్మబోధలు, నీతి ఉపదేశాలు. మనిషిని సన్మార్గంలో ఉంచడానికేగాని, వినోదంకోసం కాదు గదా! అయినప్పుడు ఆ చెప్పేదేమిటో వారికి తెలియాలా వద్దా? అర్థమే కానప్పుడు మనం చెప్పితే ఫలితమేముంటుంది?

కాబట్టే కవిరాజు వివాహరంగంలో కూడా సంస్కరణను ప్రవేశ పెట్టారు. సంస్కృత మంత్రాలను తేటతెలుగు మాటల్లోకి మార్చి వేశారు. వధూవరులు, ఆచరించవలసిన విధులను సులభమైన తెనుగులో ప్రవచించారు. వారే స్వయంగా నడుం కట్టి అనేక వివాహాలు చేయించారు, ఒక పెళ్ళిచేయడం - వధూవరుల నుద్దేశించి ఒక ఉపన్యాస మివ్వడం "వధూవధులార! నేడు మీరు బ్రహ్మచర్యమును వీడి గృహస్థాశ్రమము ఉత్తమ మైనదనియు, గష్టతమమైనది యనియు మీ రెఱుంగవలయును. అతిథి అభ్యాగత పూజలు నిరంతరంబు విసుగులేక

యాచరించి, మర్యాదల జవదాటక, సత్సంతానమును బడసి, దేశ సౌభాగ్యమునకు జాతీయసౌభాగ్య మునకు తోడ్పడుదురుగాక! అని ఆచార్యసూక్తులు పలికేవారు రామస్వామి చౌదరిగారు.

తరువాత వరుడు ఇలా అంటూ "ఓ సౌభాగ్యవతీ! ఈః పెండ్లి పెద్దల యెదుట నీ ప్రాణిగ్రహణముజేసి ధర్మపత్నిగా జేనుకొని యుంటివి. పెద్దలు చెప్పినట్లు "అర్ధాంగి" వే కాక "యర్ధ సరస్వ" మగుదువు గాక నీవు నే నను భేదములేక మనము జీవయాత్ర గడుపుదము.

అంతట వధువు "ఓసుభగా! మీతో జీవయాత్ర గడుపుటకు నభిల షించి యిదుగో నా పాణిని నీ కొసంగుచుంటిని, నా జీవిత కాలమెల్ల స్త్రీ జన సహజమైన యోర్మితోడను ప్రేమతోడను, మీకు తోడ్పడుదును" అంటుంది. వరుడు, వధువుకు తాళిబొట్టు కట్టడం వెంటనే "సప్తపది" జరుగుతుంది. అంతట పెండ్లి మంగళ గీతంతో సమాప్తమవుతుంది.

ఈ చిన్నపుస్తకం-తెలుగు కుటుంబ జీవితంలో ప్రవేశ పెట్టిన మార్పు అంతా-ఇంతా కాదు, కరుడు గట్టి ఘనీభవించి పోయిన సంఘం లో చైతన్యం కలిగించింది. బ్రాహ్మణ పౌరోహిత్యం లేకుండా వంద లాది వివాహాలు జరిగాయి. నేటికి జరుగుతున్నాయి. ఇక ముందుగూడా జరుగుతాయి. ఈ పుస్తకం గావించిన మార్పు కవిరాజుగారినే ఆశ్చర్య చకితులను జేసింది, వారు మూడవ కూర్పు "తొలిపలుకుల" లో ఇలా వ్రాశారు."నేనీ గ్రంథము రచించునప్పుడు ప్రాజ్ఞులయినను నీ గ్రంథ స్థాభిప్రాయములకు సుముఖులుగ నుందురని తలంచనైతి, ఏలయనగా చిరకాలమునుండి ప్రాచీనాచారము సంఘశరీరమునం జీవికి జీర్ణమై గబ్బు కొట్టుచున్నను, తెలయంజాలని, తెలిసియుఁ దెలియని యట్టు

నటింప నేర్చిన యీ యాంధ్ర లోకంబు, విపరీతములుగఁ గన్పట్టు నీ యభిప్రాయములను మన్నింతురని యెట్లు తలంతును? భగవంతునకు నొక్క సంస్కృత భాషయే కాదు కాదు-ఒక్క గీర్వాణ భాషయే చెవి కింపు సొంపు నింపునని తలంచు నీ మూఢలోకంబు వివాహ మంత్రములు మాతృ భాషయగు తెలుగున జెప్పఁబడునప్పు డూకొట్టుననుట కవకాశ మేది? ఎన్ని దోషములున్నను నొక్క లగ్నమునఁ బెండిలి జరిగిన యెడల సర్వ సుఖములును, సకలైశ్వర్యములును, నాయురారోగ్య ములను కల్గునని విశ్వసించు ప్రాకృత లోకంబు నా యభిప్రాయములకు మాఱాకుగా నుండదని యెట్లు తలంతును? "బ్రాహ్మణో మమదేవతా" యను వాక్యమునందు నమ్మకము గల మూర్ఖ ప్రపంచంబు బ్రాహ్మణులు కాని వారిచే వివాహ కలాపంబు జరుపఁబడుటకు నంగీకృతిఁ జూపునని యెట్లనుకొన వీలు కల్గును? కాని యాంధ్ర ప్రపంచమందు విచిత్ర పరిణామము కడు నత్యల్ప కాలములోనే కల్గినది. ఈ పరిణామము నాకే విస్మయము కలిగించుచున్నది." రామస్వామి గారి వివాహ పద్ధతి అమల్లోకి రాపడం వల్ల ప్రధానమైన ఉపయోగాలు మూడు జరిగాయి.

ఒకటి : బ్రాహ్మణ పౌరోహిత్యంవల్ల జరిగే దోపిడీ అరికట్ట బడింది.

రెండు : వైవాహికం ద్వారా తమకు సంక్రమించే బాధ్యతలు విధులు ఏమిటో వధూవరులకు ఇట్టే అర్థం కావడం.

మూడు : అట్టే పటాటోపం లేకుండానూ, న్యాయశాస్త్రానికి భిన్నంగాని పద్ధతికోనూ, దుర్వ్యయం లేకుండానూ, వివాహాలు జరి పించడం.

ఈ విధంగా రామస్వామి చౌదరిగారు ప్రవేశ పెట్టిన మార్పులన్నీ ఒక ఎత్తు, ఇదొక్కటే ఒక ఎత్తు.

# కవిత్వ పరామర్శ

రామస్వామి చౌదరిగారి జీవిత విశేషాలనూ, వారు రచించిన గ్రంథాలనూ దిఙ్మాత్రంగా పరామర్శించాను. ఇప్పుడు వారి కవితలోని తన రామణీయతలను స్థాలీపులాకన్యాయంగా పరిశీలిస్తాను.

పూర్వ సంప్రదాయ సిద్ధమైన శార్దూల వృత్తంతోనూ, దైవ ప్రార్థనతోనూ కవిత్వారంభం చేయడం రివాజు. "శ్రీవాణీగిరిజాశ్చిరాయ" అనే మంగళ శ్లోకంతో కవిత్రయం వారు మహా భారతాన్నీ, శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్" అని బమ్మెర పోతన భాగవతాన్ని ఆరంభించారు. కాని, చౌదరిగారు ప్రాచీన సంప్రదాయాన్ని పరిత్యజించి, చంపకమాలతో కృత్యారంభం జేశారు. బీదసాదలను పోషించకుండా రాతిరప్పలకు సర్వస్వాన్ని ధారబోసే పరమ భక్తులను వ్యాజ స్తుతితో మెచ్చుకొన్నారు.

చ. "మలమల మాడు పొట్ట, తెగమాసిన బట్ట, కలంత పెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జ్ఞాపకుండ, ను
త్తల పడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిటల్
పొలమును బొట్ట నిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్"

చక్కని వ్యంగ్యం చౌదరిగారి సొత్తు అనడానికి ఈ క్రింది పద్యాలను పరీక్షించండి.

ఉ. "చేసిన దోస మీశ్వరుని చింతనదే నశియించునన్నవి
శ్వాసముగల్గి రేఁబవలు, పాప మొనర్చుచుఁ దీరినప్పుడే
దో సమయంబునం గలముందొందరగాఁగొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పదపంకజముల్ శరణంబు వేడెదన్.

ఉ. కామపరీతబుద్ధి గుణకర్మపరీక్షను మాని బ్రాహ్మణ
స్వాములఁజేసి కొందరిని బానిసలం బొనరించి కొందరిన్
బూమెలు చెప్పి యీ భరతభూమిఁ గలంచెడి వర్తమాన హిం
దూమత సంప్రదాయమును దోసిలి యొగ్గి భజింతు విచ్చలన్.

ఉ. శౌచ్యములేని మిండతలపౌత్తయినన్ బహుపాప మంచు వా
క్రుచ్చుచు వాముర్చులయి కొక్కిరివేలుపు నాగవాప మం
దిచ్చెడి కమ్మతావిగల యెంగిలి బాగలమీఁది పేర్మిఁచే
గ్రచ్చలు యజ్ఞముల్ సలుపు బ్రాహ్మణ దీక్షితులన్ స్మరించెదన్.

కవులు తమ కావ్యాలలో రసపోషణకోసం అలంకారాలను వాడటం పరిపాటి. కొంతమంది కవులు తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శించటానికే శబ్దాలంకారాలను, అర్థాలంకారాలను ఇష్ట మొచ్చిన రీతిగా ప్రయోగించటం జరుగుతున్నది. అందువల్ల ఒక్కొక్కప్పుడు రసపరిప్లుతికి భంగంకూడా వాటిల్లడం కద్దు. రామస్వామిగారు రసౌచితికి భంగం లేకుండా అలంకారాలను ప్రయోగించారు. చౌదరీ గారి కవిత్వం శబ్దాలంకార శోభితంగా యమకప్రాసలతో గూడి మనో రంజకంగా ఉంటుంది. ఈ పద్యాలను చూడండి:

గీ "చదలు దాఁకు మ్రాని మొదలు కుదులు పొదల
మొదలు తుమ్మెదల రొదలు కదలు నదులు
విదులు క్రొందావి **విరిగుత్తి** పదులు పొదలు
మొదలు తుదలేని ముదిగొండ మొదలుగంటి"

* * *

తే "అంకపడి దక్షిణాంబుధి యంకమందు
లంక, శివలెంక, ప్రతిభాంత లంక వెల్గు
నిత్య నిష్పంక నిశ్శంక నిష్కళంక
వంక గావరా దా వంక వంక వంక"

* * *

సీ "పలుగాకి వలుగాకుఁ బొలిపుచ్చి తననాఁడు
    చీకాకు పడకుండఁ జేసినాఁడు
గాటంబుగాఁ జెలగాటంబుగాఁ జెల
    రేఁగి మూర్తురఁ జీల్చి రేఁగినాడు
గోపురంపు పురంబు బాపురే! యన మూఁడు
    కొండకొమ్ములమధ్యఁ గూర్చి నాఁడు
కలిచేతఁదన్ని యాకలిమాన్పి గిలిమాన్పి
    వలిమాన్పి యెల్లర నిలిపినాఁడు

గీ కురురునకుఁ బట్టుగొమ్మయై కుదిరినాఁడు
నాఁడు తనుఁగొల్వ నొనరించినాఁడు నాఁడు
ఎదురు లేని నాయకుఁడై నాఁడు నాఁడు
రావణుం డార్యలోక విద్రావణుండు.

రామస్వామి చౌదరి గారి శైలి సహజంగాను, కృత్రిమాలంకార రహితం గాను ఉంటుంది. ఎక్కడా కుంటు దబకుండా మధురాతి మధురంగా, మకరంద ప్రవంతిలా పద్య గమనం సాగుతుంది. ఈ క్రింది పద్యం వీక్షించండి.

చం. "అనిన యనంతరమ్మున ప్రియంమ్మున రమ్మని చెప్పి తోడుతోఁ
జనియెను దారిఁజూపుచుఁ బ్రశస్త మనోహర సౌరభాఢ్య పు
ష్ప నివహ రంజ దత్యధిక వంశాల మంజుల కుంజ పుంజ సం
జనిత మధావరోధ పరిస్రుత భామకు నొక్క సీమకున్"

రామస్వామిగారి కవిత రసభరితమై, ఔచిత్య సమన్వితమై, ధ్వని గర్భితమై, శిల్పసమన్వితమై, ఉదారాశయ సందీపితమై అలరారుతూ ఉంటుంది. వారి కల్పనా శక్తి అనన్యం, అ ప్రమేయం. వారి భావ విహంగాలు దూరతీరాలకు పయనించి అక్కడ సొగసులను, సొబగులను గుదుగుచ్చి, పుణికి పుచ్చుకొని, కమనీయంగానూ, హృద్యంగానూ మన ముందుంచుతాయి అదేం గ్రహచారమోగాని పరాయివాణ్ణి మెచ్చు కొన్నట్లుగా తెలుగు వారు తనవారిని మెచ్చుకోలేరు. అది మన కర్మం! ఆంగ్ల భాషలోని ఎంతచచ్చు పద్యాన్నయినా మనం ఆకాశాని కెత్తేస్తాం. తెలుగు భాషను "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని పాశ్చాత్య పండితులు ప్రశంసించినా, మధురమైన మన మాతృ భాషలోని ఎంతమంచి పద్య మైనా మనకు రుచించదు. విశ్వసాహిత్యంతో తులతూగ గల రచనలు చేసిన తెలుగు వారున్నారు. అయితేనేం? ఏ దేశంలోని ఏ ఉత్తమ కవితకూ ఎందునా తీసిపోని పద్యాలు కవిరాజాగా రనేకం వ్రాశారు. ఉదాహరణకు "నందనోద్యానము" ను ఎంత మధుర మనోజ్ఞ భావ పరిపుష్టితంగా వర్ణించారో చూడండి.

సీ. "ఒక వంక వీక్షింప నుత్ఫుల్ల సౌవర్ణ
పంకజాత పరాగ పంకిలంబు
ఒక చాయఁ గనుగొన్న శుకశారికానీక
కోకిల కాకలీ కూజితంబు
ఒక త్రేవఁ బొడగన్న వికచ మందార
పుష్ప మరంద గురు ఝరీప్లావితంబు
ఒక కోనఁ బరికింప నురు వేపథుః గ్లాని
సంహారక సమీర చాలితంబు
గీ. మధుర వేణు వీణాగాన మండితంబు
స్వైరకేళీ సహారిణీ సంకులంబు
విటవిటీ నటీనట పరివేష్టితంబు
నందనోద్యాన మానంద మందిరంబు.

శబ్దాన్నుండి అర్థాన్నీ పూర్తిగా విందుకో గలగడం మహాకవులకు గాని చేతగాదు. ఆ పని చౌదరిగారు చేశారు. పాద పూరణ కొఱకు "లొల్లు పదాలు" వాడటం వారికి పూర్తిగా గిట్టదు. అదీ కారణంగానే చౌదరిగారి ప్రతి పద్యమూ తీర్చిదిద్దిన ఆణిముత్యంలా ఉంటుంది. ఒక ప్రయోజనాన్ని ఆశించి వ్రాసిన కవితలో ఇన్ని సుగుణాలు ఉండటం చాలా అరుదు. కాని, చౌదరిగారి కవితలో అవన్నీ ఉన్నాయి. అందు చేతనే వారి కవితను చదువుతూ వుంటే మకరందం ఆస్వాదించినట్లుగా ఉంటుంది.

ఆంధ్ర సాహిత్య చరిత్రను పరిశీలిస్తే "ఆది కవి" ఎవరనే విషయం మీద అనేక తర్జన భర్జనలు జరిగినట్లుగా తెలుస్తుంది. భాషా శాస్త్రజ్ఞులు కొందరు నన్నయ భట్టారకుడు "ఆది కవి" అంటే-మరి

కొందరు-నన్నెచోడుడు అన్నారు. ఈ అనవసనంపైన చర్చల్లోకి దిగకుండా కవిరాజు సత్కవిలోకం సమ్మతించేటట్లుగాను, శాఖా చంక్రమణంగాను ఆంధ్ర కవితా పరిణామాన్ని ఈ విధంగా పేర్కొన్నారు.

సీ. "మోటుమానిసి నోట మోజుచిందులు ద్రొక్కి
        పనితంపుఁ బాటలఁ బాడ నేర్చి
    జోలపాటలు నేర్చి యేల పాటలు నేర్చి
        గొబ్బిళ్ళ పాటల గునుకు నేర్చి
    తేవారములు నేర్చి ద్విపద లెన్నియొ నేర్చి
        త్రిపద చొక్కపు నడక తీరు నేర్చి
    రగడ లెన్నియొ నేర్చి రహి వక్కరలు నేర్చి
        జంగమ కథ మేలుచాలు నేర్చి

గీ. చాల గీతముల్ నేర్చి సీసములు నేర్చి
    వెండి బంగారు పద్దెముల్ వెండి నేర్చి
    ప్రోడపిల్లయై పాతరలాడ నేర్చెఁ
    దెలుఁగు కబ్బపుఁ గన్నియ దెలివి తోడ.

గీ. "ఇంతియే కాని నన్నయ వింతగాఁగఁ
    బుణికి గంటముఁ జేఁ బట్టి కణతలదరఁ
    గైతఁ బుట్టించెనను మాట కల్లమాట
    బోధలేని కాకవులు చెప్పుదురు గాక.

కవిరాజు రామస్వామిచౌదరిగారు తెలుగుకవి. తెలుగుకవిత్వంలో సంస్కృతపదాలకంటే జాతీయ పదాలనే ఎక్కువగా వాడాలని ప్రచారం చేశారు. అంతేగాని సంస్కృతభాషయందు వారికే ఈవిధమైన వైషమ్యం

లేదు. తెలుగు పదాలను వాడిన కవులంటే అయనకు అపారమైన ప్రీతి. నన్నెచోడుని కవిత్వంలోని తెలుగు నుడికారం. తెలుగు పద ప్రయోగాలు వారిని సమ్మోహితులను చేశాయి. నన్నెచోడుని గురించి వారేమంటున్నారో చూడండి.

చం. "నపరన వేదియై తెలుఁగు నాట వెలుంగు కవిత్వసంక్రముల్
గపుసెనఁ దీసి కన్నర ప్తగల్గిన సత్కవిరాజు, రాఁ స
త్కవియగు నన్నెచోడరసికప్రభు జాను తెనుంగు కబ్బపుం
జవు లెఱుఁగంగ సాధ్యమె రసజ్ఞులు ప్రాజ్ఞులు గానివారికిన్"

ఇక వేమనను గురించి——

ఉ. "ఆయతరాజ్యవైభవము నంత త్యజించుచు సన్యసించి జా
తీయపుఁ దీరుఁతీయములు తెట్టలుగట్టఁ వెలుంగు కబ్బ మా
ప్యాయసమౌ విధంబుగను బల్కిన మా చినవేమరెడ్డినిన్
బాయక ప్రస్తుతించెదను బల్మరు భక్తి పరస్పరంబుగన్"

తరువాత చేమకూర వేంకటకవిని గురించి——

కం. "అంకిలిలేని కవిత్వము
జంకని సాహితిని జూపి సత్కవికోటిన్
సుంకం బడుగంగల మా
వేంకటకవిరాజు శక్తి వినుతి యొనర్తున్"

గ్రంథ రచనకు ముందు "కుకవి నింద" మన పూర్వకవుల సంప్రదాయం. ఆ సంప్రదాయాన్నే అనుసరిస్తూ ఎంత ప్రౌఢంగా చమత్కరించారో చౌదరిగారు చూడండి.

గీ. పూర్వకవి సంప్రదాయమ్ము బుజ్జగించి
కుకవి నింద నొనర్చుట గొప్ప యగునె?
కుకవు లుండుటచేతనే సుకవిచంద్ర
కీర్తిచంద్రికల్ దిశలెల్లఁగెరలియాడు;

చం. "కలిగినదానిలో మనసుకల్గిన దానిని కైతచెప్పు వా
రలు కవిరాజులో! కుకవి రాజులో! భక్తి పురస్సరంబుగాఁ
బలుకు వెలందికిచ్చు నెడఁ బాసము! కాకవులంచు మాటికిన్
బలుకుచు దూరుపెల్లఁదగనా ? తెగవాగిన మెప్పుగల్గునే?

"లోకో భిన్నరుచిః" అని లోకోక్తి గదా? ఇక , కవిత్వం ఎవరు వ్రాసేటట్టు? కవిరాజు గారు చెపుతున్నారు.

గీ. "పాక మెట్లున్న నేమి నంబరము? కవు లె
ఱుంగ రాకా "లోకో భిన్నరుచి" యనంగ
రసిక శేఖరుల నెల్లరకు రుచించు
కమ్మతనమునె చూపింతుఁగైతలందు.

కవిరాజు శక్తి అపూర్వమైనది, అప్రతిహతమైనది. తెలుగు నాట మరే కవులకూ ఆ శక్తి లేదని ఘంటాపథంగా చెప్పవచ్చు. వారు నిశిత మైన విమర్శకులు; ప్రతిభావ్యుత్పత్తులు గల కవి శేఖరులు. వారి విమర్శ కవితావేశాన్ని గాని, కవిత్వం వారి విమర్శనా దృష్టిని గాని ఎక్కడా, ఎప్పుడూ కుంటుపఱచ లేదు. పైగా ఒక దాని కొకటి దోహదం చేసు కుంటూ ఒకదానివల్ల ఒకటి ప్రకాశించాయి. ఇందుకు వారి సూతపురాణం లోని ద్వితీయాశ్వాసం నిదర్శనం. ఈ అశ్వాసంలో రామస్వామిగారిలో

వున్న ఈ రెండు శక్తులూ పరాకాష్ఠ నందు కొన్నాయి. ఈ ఆశ్వాసం లోనే వారు మన పూర్వులు చిత్రించిన స్వర్గాన్ని అపహాళన చేశారు. కాని కవిత్వ దృష్టితో చూస్తే ఒక్కొక్క పద్యం ఒక్కొక్క రసగుళిక.

సూతమహర్షి స్వర్గాన్ని చూడటానికి వెళ్ళాడు. నాక పురమంతా నానా కల్లోలంగా ఉంటుంది. అచ్చట తాగి తందనాలాడేవేల్పు జంటలు కనిపిస్తాయి. సూత మహర్షి చెపుతున్నాడు.

ఒక ప్రక్క—

గీ. మసకలాడు నాగుల మాడ్కి మసలి బాహ్య
లోక మాదమఱచి రసలుబ్ధు లగుచు
గాఢతర పరిష్వంగ సౌఖ్యమునఁ దేలు
వేల్పుజంటల గనుఁగొంటి వెంటవెంట.

ఇంకొక ప్రక్క—

గీ. సురనువాచేరఁ దెగఁ ద్రావి సోడుముట్ట
మైమఱచి నేలపైఁ గూలి మరులు కూన
రాగములుతీయు గోవాంద్ర రాగరస ని
మగ్నతను జూచి యానంద మయుఁడ నైతి

అంతలో—

ఆ. కంచుకంబుఁదీసి కడగంటితోఁ గాంచి
జడుపులేక దుమికి మడుగులోన
పీతకొట్టుచున్న యిగురుఁ బోడి యొకర్తు
కన్నుసైగ జేసె నన్నుః జూచి

ఇంకే ముంది? సూతమహర్షి గుండె గుభేలు మంది. ఊర్వశి తన దగ్గరకు వచ్చి సయ్యాటలు మొదలు పెడితే ఏం చేసేటట్లు? కాదు కూడదన్నా ఆమె కోరుకున్న వ్యక్తి అర్జునుణ్ణి నపుంసకుని చేసిన వేల్పు జవరాలు తనను ఉక్కిరి బిక్కిరి చేయక వూరుకుంటుందా? చూడండి ఆయన ఆందోళన !

గీ. "గిల్లి కొఱుకుల పొత్తంబు నెల్లఁజదివి
యారితేరిన యామె సయ్యాటలందు
బడుగు బైరాగి కెట్టు లీపాట్లు తెలియు ?
వంగి జోహారుఁ జేయు చేపాటియెఱుఁగు" ?

ఇలాంటి దృశ్యాలను చూచి చూచి ఒక చోట తల చేతులతో ఇరికించు కొని ఇలా అనుకో సాగాడు సూత మహర్షి.

గీ. "కల్లునిచ్చెడి చెట్లకుఁగల్గ గౌర
వంబు పెఱ వానికిని లేదు. వజ్రమోఱ
గట్టికట్టెడి బోగంపుగరితకున్న
పలుకుబడి కానరాదెట్టివారి కిందు.

గీ. ఇండ్లొ యున్నవి గాని పెండ్లిండ్లులేవు
అంద్రొ యున్నారు కాని యిల్లాండ్రులేరు
బాగు ! శివ ! శివా !! ఇది వట్టి భోగభూమి
యుండరాదిందు మావంటి యోగులకును".

సూత మహర్షికి ఒక అనుమానం కల్గుతుంది. స్వర్గం "విట విటీ నటీ నట" పరివేష్టితం గదా! అచ్చట పసి పిల్లలు కనిపించరేమిటి? అనేది

ఆ అనుమానం. స్వర్గంలో పసిగందులు వుండరని మనకు తెలిసిన విషయమే. కాని కారణం మాత్రం మనం ఎన్నడూ ఊహించి ఎరుగం. కారణం తెలుసుకుందామని సూతమహర్షికి కోర్కె గలిగి ఒక జవరాలిని అడుగుతాడు. ఎంత అందంగా అడిగాడో చూడండి.

కం. "ఇందఱు యువతీ యువకులు
క్రందుగ నున్నట్టి చోటఁ గన్పించ రహో!
చిందులు తెగఁద్రొక్కెడి కసి
గందులు వచియింపుమమ్మ కారణ మన్నన్"

ఆమె ఏమంటుంది?

ఉ. స్వైరవిహార నిష్ఠమెయి సర్వదిగంతర దివ్యదేశ సం
చారముఃచేయు మాకు గ్రహచారయి చాలక సంతుగల్గినన్
వారలనెల్ల గన్న మగవారికి నిత్తుము కాని పెంచు నా
చారములేదు స్వర్గమున సత్యముఁ జెప్పితినంచు నామెయున్.

అని వూరుకుందా? ఇంకా ఆమె ఇలా అంది,

గీ. ఆలకింపుము స్వర్లోక మందునున్న
మానినుల యందుఁబెండ్లిండ్లు లేని కారణమున మరులెత్తి మర్త్యలోకమ్ము, దేశ
దేశముల పయింబడి వారు తిరుగుచుంద్రు.

నిఖిలపురాణవ్యాఖ్యాన విజ్ఞాన సమేతుడైన సూతమహర్షి అందంగా అడిగాడను కొంటే, అంత కంటే చక్కగా సమాధానం

చెప్పిందా వేల్పు జవరాలు. ఇది అపూర్వమైన కళాసృష్టి ఈ సృష్టి తెలుగు కవులలో ఒక్క రామస్వామిచౌదరి గారే చేయగలరని సగర్వంగా చెప్పవచ్చు.

కవిరాజు రామస్వామిచౌదరిగారు పురాణాలు మొదలు ప్రబంధాల వరకూ బాగుగా చదివి ఆకళింపు జేసికొన్నారు. అందువల్ల వాటిలోని కొన్ని తీరులకు వారు మెరుగులు దిద్దారు. చౌదరిగారి కవితలో నన్నె చోడుని కవితా వైఖరులు కొన్ని గోచరిస్తున్నాయి. నన్నెచోడుడు "జాను తెనుగు"లో రచించి దేశికవితా సంప్రదాయానికి దోహదంచేసిన కవి. నన్నెచోడుని సీస పద్యాల జిగి చౌదరిగారి కవితలో ప్రత్యేకంగా పుణికి పుచ్చుకొన్నట్లుగా ఉన్నది. కుమార సంభవములోని పర్వత వర్ణనతో కవిరాజు రామస్వామిగారి ఈ పద్యాన్ని పోల్చి చూడండి.

సీ. "గండోపలచ్ఛటా గండూషితప్రస్థ
　　వింధ్యపర్వతపంక్తి వెనుకనెట్టి
పంచాస్యశార్దూలవన్యేభ సంకీర్ణ
　　ప్రస్ఫురద్దండకా వనముదాఁటి
ప్రావృట్సమారంభ బహువయస్సంపూర్ణ
　　దుర్లంఘ నిర్ఝరుల్ దూఁకివచ్చి
విషసరీ సృపచమూ పిష్కంభ దుర్లోక
　　తృణలతాగుల్మముల్ తీసివచ్చి

గీ. యార్యసంఘంబు మునిపల్లె లచ్చటచటఁ
గట్టుకొని వేగుపనికినై కాపురంబు
లుండి బహుజంతు హింసా ప్రయుక్త యజ్ఞ
యాగములు చేయజొచ్చిరి యాగకుండ :.

శ్రీకృష్ణుడు రాయబారిగా హస్తినాపురాన్ని సందర్శించిన సందర్భంలో అచ్చటి ప్రజలు శ్రీకృష్ణుని గత కార్యాలను తలపోస్తూ అతన్ని పొగడిన తీరును సీసపద్యాలలో తిక్కన వర్ణించాడు. ఇదేవిధంగ కంసుని పట్టణంలో శ్రీకృష్ణుడు ప్రవేశించి వచ్చుడు, స్త్రీలు అతన్ని స్తుతించిన ఘట్టాలు బమ్మెర పోతన భాగవతంలో గుప్పిగుచ్చాడు అలాంటి పొగడలు కొన్ని రామస్వామిచౌదరిగారు సూతపురాణంలో చూపించారు

యదార్థ రామాయణంలో రావణాసురుని చూచిన వెంటనే హనుమంతు డీ విధంగా ఆలోచించ సాగాడు :

సీ. "వీఁడచే రోరాయ వీఁడచే చౌరఁబాటి
కై కొన్న వాఁడచే గాలికలము
వీఁడఁచే ముక్కంటి వీడచే పైకెత్తి
క్రొండాడినాఁడచే కొండవీడు
వీడఁచే నాఁడచే వెట్టి వారలఁజేసి
పీడించినాఁడచే వేల్పుమూఁక
వీడఁచే కొడకుచేఁబెడ తెక్కలనుగట్టి
తెప్పించినాఁడచే దివిజనాథు

గీ. వీఁడచే తనపీడిడు జోడుజాడ
లేనిదానిఁగా జేసిన మానఘనుడు
చేతులనునెత్తి జోహారుసేయు తలఁపు
పుట్టుచుంటె నిప్పుడు త్రొటఁగట్టఁబడిన !"

భట్టుమూర్తి వృత్తాలను, సీసాలను కొత్త పుంతలు త్రొక్కించాడు. ఈ నూతన పోకడలు కొన్ని కవిరాజు కవితలలో కనిపిస్తాయి. ఈ పద్యం చూడండి ;

సీ. "ఈరేడు జగములకీరేడు తగువాఁడు
వేరేఁడు తగఁడన్న పేరుఁగాంచె
చదువు సాములునేర్చి చదువు సాములనేర్చు
చదువు సాములనేర్చు చతురుడయ్యె
గోవాంద్ర సరిదిస్థి గోవాంద్రఁ గనియిద్ది
గోవాంద్రఁ గనుదంచుఁ జావఁగొన్తై
ఆ వగతురజ్జ్ఞు నావఁగ ఖురిచుట్టు
నావగదొరఁబెట్టి యధికుడయ్యె

గీ. ధరణిఁ బుట్టుట గిట్టుట కొఱకుఁగాదె
యెప్పుడో యొకప్పుడు చావుతప్పబోదు
జాతి యభివృద్ధికొఱకునై పమపిపోయె
రావణుండెంత ధన్యుఁడో ప్రథన భూమి"!

రామస్వామిచౌదరిగారి కవితలో ఒక ప్రత్యేకత ఉంది. అది ఉత్తమశైలి. తిరుపతి వేంకట కవుల పద్యాల చదవడంలోని ప్రతిభ వారి శిష్యులలోని కొందరికి వుంటే, వారి "కవితాధార" మాత్రం ఒక్క రామస్వామిగారికి మాత్రమే పట్టుబడింది. కొన్ని సందర్భాలలో కవిరాజు గారి కవనం అత్యున్నత శిఖరాల నందుకొంది. ఈ విషయాన్ని వేంకట

శాస్త్రిగారు '†కొందరు కవిత్వ సంప్రదాయాలు నేర్చుకోడానికి నాకు శిష్యులుగా చేరారు. కాని ఎవరికీ అబ్బింపేకాదు. ఒకరికిమాత్రమే నా త్రోవ పట్టుబడింది. దానికి నేను నిమిత్తమాత్రం. అలా కాక పోతే అభ్యసించాలని మొదలు పెట్టిన వాళ్ళకెవళ్ళకీ లవలేశమూ అంటకపోవడ మేమిటి ?' అన్నారు.

చెళ్ళపిళ్ళ వారి కవితాశైలి చౌదరిగారి మనోఫలకముపై గాఢ ముద్ర వేసింది. తమ గురువుగారివలె సమగతిలో. యమక ప్రాసలతో. అత్యంత రమణీయంగా రామస్వామిచౌదరిగారు పద్యాలను నడిపించారు సూతపురాణం చతుర్థాశ్వాసంలోని ఈ పద్యాలను చూడండి :

ఉ. 'కాలము మాఱిపోయె మన కాలముఁ జెల్లిపోయె దు
ష్కాలము దాపరించె మన కన్నులముందఱె యెంత మందియో
కాలముఁజేసినారు గతకాలమె మేలుగఁ దోచునక్కటా !
గాలమురీతి గ్రుచ్చుకొను కష్టపరంపవచ్చెఁ గంటిరే !'

* * *

ఉ. 'రాగములేని రాధ యనురాగము క్రొన్నన సాగుచుండఁగా
రాగముదంబు కృష్ణుని సరాగములాడెడి కోర్కెపుట్టగా
రాగముఁదీయుచున్ సుమపరాగముపై విదిలింప బట్టుకో
రాగ మురారి. యందకయె తాఁగతనంబున దాటుజాణయై'.

---

†"మా విద్యార్థి దశ—నాటి కవిత్వము" అను వ్యాసం—శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు. భారతి—మే—1941.

నవ నవోన్మేషమైన ప్రతిభ, పాండిత్యమూగల మహాకవి చౌదరి గారు. వారి కవితలోని విలక్షణత, కవితా మాధుర్యం. పదగుంభనం, భావవిశేషం, ప్రసాదగుణం వర్ణింప సామాన్యునికి సాధ్యమా ? చౌదరి గారు రసవత్తరమైన ఆశుకవితను అనర్గళంగా చెప్పగలశక్తి సామర్థ్యం గలవారు. కనుకనే, కొప్పరపు కవులు, తిరుపతి వేంకట కవులతో వాగ్వివాదానికి దిగినప్పుడు రామస్వామిగారు 'మీరు మా గురువులను జయించగలరా ? మీ కాశక్తి యున్నచో ముందు నన్ను జయించండి ?' అని సవాలు చేశారు. † కొప్పరపు సుబ్బారాయశర్మ గారికి 3—9—1913 న యిలా వ్రాశారు ;

సీ. 'అరవదేశంబున నవధాన మొనరించు,
　　టోకాద ! యిదియు గుంటూరు సీమ,
వల్నాటి సీమలోఁ బద్యంబులను జెప్పు —
　　టోకాద ! యిదియు గుంటూరు సీమ,
ఆ యూర నాయూర నాశుకవిత సెప్పు -
　　టోకాద ! యిదియు గుంటూరు సీమ,
గుడివాడ సీమలోఁ గొన్ని యూళ్ళను జెప్పు-
　　టోకాద ! యిదియు గుంటూరు సీమ.

గీ. యెట్లు దక్కించుకొందురో యిపుడు మీరు
విందుకొల్వున మీ కున్నదండి బిరుదు,
బూరకేపోదు పూజ్యులఁ గాఱులఁజవ,
నాశుకవిసింహ కుండిన హంసలారా.

---

† తిరుపతి వేంకట కవుల గీరతము.

ఉ. బట్టులరీతి బద్యముల బల్కఁగ నెకాని శతావధానమే,
పృచ్ఛలనేది చేసితిరి బండితులెల్లరు మెచ్చినాఁటలో,
గుట్టుగ బోవకీగతిని, గొంటెతనంబును జేయజూతురే,
పెట్టలు గ్రొవ్వి పుం[illegible]పయి. పీరము జూపిన లాగుదోపదో.

సీ. శతఘంటకవనంబు సల్పుదుమన్న మీశక్తి యడంపనే జాలనొక్కొ
అష్టావధానంబు నాచరింతుమన మీశక్తి యడంపనే జాలనొక్కొ.
ఆశు కవిత్వంబు నాచరింతుమన మీశక్తి యడంపనే జాలనొక్కొ,
సద్గ్రంథ రచనంబు జరుపుదుమన్న మీశక్తి యడంపనే జాలనొక్కొ.

గీ. ‘ఇంగిలీషున వత్తురో యెఱిగి యడప
గరమునే జాలానొక్కొ మా గురువులేల,
రండు వేగ మీ బిరుదులు దెండు పెట్టి,
పొండు నిండు సభను గౌరవపు గవులార !

గీ. ఓడినాఁడని తలపోయు వాఁడ మీరు
నాకుఁ బ్రత్యుత్తరంబును నీకమౌన,
ముద్ర వహియింతురేని నీ ముచ్చటెఱిగి,
ముందుపనిఁ జూడుఁడీ కౌరవపుఁగవులార’.

సాహిత్యరంగంలో చౌదరిగారు సవ్యసాచి, వారు పద్యం ఎంత రసవత్తరంగా వ్రాసేవారో, గద్యం కూడా అంత గంభీరగమనంతో రచించేవారు. ఈ గద్యాన్ని గమనించండి. మీకే తెలుస్తుంది. “అంత కూతవేర్పిటు దూరంబున నుండి యభంగ భంగ శీతకో పేతంబయి. సౌగంధి కాబ్జ మనోజ్ఞ మృదుమధుర ప-షళ సంవాసితంబై, మందంబై

నత యాడు నమీర కుమారుచే దైర్థికుల నర్ఘ్య పాద్యాది విధులం బూజింపించుచు. గేళీలోల కలహంస కలకంఠ స్వరంబున నభ్యాగతుల నాహ్వానించుచు. మూర్మిమాలికా డోలికల నతిథి ద్విజ బాలికల నత్కరించు త్రిపథగాహార్ది పవిత్రోదకంబుల నవగాహంబుజేయ బుద్ధిపొడముడు" ఈ విధమైన బింక, పొంకములతో గద్యం రచించే వారు ఇప్పుడెంతమంది వున్నారో చెప్పండి ?

రామస్వామి చౌదరిగారి కవితా వైశిష్ట్యాన్ని రాజకీయ నాయకులే గాకుండా ఎందరో సుప్రసిద్ధ సాహితీ వేత్తలు ఎంతగానో ప్రశంసించారు.

"సంఘ శ్రేయస్సుకు, పీడిత ప్రజా శ్రేయస్సుకు తమ కవితా శక్తిని ధారబోసిన ధన్యజీవియేగాక, "సత్యం వద, ధర్మంచర" అను సూక్తులను త్రికరణ శుద్ధిగా ఆచరించిన పవిత్రాంతః కరణులు శ్రీ రామస్వామిగారు" అన్నారు కేంద్ర సహకార శాఖ ఉపమంత్రి శ్రీ బి. ఎస్ మూర్తిగారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి సంస్మరణ మహాసభలో కేంద్ర రక్షణశాఖ స్టేట్ మంత్రి కొత్త రఘురామయ్య గారు ప్రసంగిస్తూ--

"శ్రీ రామస్వామిగారి రచనలు మా చిన్నతనంలో సరిగా గ్రహించక పోయినా, మొహంజొదారో, హారప్పాలలో బయల్పడిన శాసనాలు కట్టడాలు మున్నగు ఆధారాలవలన తేలిన చారిత్రాత్మక సత్యాలను అంతకు ముందుగా రామస్వామిగారు తమ రచనలలో ప్రతిపాదించారని నేను గ్రహించి ఆశ్చర్య చకితుడనైనాను. రామస్వామి నాయకర్ ఉద్యమానికి

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు "రామస్వామిగారు గొప్ప కవి. 20వ శతాబ్దిపు సాహితీ దిగ్గంతులలో ఒకరు. వారు మా విద్యా వంశంలో చేరిన వారు-అంటే చెళ్ళపిళ్ళ వేంకటకవిగారి శిష్యులు. నాకు రఘుపతి వేంకటరత్నం నాయుడు పట్ల గల యందుండే గౌరవం చౌదరిగారి యందు కలదు" అన్నారు.

నవయుగ కవి చక్రవర్తి జాషువా "ఆంధ్ర దేశంలో హేతు వాదంతో సాహిత్యంలో నూతన శకాన్ని సృష్టించిన ప్రజ్ఞాశాలి కవిరాజు. సామాజిక విప్లవకర్త. ప్రఖ్యాత కవులలో ఒకరు" అన్నారు.

సుప్రసిద్ధ జర్నలిష్టు నార్ల వెంకటేశ్వరరావు గారు "చౌదరిగారిది జీవ భాష. తెలుగు నుడికారం సొంపు వారికి తెలిసినంతగా మరి ఎవ్వరికీ తెలియదు పలుకుబడి బాగా వాడారు. సాహిత్య అకాడమీ నుడికారాల కోశం తయారు చేసిన సందర్భంలో కవిరాజుగారి రచనలలో కనుపించి నన్ని నుడికారాలు ఏ ఇతర రచనలలోనూ కనుపించలేదు. సొంపు లుట్టిపడే నుడికారాలు కవిరాజు రచనలలో కోకొల్లలుగా ఉన్నాయి" అన్నారు.

దర్శనాచార్య కొండూరి వీరరాఘవాచారిగారు "రామస్వామి చౌదరిగారి కవిత్వము ఎదురులేనిది, తెలుగు పొంకము, బింకము, తీరు తీయములు మరొకరి కవితలో లేవు" అన్నారు.

యం. పట్టాభిరామిరెడ్డిగారు చౌదరిగారిని పద్యాలలో యిలా ప్రశంసించారు

*"తెలుగు గడ్డను గులికించు తెలుగుభాష
నీదు కలమున చెలరేగి, వింగి కెగసి
వెల్గుచున్నది మింట రే వెల్గుమించి
గండుమీరిన కవిగాండ్ర, గుండెలదర

అంకుశము నీదు గీత, నిరంకుశులకు
నూతనాక్తుల సారించు పాతకథల
భావ వారాశి వడపోత భవ్యచరిత
నిన్నుబోలిన కవిలేడు నీకు నీవె."

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు *ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నాటక పరంపరలో "భావకవితా యుగం తరువాత 'హేతువాద యుగం' ప్రారంభమయినది. హేతువాద ధోరణిలో నవ్యకవులు భావాల లోనూ. ఛందస్సులోనూ క్రొత్త ప్రక్రియలను అవలంభింప సాగారు. ఈ యుగంలోని కవులందరికీ "ఆది పురుషుడు" త్రిపురనేని రామస్వామి చౌదరి. ఆయన సూత పురాణమొక మహాగ్రంథం. కవిత్వం ప్రబంధ కవుల కవిత్వ మల్లే ఉంటుంది. ఆయన పద్య రచనాశైలి ఎంతో మధురంగా ఉంటుంది. భావాలు పురాణాలకు వ్యతిరేకం. మొదట విప్లవం తెచ్చింది ఆయన. ఈ విప్లవ వాదులు నిజంగా విప్లవవాదులైతే. ఆయన కొక శిలా ప్రతిమ వేయవలె" అన్నారు

జాస్తి జగన్నాథం *"రామస్వామి చౌదరిగారు ప్రతిభావంతుడైన ప్రథమశ్రేణి కవి. అంధ విశ్వాసాలను, అసంబద్ధ కథలను విమర్శించే

---

* ఈ నాటకములు ఆకాశవాణి హైదరాబాదు, విజయవాడ కేంద్రముల నుండి ప్రసారం చేయబడినవి. - హేతువాదయుగం

వ్యాసం : జూన్ 1962 'భారతి'లో ప్రచురించబడినది

*"రసిక శేఖరుల జోదలలూన్చిన విప్లవకవి త్రిపురనేని కవిరాజు" అను వ్యాసం ఆంధ్రప్రభ 17 జనవరి 1961

*ఆంధ్రప్రభ 28-1-1968

టప్పుడు సునిశిత హాస్యంతో, అవహేళనతో పదునెక్కి ఉంటుంది రామస్వామిగారి కవిత్వం. ప్రతిపక్షులనుగూడా నవ్వించే హాస్యమది. కొరడా కొనల వలె చుర్రున తగిలినా పైకి మాత్రం మనతో పాటే నవ్వుతాడు ప్రతిపక్షి ఈ రకమైన కవిత్వం తెలుగు సాహిత్యం మొత్తంలో ప్రాచీనాధునాతన కృతులలో ఎక్కడ వెదికినా కనుపించదు ఒక్క కవిరాజుగారి కృతులలో తప్ప. అదీ ఎక్కడో ఒకటీ అరా పద్యాలలో కాక గ్రంథమంతటా పరివ్యాప్తమై ఉండటం మరీ విశేషం' అన్నారు.

హైదరాబాద్‌లో కళానికేతన్ ఆధ్వర్యాన 20-4-1959న జరుపబడిన "రామస్వామిచౌదరిగారి సాహిత్య సమాలోచన"సభలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ప్రసంగిస్తూ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు "మంచి హేతువాది" శాస్త్రదృష్టికలవారు. అన్నింటా విప్లవం కోరిన కవిరాజు కవితా పద్ధతులలో మాత్రం పాత పోకడలే పోయి, వారి ఔదార్యం చూపించారు" అన్నారు.

ఆంధ్రవిశారద పూజ్యశ్రీ తాపీ ధర్మారావుగారు మాట్లాడుతూ "తాత ముత్తాతలంతా కత్తిపట్టి పోరాడిన కుటుంబములో జన్మించిన రామస్వామి చౌదరిగారు కలంపట్టి పోరాడారు. జాత్యహంకారం, సమాజంలో హెచ్చుతగ్గు లుండరాదని భావించారు. ఆయన సిద్ధాంతం బ్రాహ్మణ ద్వేషంకాదు, అబ్రాహ్మణోద్ధరణము" అన్నారు.

"రామస్వామిచౌదరిగారు పురాణాలన్నింటిని సాకల్యంగా చదివి అందలిలోటుపాట్లను సోదాహరణంగా నిరూపించారు. ఎందరో ఉద్దండ పండితులు వారితో వాదించి ఓడి పోయారు. వారి పాండిత్యము, ధర్మాచరణ దీక్ష మన కందరకూ ఆదర్శప్రాయము" అన్నారు కొపరాజు రాఘవయ్యచౌదరిగారు.

వాఙ్మయ మహోద్యమ పట్లమూడి గోపాల కృష్ణయ్యగారు తమ ప్రసంగంలో 'ప్రాచీనకవులలో నన్నెచోడుడు ఎంతగా విప్లవం తెచ్చాడో అధునాతనులలో రామస్వామిచౌదరి అంతగా విప్లవం సాధించారు', అన్నారు మొత్తంమీద ఉపన్యాసకులందరూ కవిత, సమత, జాతీయత ఈ త్రితయం మూర్తీభవించిన వ్యక్తి చౌదరిగారు అని అభినందించారు.

చౌదరిగారి కవిత్వం అపూర్వ విషయ భూయిష్టమై, చమత్కార పూరితమై, సుడికారపోషకమై, శయ్యా ప్రసన్నతా హృద్యమై ధారాళతా విశిష్టమై. బహు పండిత ప్రశంసా పాత్రమై విరాజిల్లుతూ ఉంది. ఇలాంటి విప్లవాత్మకమైన కవితను భూసురవర్గం పాతాళలోకానికి అణగద్రొక్కాలని బ్రహ్మాండమైన ప్రయత్నం చేసింది, కాని ప్రయత్నం ఫలించలేదు.

ఆనాటి కానాటికి కవిరాజుగారి భావాల ప్రచారం ఉధృత రూపం దాల్చ సాగింది. ఈనాడు వారి గ్రంథాలు చదివేవారి సంఖ్య అధిక మయింది. వారి కవితా మాధుర్యానికి తన్మయులయిన రసపిపాసకు లెందరో ఆంధ్రదేశం నలుచెరగులా ఉన్నారు. చౌదరిగారి చిత్ర పటం అనేక ఇండ్లలో అలంకరించబడి ఉన్నది. అనేక మంది ఏకలవ్య శిష్యులు వారిని ఉపాసిస్తున్నారు.

ఈనాడు ఆంధ్రదేశంలోని ముఖ్య పట్టణాలలోనే గాక మారు మూల గ్రామాలలోసైతం కవిరాజు వర్ధంత్యుత్సవాలు జరుగు తున్నాయి. ఈ సందర్భంలో ఐతానగర వాస్తవ్యులు కన్నెగంటి జగ్గయ్యగారి కృషి. పట్టుదల ప్రశంసనీయం.

* Inaugurating the 25th death anniversary of Kaviraju Tripuraneni Ramaswami Choudary Sri C. N.

Annadurai Chief Minister of Madras paid tributes to him as a great poet, social reformer and Rationalist.

He said that the people should wage a war to achieve rationalism which was very difficult. Ramaswami found society divided into water tight compartments on the basis of caste and creed. Vast masses of people were ignorant and superstitious. After analysing the reasons for this, Ramaswami found that this was due to their epics, puranas and scriptures being based on superstition. Even people with modern education and scientific thinking were not prepared to leave their superstitious beliefs. They would invoke the karma theory to explain the present ills and miseries. Such fatalism cut deeply at the roots of socialism Mr. Annadurai said and appealed to the people who really believed in socialism to support rationalism. He suggested formation of an all-party united front of rationalists.

Dr. Habibullah Beig, Mayor of Madras said that Ramaswami believed and preached that all man kind was one.

ఈ సభలలో పాల్గోవడం మహాద్భాగ్యంగా ప్రజలు భావిస్తున్నారు. వేలాది ప్రజలు ఈ సభలకు హాజరవుతున్నారు. సజ్జా వీరయ్యగారు, కవిరాజుగారి పద్యాలు చదువుతూ ఉంటే వారి కవితా ప్రాగల్భ్యానికి ప్రజలు హర్షధ్వానాలు చేస్తున్నారు. కాని ఆంధ్రదేశంలో ఈ నాటి వరకూ కవిరాజుగారి స్మృతి చిహ్నంలేదు. మన కవులను మనం విస్మరించాం. ఇదిచాలా శోచనీయమైన స్థితి.

---

*Indian Express 30-1-1968

# తాత్త్విక దృష్టి

కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు నాస్తికులని ప్రతీతి. వారు నాస్తికులే (Atheist) కావచ్చు. ఆయనను కొందరు శూన్య మతవాది (Nihilist) అన్నారు. మరికొందరు ఐకొనొక్లాస్ట్ (Iconoclast) అన్నారు. ఎవరు ఏమన్నప్పటికి భారతీయ తత్వ శాస్త్రాన్ని పరిశీలించి చూస్తే నాస్తికులలో కూడా భేదాలున్నట్లు మనకు బోధపడుతుంది. ప్రకృతియే సృష్టికర్త. కాలమే లయికారుడు. మానవుని సుఖ దుఃఖాలకు, పుణ్యపాపాలకు సంబంధం లేదు. స్వర్గ నరకాలు వట్టి అభూతకల్పన. ప్రపంచమే నిత్యము అని చెప్పబడి. నాస్తికత్వమని నిందించబడే ఈ "హేతువాదం" షడ్దర్శనాలలోనే విరివిగా గోచరిస్తుంది ప్రకృతిని ఆధారంగా తీసుకొని ప్రపంచాన్ని వ్యాఖ్యానించారు సాంఖ్యులు. ప్రపంచం మూల పదార్థాలవల్ల ఏర్పడిందని అణువాదానికి బీజాలు చల్లారు వైశేషికులు. మానవాతీత శక్తులను ఖండించి జ్ఞానం మానవునిలోనే కలుగుతుందని వాదించారు. నైయాయి కులు ఇలాగే కార్యకారణ సంబంధం ద్వారా సృష్టి జరుగుతున్నదన్నారు బౌద్ధులు. పదార్థం పరిణామం చెందడంవల్ల చైతన్యం కలుగుతున్నదని పేర్కొన్నారు చార్వాకులు. ఈ విధంగా ఈ సిద్ధాంతాలన్ని అనుభవము పరిశీలన మాత్రమే మానవ విజ్ఞానానికి సాధనాలని ప్రతిపాదించాయి. ఇవన్నీ నాస్తిక మార్గమే అయినప్పటికీ, నాస్తిక వాదులను స్థూలంగా రెండు రకాల వారుగా మనం విభజింపవచ్చు.

మొదటి రకంవారు ప్రత్యక్ష నిదర్శనంతో కూడుకొన్న భౌతిక విలువలను తప్ప మరే విలువలనూ అంగీకరించరు. అణు సంయోగం

వల్ల ప్రకృతి ఏర్పడిందని, వియోగం సంభవించినప్పుడు విడిపోతుందని మాత్రమే చెపుతారు. దీనివల్ల ఈ ప్రపంచంలో, మానవునికి తను మరణించే వరకూ బ్రతకడం కంటే వేరే ఆదర్శం లేకుండా పోతుంది. మానవుడు ఈ పని చేయవచ్చు. ఈ పని చేయకూడదు అని నిర్ణయించడం అసాధ్య మౌతుంది ఈ దృష్టి భౌతిక విలువలను అధిగమించిన ఆధ్యాత్మిక విలువలను గాని, నైతిక విలువలనుగాని, నైతిక విలువలను మించిన ఆధ్యాత్మిక విలువలనుగాని అంగీకరించదు. అందువల్ల నిత్య జీవితంలో మానవునికి ఆనందాన్ని, ఆహ్లాదాన్ని గలిగించే అనేక విలువలను తుడిచివేస్తుంది.

ఇక రెండవరకం వారు పై విలువలన్నింటినీ అంగీకరిస్తారు. అయితే అవన్నీ మానవునిలో నుండి ఉద్భవించినవే గాని, మానవునికి సంబంధించని, మానవునికి విడిగా ఉన్న మరో శక్తివల్ల జనించినవని అంగీకరించరు. వీరి దృష్టే సమగ్రమైనదని చెప్పవచ్చు జీవితంలో కనుపించే అన్ని విలువలను సమన్వయం జేసి ఒకసంపూర్ణ సిద్ధాంతాన్ని సృష్టించడానికి వీరు ప్రయత్నిస్తారు.

అయితే ఈ రెండు రకాలవారికీ మానవుడే ముఖ్యం. మానవుడు సర్వస్వతంత్రుడు. మానవుని నడిపించే మరే శక్తినీ వీరు అంగీకరించరు.

రామస్వామిచౌదరిగారి నాస్తికత రెండవ రకానికి చెందినది. కొంత మంది—కవిరాజుగారి సిద్ధాంతంపట్ల సానుభూతి ఉన్నవారుకూడా ఆయన నాస్తికత పూర్వ గ్రంథాలను విమర్శించడంతోనే ఆగి పోయిందనడం మనం వింటున్నాం. ఇది పొరపాటేమో ననిపిస్తున్నది. ఆయన

గ్రంథాలలో ఆధ్యాత్మిక విలువలను సమర్థించి, వాటికోసం తహతహ లాడిన ఘట్టాలు అనేకం కనిపిస్తాయి.

సూతపురాణం ప్రథమాశ్వాసంలో గంగాభవానిని, గంగా యమునల సంగమాన్ని చూచి వారెంత ఉప్పొంగి పోయారో చూడండి:

శా. "అంగవ్రాతము సేపదేరెఁ బధికాయాసంబు పోకారె, పై
పొంగారెన్, మునిరాడ్డిదృక్ష ద్విగుణీభూతంబుగాఁ గూరె, ము
న్గంగా నా తెలినీటి యందున బుభుక్షా తృష్ణలుందీరె, హా !
గంగా స్నాన మహాత్మ్యమప్పుడుగదా కన్పట్టె నా బుద్ధికిన్".

గంగా నదిలో స్నానం చేయటంవల్ల వచ్చే మహాత్మ్యం వారి కప్పుడు కన్పించిందట ! గంగా యమునా సంగమం వారిని యింకా ముగ్ధుల్ని చేసింది.

గీ "మున్క మాత్రాన నెచ్చోట ముక్తి కల్గు
నట్టి ఘోరాఘమర్షణమైన భవ్య
జహ్నవీ యమునా నదీ సంగమంబుఁ
గాంచినాఁడను గన్నుల కఱవు దీఱ"

గంగా యమునా సంగమం వారిని తన్మయులను జేసింది. మామూలు నాస్తికవాదికి ఈ సంగమం ఇంతగా తన్మయత్వం కలిగించే అవకాశంలేదు. రెండు నదులు కలవడం వారిని ఉద్రేక పఱచ వలసిన అవసరంలేదు. కాని రామస్వామి చౌదరిగారి నాస్తికతలో నైతిక విలువలకూ, ఆధ్యాత్మిక విలువలకూ చోటుండబట్టే ఈ సంగమం వారిని ఇంతగా ఉప్పొంగ జేసింది. గంగా, యమునల సంగమం తెల్లని

భస్మం పూసుకొన్న శివుని శరీరం మీద వున్న నల్లని సర్పాల వెలుగువలే కన్పించిదట! సీరి దేహంమీద ఉత్తరీయంలా కన్పించిదట! నీలిమ ఆకాశంమీద అటూ-ఇటూ తిరిగే స్వచ్ఛమైన శరత్కాలపు మేఘాల సమూహం లా కన్పించిదట! పాలసముద్రము మీద పవళించి, యోగ నిద్రా స్థితిలోఉన్న మాధవుని లా కన్పించిదట. ఓహో! ఏమి తన్మయత!! ఇటువంటి తన్మయత్వం కలిగించిన సంగమంలో వారు స్నానం చేయక తప్పలేదు.

గీ. "సంగమ స్నానమాడిన సద్దచేసి
పూర్వ సంచిత పాపంబు పోవుననుచు
బుటుకు బుటుకున జలములో మున్గినాఁడ
నలము నివముచే మేనెల్ల జలదరింప"

ఇదే విధంగా మనకందని విలువలకోసం ఆరాటపడటం తప్ప తానుమరచి వర్ణించడం చౌదరిగారి గ్రంథాలలో అనేకచోట్ల కన్పిస్తున్నది. వారి గ్రంథాలను జాగ్రత్తగా పరిశీలించి చూస్తే మనపూర్వ గ్రంథాల మీద వారికి పూజ్యభావమే ఉన్నట్లుగానూ, వాటి మీద భూసురులు స్వార్థంతో చేసిన వ్యాఖ్యానాల మీద విపరీతమైన నిరసన ఉన్నట్లూ మనకు బోధపడుతుంది. అసలు పూర్వ గ్రంథాలను విమర్శించాలనే ఆలోచన చౌదరిగారికి ఎందుకు కలిగింది? సూతపురాణం ప్రథమా శ్వాసంలో ఈ విధంగా పేర్కొన్నారు.

"చదివితినేఁ బురాణముల సాంగముగా భయ భక్తియుక్తులన్
జదువఁబెగాని యందుఁగల వందియముల్ సతతంబు హెచ్చుడున్
చెదలక చిత్తశాంతి పరిపూర్ణముగా భ్రమియింపు చుండ నా
మది మదినుండదయ్యెనొక మార్గమయేనియుఁ దోఁచదిమ్మెయిన్"

చౌదరిగారు సకల పురాణాలనూ సాంగోపాంగంగా చదివారు. అందలి పరస్పర ఘోర విరుద్ధ గాథలు వారి కనేక సందేహాలను గలిగించాయి. ఆ సందేహాలను తీర్చుకోడానికి విజ్ఞాన ధురంధరుల మనిపించుకొనే వారివద్దకు వెళ్ళారు. ఆ పండితులు వారి సందేహాలను తీర్చడానికి బదులు అసలు అలా ప్రశ్నించడమే తప్పన్నారు.

ప్రశ్నించడమే తప్పు అని పెద్దలనేటప్పటికి రామస్వామిచౌదరి గారిలో వున్న "హేతువాద శక్తి" విపరీతంగా విజృంభించింది. సత్యాన్వేషణకు పూనుకొనేటట్లు చేసింది.

"గ్రీకుతత్వవేత్త పైతాగరస్" ''Man is the measure of all things'' అన్నారు. అదేవిధంగా ఆంధ్రదేశంలో దేవుణ్ణి ఆవలకు నెట్టి, హేతువాదంతో మానవుణ్ణి నిలబెట్టడానికి మొట్టమొదటి ప్రయత్నం చేసినవారు కవిరాజుగారు. వారి భగవద్గీతలోని మొదటి పద్యం ఈ విషయాన్ని రుజువు చేస్తున్నది.

తే. 'శంకరుని యంత వేదాంత శాస్త్రవేత్త
యనియెగా 'అహమ్ బ్రహ్మాస్మి' యనచుగాన
నాకు నేనె నమస్సులొనర్చుకొందు
నాదిమధ్యాంత శూన్యుండ నైతినంచు"

ప్రపంచంలోని దురాచారాల రూపుమాపి, నీతిని, ఆధ్యాత్మిక దృష్టిని నెలకొల్పడానికి రామస్వామిగారు సూతపురాణం రచించినట్లు ఈ క్రింది పద్యంవల్ల తెలుస్తున్నది.

ఉ. "ధర్మము ధర్మమంచుఁ బెఱదారులఁ ద్రొక్కుచు నానలేక దు
ష్కర్మము లాచరించు కలికాలపుఁ బెద్దలఁగాంచి తప్పుఁడై
మర్మము విప్పిచెప్పి మనుమార్గమునన్ నడిపింప లోకమున్
నిర్మలుఁడైన సూతముని నీతులు పల్కెడు నాముఖంబునన్"

రామస్వామి చౌదరిగారు భగవద్గీతలో గూడ బోధించినది సనాతన ధర్మం. అంటే వేదం, మతం మూలంగాని సనాతనధర్మం, ఎచ్చు తగ్గులు లేని మానవుని ఆదిమ ధర్మమే ఆ సనాతన ధర్మం. ఆ ధర్మోద్ధరణకే వారు గీతామృతం కురిపించారు. అందులో బ్రహ్మనాయుడు బాలచంద్రునితో యిలా అన్నాడు ;

చ. "మతములె జ్ఞానబోధకపు మార్గముఁ జక్కగచెప్పి లోక స
మ్మతమగునట్టి ధర్మము సమాచరణంబునఁ బెట్టుకున్న నే
గతిఁ దరియింప వచ్చును ? నొకానొకఁడేనియు ముక్తి బొందునే ?
మతమను మాట మోసముసుమా! యిదె మూలము ధర్మపీడకున్."

చ. మతములె పుట్టకున్న యెడ మారణ కర్మములిన్ని సాగునే
ప్రతి దివసమ్ము భారత ధరాస్థలి ? నే నిటువంటి కర్మ సం
తతులను సైఁచువాఁడనె సనాతనధర్మ మొకండె యంచు న
మ్మి తిరుగువారి కెల్లపుడు మేలొదఁగూర్చుచునుందుఁ బ్రేమమై."

ఒకప్పుడు పుణ్యభూమిగా గణనకెక్కిన మనదేశం నైతికంగా పతనమైనందుకు రామస్వామి చౌదరిగారు ఈ విధంగా పరితపించారు ;

చ. "చదివితిఁ బుణ్యభూమియని శాస్త్రములన్ మనభారతంబు నేఁ
డది విపరీతమై జనులకందఱికిన్ బొడఁకట్టుచుండె నే

లిదముగ, సత్య శౌచములులేవు, దయారతిలేదు, ధర్మ సం
పదయును లేదు, ఘోరకలిమాయెనె ! ఈ గతియేమి చక్రి! ఈశ్వరా!"

సత్యశౌచాలు, దయారతి, ధర్మసంపద మనదేశంలో నామ మాత్రమైనవవి వాటిని పునరుద్ధరించటానికే కవిరాజు కంకణం గట్టుకొన్నారు. ఈ దృక్పథమే వారు రచించిన "కుప్పుస్వామి శతకం" లోనూ "ధూర్త మానవా" లోని ప్రతి పద్యంలోనూ గూడా కనిపిస్తున్నది మానవునికి 'నీతి' ముఖ్యమని ఆ గ్రంథాలు ఆదేశిస్తున్నాయి. పూర్వ గ్రంథాలు, మానవునికి వుండవలసిన నీతిని పమ్మ్మచేయదానికి ఉపయోగపడుతున్నపుడు వాటిమీద కవిరాజు ఎదురు తిరగటం సహజమే గదా ! వారి తిరుగుబాటు స్వభావం ఇది అవి నేను భావిస్తున్నాను. ఈ సందర్భంలోనే రామస్వామి చౌదరిగారి ఉద్యమరూపు రేఖలను గూర్చి బ్రహ్మానందగిరి స్వాములవారు వెల్లడించిన అభిప్రాయాన్ని గూడా తెలుసుకోవలసి ఉన్నది. *కవిరాజుగారు నాస్తికులని ప్రపంచమునకు ప్రతీతి కలదు. వారి గ్రంథములను చదివితిమి. ఉపన్యాసములను వింటిమి. వారితో అనేకపర్యాయములు సంభాషించితిమి. కాని మాకెచ్చటనూ నాస్తికత్వము కనుపించలేదు. ప్రతిచోటను దైవము పేరను, ధర్మము పేరను, మతము పేరను, నాచారము పేరను జరుగుచున్న యత్యాచారములు నన్యాయములు. దోపిడులు మొదలగునవి మాత్రమే గర్హింపబడెను." అన్నారు శ్రీ బ్రహ్మానందగిరి స్వాములవారు.

గోపరాజు రామచంద్రరావుగారు* "కవిరాజు ఆస్తికుడా - నాస్తికుడా అను విషయాన్నిగూర్చి" గతాను గతిక లోకః నలోకః పారమార్థికః

---

*కవిరాజు సన్మాన సంచిక

*ఆంధ్రప్రభ 2-2-1961

అను భావమును మనస్సునందుంచుకొని కవిరాజు "హేతుదృష్టిని కల్గించుటకు జీవితమంతా వినియోగించారు" అన్నారు.

త్రిపురనేని రామస్వామిగారి ఫిలాసఫీ ఏమిటి ? అని ప్రశ్నించే వారు లేకపోలేదు. అలాంటి వారికిదే నా సమాధానం. కవిరాజుగారికి ఈ ప్రపంచం తలాతోకా లేనిదికాదు. ఒక అనాది పదార్థం నుండి యిది పరిణామం జెందినదని, దీనికొక ఆదర్శం ఉన్నదని వారి అభిప్రాయం. మానవుడు దుష్టస్వభావాన్ని ఎదలుకొని, నీతిని, సత్యాన్ని నమ్ముకొని, జీవితం గడిపితే, స్వచ్ఛంగా, నిర్మలంగా వెలుగు తున్న జ్యోతిని చేరుకోగలడని, అలా చేరుకోవడమే మానవుని ఆదర్శ మని వారు తలంచినట్లు కన్పిస్తున్నది. అందుచేత వారు త్రిమూర్తులను క్రీస్తును, మహమ్మదును, పోతరాజు, అంకాలమ్మ మొదలగు దేవవర్గను "ఇట్టివారికి నాగోడు చెప్పికొన్న, అర్తురా తీర్తురా పట్టి యడియానగాగ" అని అపహాస్యం చేస్తూ పోతన కంటె మిన్నగా—

ఉ. "ఏది చరాచరంబయిన సృష్టికి సర్వము మూల కారణం
బేది మునీశ్వర ప్రతతికేని యగోచరమైన దొడ్డ వె
ల్గేది లయాంతమందయిన నించుక వైకృత మందకుండు, నే
తాదృశ నిత్య సత్య పరతత్వ మహత్వము నాశ్రయించెదన్."

అన్నారు. మునీశ్వరులకు కూడా అగోచరమైన 'దొడ్డ వెలుగు'ను మానవుడు ఆశ్రయించేటట్లు జేయడానికి ప్రపంచంలో నున్న చెడును మోసమును నిర్మూలించవలసిన అవసరం ఉంది. ఈ మాయాజాలాన్ని నిర్మూలించగలిగినప్పుడే ఆ "దివ్యజ్యోతి" యొక్క ప్రభావాన్ని మానవుడు సరిగ్గా స్వీకరించగలుగుతాడు. ఇందులకుగాను జాతి, మత, కుల

వివక్షతలు లేకుండా ప్రజలందరికూ క్రాంతిబాటను జూపిన మహనీయుడు రామస్వామిచౌదరిగారు. *కవిరాజుగారిని "నాస్తికులు" అని "బ్రాహ్మణ ద్వేషి" అని భావించటం పొరపాటని, కుల, మత వివక్షతలు సమసిపోయి, సమతాభావం వ్యాప్తి కావడమే వారి ఆశయమని" అన్నారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

సమతాసిద్ధాంత తత్త్వవేత్తలైన రామస్వామి చౌదరిగారు నిస్సందేహంగా మహాపురుషులు. మహాపురుషుల జీవితాలు మహోన్నతమైన లక్ష్యాలను గుర్తుజేస్తాయి. మహాపురుషులు వారిజీవితాలు చాలించి కాలగర్భంలో కలసిపోయేటప్పుడు ఈ కాలమనే ఇసుక తిన్నెలపై వారి అడుగు జాడలను వదలివేసి పోతారు. ఆ అడుగు జాడలను అనుసరించడమే భావి తరాల వారి కర్తవ్యం



"పుట్టిరి, పెరిగిరి, గిట్టిరి
చెట్టులు పదివేలు ; నీవు చేపట్టితి పీ
పుట్టువు చరితార్థంబుగ
గట్టిగ ధర్మంబు కీర్తికాయుడవగుచున్."

---

* ఆంధ్రపత్రిక [దినపత్రిక] 26-ఏప్రియల్ 1959